బ్రహ్మపుర

# వేగుఁజుక్క గ్రంథమాల

20వ మరీచి

యగు

## విభ్రమ రాఘవము

అను గ్రంథమున ప్రథమ భాగమగు

# పరిణయ విభ్రమములు

అను

అద్భుత పౌరాణిక నవల.

ఇత్యాది

☞ "వాఁడేవీఁడు", "నేనే", "కాలూరాయి" అను స

నిరూపక నవలాశిరోమణుల గ్రంథకర్త యగు

మ॥ శ్రీ॥ దేవరాజు వెంకట కృష్ణారావు పంతులుగారు

రచియించిరి.

~~వేగుఁజుక్క చే ప్రకాశితము~~

మొదటికూర్పు

వేగుఁజుక్క ముద్రణాలయము, బరంపురం.



AUGUST 1925 ] [ *Price 1—8—0.*

సీ. కనుఁగొన జానకీ ♦ కరపద్మ యుగమునఁ
బద్మరాగముల వై ♦ భవముఁ బొంది,
నిస్తుల రఘురామ ♦ మస్తకన్యస్త ప్ర
శస్త కుందంబులన్ ♦ సరణిఁ గ్రాలి,
ఘన ఘనాఘన కాయ ♦ కాంతి సంయుతములై
యింద్రనీలంబుల ♦ యొప్పుఁ గాంచి,
కటి తటంబునఁ గ్రాలు ♦ కాంచనాంబరమునఁ
బొదివిన వజ్రాళి ♦ పొలుపుఁ దెలిపి,

గీ॥ పరమ పావన గంగాభ ♦ వాఁగనిన
విమల పదముల నఖకాంతిఁ ♦ బెంపు నింపు
రామచంద్రు వైవాహిక ♦ ప్రస్తవోక్త
లార్యులకు నిత్య శుభదంబు ♦ లగును గాక.

# Mysteries of Rama

Vol. I

## Mysteries of Marriage

OF

## *JANAKI*

BY

**Mr. D. V. Krishna Rao,**
*Author of*
" 'tis He" ; " 'tis I"
*AND*
"KALURAI."

ERHAMPORE, (Ganjam.)
INDIA

 [ *Price 1—8—0.*

# Foreword

"There are an Hundred faults in this thing and an hundred things that might be said to make them beauties. But it is needless. A book may be interesting with numerous errors or it is very dull without a single absurdity."

*Goldsmith.*

ఉ. తప్పులకేమి లోపము శ♦తంబయినన్ గనుపట్టుఁ, దప్పులన్
ఒప్పులఁ జేయు నంశములు ♦ నుండకపోవు శతాధికంబుగన్
దప్పులు లేక పుస్తకము ♦ తప్పక చప్పగనుండవచ్చు, నెం
దొప్పులు లేకయున్ జదువ♦ నువ్విళులూరఁగవచ్చునారయన్

ఉ. తప్పులకుం గొఱంతయె? శ♦తంబని లెక్కిడవచ్చు; దప్పులం
దొప్పులకుప్పలం జొనుప♦ నోపిన యంశము లెన్నియేనియున్
జొప్పడకున్న? దోసమును♦ జూప రవంతయు లేనిపొత్తముల్
చప్పని వెన్నియుండవు? దొ♦సంగులపోవని చెప్ప నొప్పియున్
మెప్పులఁగొన్న కావ్యముల♦ మేలుగణింపుఁడొకింత నాత్మలోన్.

భా॥ నృసింహాశర్మ.

# సంపాదకీయము

శ్రీమద్వాల్మీకి రామాయణ కథ యెల్లరకును విశదమైయున్నది. (ఈ కథ ననుసరించి తులసీదాస మహాకవి రచించిన కథా విధానము మా పాఠక మహాశయు లిప్పటికి గొంత వఱ కెఱింగియే యుందురు.) "రాఘవేశ్వరు చారిత్రము నెవ్వరెన్నిగతులన్ వ్రాసిచ్చినన్ జాలదే" అని కంకంటి పాపరాజు పలికినట్లు అనేక రుచులు యీ రామాయణ కథయందు కల్పించుట కవకాశ మున్నది,

అట్టియవకాశము గైకొని మ॥ శ్రీ॥ దేవరాజు వేంకట కృష్ణారావుగా రిత్యాది రచియించిరి. "వాండేమీడు" "నేనే" "కాలూరాయి" అనునిరూపకములమూలమునమాచందాదారులకు చిరపరిచితులగుటం జేసి, వారిని గూర్చి మే మధికముగ వ్రాయనవసర ముండదు. రావణుని బారినుండి సీతను దప్పించుటయేగాక వానికంటనైనను బడకుండ తుదివరకు నామెపవిత్రతను గాపాడుటయందును, రావణుడు మాయసీత నపహరించి నిజ సీత యను భ్రమలో నిజ నివేశమున కేగునప్పుడును, గ్రంథకర్త కల్పించిన విభ్రమములు ప్రశంసనీయములు. ఇట్లెన్నని వ్రాయగలము. ఇంతయును తినబోవుదాని రుచి దెలుప నేల! అప్పటి చరిత్రాంశములతో, భూగోళ పరిస్థితులతో, నెన్నెన్నో (Re-searches) రహస్య పరిశోధనలతో తదితర ముఖ్యాంశములతో ననేక గ్రంథముల సహాయ్యమున నియ్యది నవలారూపమున వ్రాసిన మా గ్రంథమాల కొసంగినందులకు గ్రంథకర్తగారి నభినందించుచు గ్రంథవిస్తర భీతి నింతతో విరమింతుము.

సంపాదకుడు.

# గ్రంథకర్త్ర పీఠిక

ఇదివరకే నాచేరచియింపబడి, "వేగుంజుక్క"చే బహుమతింప బడిన వాఁడేవీఁడు; నేనే; కాలూరాయి యను నీ మూడు నిరూపక నవలల వలన నే నిదివరకే ఆంధ్ర లోకమునకు బరిచయుండను.

ఇప్పటికి రచియించినవి కృత్రిమ రత్నములే కద యనియు, నికనైన కల్పనా విభూషావహమైన పూర్వ వృత్తమురచియించిన నయ్యది జాతిరత్నము గనుకదా యనియెంచి యిదివర కెందరెందరో వ్రాసి యున్నరామాయణ కథా ప్రాశస్త్యత నింకను నెన్నో భావములతో నెన్నోరామాయణములుగా రచించుటకు వీలుండుటను, నే నీ గ్రంథము రచియించుటకు సాహసించితిని. కథా విధాన మందలి స్థూల సూక్ష్మతల గ్రహించుటకు నే నీ గ్రంథము రచియించుటలో పెక్కు రామాయణములును, యితర తెనుగు గ్రంథములును, ఆంగ్ల సారస్వతము నుండి పెక్కు గ్రంథములును, రాముని కాలము నాటి, రావణుకాలమునాటి, తత్పూర్వ కాలములనాటి, ఆర్థిక, చారిత్రిక, భూగోళ విషయిక, విశేషయముల గ్రహించ గోరి పెక్కు గ్రంథములు బరిశోధింప వలసి వచ్చినది. మరి యింకను మున్ముందు "వనవాస విభ్రి" మీది తరువాతి కథను రచియించు పట్ల నింకెన్నో గ్రంథముల బరిశోధింప వలసి యున్నది.

శ్రీరామకథను విభ్రమ నిలయముగాజేసి, నవలను రచియింపుమను నీ తలంపునకు బీజము వేసిన బ్ర॥శ్రీ॥ నేమాని వేంకట నృసింహశాస్త్రిగారికిని, తదనంతరము కథావిధానమున తగు సలహాల నిచ్చుచు వచ్చిన మ॥శ్రీ॥ మంచ వెంకటేశము పంతులుగారికిని, భాషా విషయమున, పౌరాణిక చర్చలను, పాత్రపోషణాదులను,నాకుసాయపడిన బ్ర॥శ్రీ॥గుమ్మలూరి లక్ష్మీనృసింహశర్మ గారికిని, ఆదిభట్ల తరిణయ్య సిద్ధాంతి గారికిని, బ్ర॥ శ్రీ॥భాగవతుల నృసింహ శర్మ గారికిని, మత్కృతి నమస్కార శతంబు లొసంగు చున్నాడను.

"విక్రమ రాఘవము" అను పేర రామాయణ కథ నంతను నవలగా వ్రాయబూని, కథా విషయము ననుసరించి నాలుగు భాగములుగా భాగించి, అందు ప్రథమ భాగము "జానకీ పరిణయ" కథగల యీ ఖండమునకు "పరిణయ విక్రమములు" అను పేరిడితిని. ఆంధ్రలోక మీగ్రంథము నవలోకించి, తగిన ప్రోత్సాహ మొసంగినచో, దీని తరువాయి భాగములగు వనవాస విక్రమములు, రణరంగ విక్రమములు, పట్టాభిషేక విక్రమములు అను పేర మిగిలిన మూడు ఖండములను రచియించి, కృతి కృత్యుడను కానున్నాను.

ఈగ్రంథము రచియించుటకు సాయపడినగ్రంథము నామములు

Hindu Superiority. Indian Wisdom. Ancient Geography of India Different Reviews on Ramayana, Phoenicians and their Indian Origin. వాల్మీకి రామాయణము. దూర్వాసరామాయణము, వసిష్ఠరామాయణము, విశ్వామిత్రరామాయణము, తులసీ రామాయణము, ఆనంద రామాయణము, ఉత్తర రామాయణము, విచిత్ర రామాయణము, శతకంఠ రామాయణము, లింగ పురాణము, విష్ణు పురాణము, కూర్మ పురాణము, శుక్రనీతి సారము, మొదలగు పూర్వ గ్రంథములను, హిందూదేశ కథా సంగ్రహము, ఆంధ్రుల చరిత్ర, కహ్లారమంజరి, రాణ ధర్మాత్మ్యము, మైరావణ చరిత్రము, మహావీర చరిత్రము, అనర్ఘ రాఘవము, ప్రసన్న రాఘవము, రఘువంశము, రామాయణ చంపు, బాల రామాయణము (రాజశేఖర కవి) మహానాటకము మొదలగు పెక్కు గ్రంథములు నాకెంతేని సాయపడినవి.





# శ్రీమద్రామాయణము—ఋగ్వేదము

హరిః ఓం

భద్రో భద్రయా సచమాన ఆగాత్స్వసారం జారో అభ్యేతి పశ్చాత్

సుప్రకేతైర్ద్యుభిరగ్నిర్వితిష్ఠ న్రుశద్భిర్వర్ణై రభిరామ మస్థాత్॥

భద్రో రామభద్రో భద్రయా మంగళరూపయా సీతయా సచమాన

స్సంపద్యమాన ఆసమంతాదాగా త్పితుర్నియోగవశా దరణ్యమగాజ్జారః

పరదారాపహర్తా రావణ స్స్వసారం మాతృవత్పూజ్యాం జగన్మాతరం సీతాం

పశ్చాదభ్యేత్యరణ్య గమనానంతరం సమీపే ఆగతవాననంతరం

సీతాం సేతుబంధన ద్వారా రావణే హతే

సీతాయాంచాగ్నౌ ప్రవిష్టాయాం విశ్వాసార్థ మగ్నిష్ఠాం గృహీత్వా

రామం రఘునాథ మభ్యాభిముఖ్యే నాస్థాం శుద్ధేత్యభి నివేదితవాన్

సుప్రకేతైస్స కలార్తి హారిభిర్ద్యుతిః కాంతిభిర్రుశద్భిః

కమనీయాభిర్వర్ణై రాకారవిశేషైస్తిష్ఠన్ విశేషేణ స్థితవాన్

తస్యాపాపరాధేతి తస్యోత్తరా భూయసే శుభవచనాయ॥



# విభ్రమ రాఘవము

## ప్రథమ ఖండము

# పరిణయ విభ్రమములు

## మొదటి ప్రకరణము

# అగాధము

"ఇది మొదలు మొదల వీలు కాని యీ దుర్గమ మార్గము నిర్గమించి బయనము సాగించి నియోగించిన యోగిజన కార్య మనివార్యముగ గొనసాగింప నేతేరవలయు గదా! కాయము వంగియు, కాలము వృథ సేయనొల్లక, నల్లల్లన విధ్యుక్త కార్యాచరణము భార భరితమయ్యు, మాటదాటని స్వభావమ్మున నులమ్మున నొల్ల వోయియు, వల్లె యని, పాపపు మోమోటమి కోటువడి, వడి వడి కార్యాచరణమునకుం గడంగి, బయనము సాగించు చుంటినే గాని, కార్యము గడతేర గాలి విసరున గాలు విసవిస సాగ కున్నదే! దుస్సాధ్యమున్నదే యెరుంగక మేధా శక్తి యుక్తులకును, కృత్రిమ కల్పనా చతురిమలకును, నేనే తగుదునని యెన్నిక గని, శ్లాఘింప బడియున్నను నిపు డిప్పట్టున నే గతి జన నగునో గద! వ్యవధియూ తక్కువ,

కార్యభారమా యెక్కువ; మార్గ మధ్యమున నే నెట్టి యిడుమలగుండవలసి వచ్చునో! తొలుత నీ కార్య మొనర్తు నని బాస జేసి కొంత దూరము పయనము సాగనిచ్చి యిపుడు వెను దీయ పాడిగాదు. ఇంతకును సర్వ జనామోద దాయకమును, సకల జనానంద జనకమును నగు నిట్టి కార్యము పట్ల వెనుకంజ వేయరాదు. కార్య సాఫల్యము పట్ల పట్టుదల, ఆసక్తి, దేహ మనో బలశక్తులును మాత్ర మావశ్యకములు. అబ్బా! కార్య భారమున మనోభారముచే, బ్రారంభించి యెంత కాలమో యయ్యెను, నెంతో దూరము ప్రయాణము సాగింప లేకున్నాను. ఈ వింధ్య పర్వత ప్రాంతమున నీయగస్త్యాశ్రమనికటమున, నెట్టెటులనో కాలము పుచ్చుచున్న నా కీ దూతకార్య మేలదాపురించినది ? తొలుత నౌనని దలయూపి, యిపుడు కాదన నేమి న్యాయము? తెలిసినవారు మెత్తురా? అదిగో! యీ బాటను గూర్చి నే యెవరో వచ్చు చున్నారు. కొంత దవ్వు యిన దోడుగ నుండ వచ్చునేమో; ఏమో గాని నను జూచి వడి వడి నడచు చున్నట్లున్నది. నా కొరకే కాదు గద! ఏ కొరకైననేమి? కొంత తడ పిట తడయుదు గాక."

* * * * * *

"ఓహో! చిరకాలమునకు! ఎటు బో నున్నావు? నీ స్థానమున నేరి నునిచి వచ్చితివి?"

"కార్యార్థినై ప్రభు దర్శనార్థము బో నున్నాను. నా తాపస నాథు మాగుగ నా కుమారుల నునిచి వచ్చితిని. నీ వెక్కడ నుండి...?"

" మిథిల నుండి! "

I

# అగాధము

"ఏమి విశేషములా?"

"ఔను!"

"అవేవియో నే నెరుగ వచ్చునా?"

"ఓ ఎరుగ కేమి-అవశ్యము." (నలు దిశలు పరికిం[illegible]

"ఇటు రమ్ము."

* * * * * *

వారిరువురును కొంతసేపు రహస్య సంభాషణము నెర[illegible] పిన పిదప బాటసారి ప్రకాశముగ నిట్లు పలికెను.

"ఆ కారణమున మరి నీ విటు రా నక్కరలేదు. నీవు నీ తావునకు మరలుము. కాని నే నిపుడు చెప్పినట్లే నీ పొలిమేరల గాచికొని యుండుము. నీ దూత కార్యము నే నెరవేర్తును. నీవును వయోవృద్ధవు; నీ కింకను ముందుకు పెక్కు పనులు గలుగ వచ్చును."

"ఔను-దూత కార్యభారము నీపై నిడి, యింతతో మరలుదును. రాచముని పంపు నెరవేర్పుమా; లేని యాతని యెడ మహాపరాధ మొనర్చిన పాపమునకు బాల్పడుదుము సుమా! మరువకుమా! నా కుమారుగ నిను భావించి యిదే మరలు చున్నాను."

అని పలికి యావృద్ధుఁడు దండకను గూర్చి బ్రయాణోన్ముఖుఁ డయ్యెను.

ఇక్ష్వాకు వంశజుండగు దండు డను నొక రాజు వింధ్య శైలప్రాంతమున నున్న మధుమంతంబను రాజ్యము నిర్మించుకొని పరిపాలించుచు శుక్రాచార్యుని యొక్కండగు కూతురౌ అరజ యను నామెను జూచి, మోహించి బలాత్కరించి నందున

శుక్రాచార్యుడు గోపించి సపరివారంబుగ నా దండు డను రాజు నేలపాలగునట్లు శపించుటేగాక, నాతని రాజ్యమగు మధుమంతముపై నేడు దినములు మట్టి వర్షము గురియునట్లును, జనశూన్యంబగు నట్లునుంగూడ శపించుటంజేసి యా ప్రాంతము నిర్మానుష్యమై అడవిగామారి దండక యను పేర వాడబడు చున్నది. గంగానదీ దక్షిణ తీరమునసుండి వింధ్య పర్వత పరిసరము వరకును నుత్తరమున విస్తరించి; పశ్చిమమున వింధ్య పర్వతమున కుత్తర దిశనుండి, అత్ర్యాశ్రమము, దక్షిణ వింధ్యము, దక్షిణ కోసలము, విదర్భ దేశము, దక్షిణా పథము, మలయాద్రి వరకును విజృంభించి; దక్షిణమున ద్రవిడ పాండ్య దేశముల పర్యంతమును తూర్పున నుత్కళ, కళింగ, ఆంధ్ర, చోళ దేశముల పర్యంతమును పెరిగి యుండినదై, బహుయోజన విస్తీర్ణమై, సాంద్రారణ్య సీమయై, అసంఖ్యాక ఋష్యాశ్రమ సంకులమై దశ్యాదియాతుధాన (రాక్షస) కోటి కేకరమై యుండినదే దండక.





# పరిణయ విభ్రమములు

## రెండవ ప్రకరణము

## ప్రవేశము

కాలము గడచినకొలది, కొలది కొలదిగనైన మానవ స్వభావములతో పాటు, దేశాల పరిస్థితులతో పాటు, భూగోళమునగూడ కొన్ని దేశము లంతరించిపోవుట, మరికొన్ని తావుల నూతన భూములు రూపమునొందుటయును సంభవించుచుండును. మొన్నమొన్నటి జపాను భూకంప సందర్భమున వేల కొలది చదరపు మైళ్ల జనస్థానములు జలాంతర్గతములౌట మనము తెలిసికొని యుండలేదా! ఆసియా టర్కీలోని ప్రస్తుతపు మెసపొటేమియాగా పరిగణింపబడుచున్న యూఫ్రెటీస్ టైగ్రిస్ నదుల నడిమి ప్రదేశము జర్మనీ యుద్ధ సందర్భమున కొన్ని తావుల ద్రవ్వవలసిరా నట కొన్ని లక్షల సంవత్సరములకు వెనుక హిందూదేశపు ఆదిమ నివాసులును కొండజాతులవారును నగు రాక్షస నామాంతరము గల అసురులు నివసించియుండు—'అసీరియా'—యను దేశ ముండునని మెసపొటేమియన్ ఎక్సకేవేషన్స్‌లో దొరకిన ఆ కాలము నాటి కాల్చిన యిటికె పుస్తకముల వలననున్నూ, తదితర పరికరముల

వలననున్నూ, మొనమొన్ననే కనుగొనబడియుండలేదా! అటు
లనే హిందూదేశమునకు దక్షిణదిశనున్న సింహళ ద్వీపము
1,25,58,825 సంవత్సరములకు బూర్వము, తూర్పు పడమరలకు
రెండింతలును, ఉత్తర దక్షిణములకు మూడింతలును యెక్కువ
విస్తీర్ణముగలదయ్యెను, నానాటికి జీర్ణమయి, సముద్రపు ముం
పుకులకు లోనయి, యిపుడుగానవచ్చుచుండిన సింహళము పూ
ర్వపు సింహళములోని, యారవభాగముగా నున్నది. ఆ సింహళ
మే లంక యనంబడు. ఈ సింహళము భాస్కరాచార్య సిద్ధాం
తము చెప్పిన సమముగా నిరక్షరేఖపై నున్నది; అనగా ఈ
క్వేటరుమీదనే యున్నది. ఇప్పుడు మనకు గానవచ్చుచున్న
సింహళపు దక్షిణకోణము నిరక్ష రేఖకు 6½ అంశములు (డి
గ్రీలు) మీదుగా (దూరముగా) ఉత్తరమున నున్నది. అట్లగుట
లంకాపట్టణ ముండియుండెడి ఆవు సింహళ దక్షిణభాగము
నకు 6½ డిగ్రీలు అనగా డిగ్రీ 1కి 70 మైళ్ల చొప్పున 455 మై
ళ్ళ దూరమున నుండెడి యుండును. ఇప్పుడా భాగము సముద్రపు
ముంపుకులో నన్నదని వ్యక్తమగుచున్నది. ఇయ్యది తొ
లుత మాల్యవంతునికి రాజధానియై, పదంపడి కుబేరునకు జిక్కి,
యావల నీ కథాకాలమునాటి లంకేశ్వరు నధీనమై, యాతనికి
రాజధాని యయ్యెను. నలుప్రక్కలనుండు హిందూ మహాసము
ద్రమే త్రివ్వని యగడ్తయయి గాచుచుండ, సింహళద్వీపము
చుట్టును గల కొండల దంతెలు పెట్టని గోడలై రక్షించుచుం
డ, మరియు జాలకనో యనునట్టుల సప్తప్రాకారాన్వితమై మి
న్న ముట్టుచుండునంత దీర్ఘములగు పుంగోపురములచే శోభిల్లు
చుండు నొక మహానగరము త్రికూటాచల మను నొక మహా

పర్వతాగ్రమున గన్నులకు పండువయై యొప్పుచుండు. దేవ
తా శిల్పశాస్త్ర ప్రవీణుండగు విశ్వకర్మ నిర్మితమై పర్వతాగ్ర
మున నుండుటంజేసి, యాకాశ సముద్రమున దేలుచున్నట్లు
గ్రాలునదై, కోట ప్రాకారపు గోడల కాధారముగా నగము
వలెనే యుండినతిన్నెలు కటి పురోభాగములుగను, విస్తీర్ణమగు
నగడ్తల జలములే నూతన వస్త్రములుగను, గోట బురుజులు క
ర్ణాభరణములుగను, ప్రకాశింప నొక సుందరీమణి చెలువున
చెలువారుచున్నదై, విశ్వకర్మ నిర్మితమయ్యు, నిజ వైచిత్ర్య సౌ
భాగ్యాతిశయమ్మును దిలకించి చూడ హస్తాది నిర్మితముగాక
యొకానొక మహానుభావునిచే మన స్సంకల్ప మాత్రముననే
సృష్టింపబడియుండు దానింబోలె దోపంజేయుచు, నాయలకా
పురముం దృణీకరించు నా లంకాపురము తత్స్వభావమునకు
గోపురంబై యుండు. శరత్కాల మేఘమునా దెల్లనై యొ
ప్పు పెక్కు మందిరములు విలసిల్ల, బహు జనాకీర్ణ కలకలా
రావములచే పెల్లురేగి మహాసముద్ర ఘోషముంబోలె మ్రో
గ, పెక్కు సైన్యముల సింహనాదాది ధ్వనులు బోరుకొను
చుండ, మహారణ్యముం దలపింప, తొలి ఈ జేదు పట్టణం బౌట
విటపావళిం బోలె గ్రాలుచు, బహిర్ద్వారంబుల సుందర తరంబు
లైన యుపాశ్రయంబులచే విరాజితంబై, భోగరాజులు చరి
యింప సురక్షితంబై యొప్పు భోగవతీపురంబుం బురుడింపుచు వీర
కుల శేఖరులగు యాతుధాన పుణ్యజన సంచారమ్ముచే పరిరక్షి
తంబై, శోభిల్లుచుండును. చుట్టునుండెడి యున్న పెక్కు రతనపు
గాంతులెల్ల మెఱచినవై, నవ ధాన్యముల రాసులుగల కొట్లు
కర్ణాభరణములై, యంత్రశాలలు బలువౌ యురోజములై,

యౌవనము నిండార నివ్వటిలు నొక తరుణీమణి యన నొప్పి వేయికన్నులవాని కైనను జూడ తనివి దీరజాలదు.

తదంతరమున చిత్రములౌ పద్మ, స్వస్తిక, వర్ధమాన, సంస్థా భేదములచే నిర్మింపబడిన రాజ గృహంబులచే నెంతేని నయనానందకరంబై యుండు. ఇక సార్వభౌముని యాస్థానము జూడబోదుమన్న నయ్యది భిన్నాంతరములు గలిగి మనము పోయెడి దిక్కెదియని దోపనీక, మగుడ వెలికిరా దెన్ను దెలియనీక, దిగ్భ్రమ గలుగ జేయుచుండు. తదంతరంబున సార్వభౌము దర్బారునందు అతినాథుడు, ప్రహస్తుడు, మహానాథుడు, దీరముఖుడు, దేవశత్రుడు, నికుంభుడు, దేవాంతకుడు, నరాంతకుడు నను నష్ట మంత్రులును బారులుదీర్చియుండ, వంది మాగధు లిరువంకల రజత ధ్వజపాణులై నిలచియుండ, సర్వ సేనా నాయకాధిపతి యౌ కుంభకర్ణుం డొకవంకను, నగరాధికారి యౌ విభీషణుం డొక చక్కని, దీర్ఘకాయాది రాజ వైద్యులును, విశ్వకర్మాది శిల్పశాస్త్ర శిరోమణు లొకప్రక్కను, మహోదరాది ముఖ్య రాజబంధువులును, శుకాది గూఢచారులగు చారులును, విద్యుజ్జిహ్వాది మంత్రశాస్త్ర నిపుణులౌ సార్వభౌముని యంగరక్షకులును, ద్విజిహ్వాది యాతుధాన పురోహిత వర్గమును, తత్తదుచితాననముల పైనున్న తత్సభాభవన మెంతేని గన్నుల పండువొనర్చుచు వికసిత పద్మాకరముంబోలె విరాజిలుచున్న తత్సభాంతరము నొక పురుషుడు తత్తరపాటునం జొచ్చి, దర్బారున బారులుదీర్చియున్న వారినెల్ల గాంచి సార్వభౌమ విహీనమైన సింహాసనము నవలోకించి యొకింత తడవు నోట మాటలేక నిలచియుండ మంత్రికుల శేఖరుండగు మాల్య

వంతుం డా నూతనాగతుం గాంచి:—"ఏమిః సారణా, అంత యాతురమున వచ్చితివి? ఏమివిశేషములా?" యనిప్రశ్నించెను.

"ప్రభు దర్శ నార్థినై వచ్చితిని."

"ఔను—ఎందుండి?"

"మిథిల నుండి"

"ఏమి విశేషములా ?"

"విశేషముల కేమున్నవి? నన్ను జనకుని కడకు మన ప్రభు వంపి యుండుట తమకు విశదమే గదా! అందుకు బ్రత్యుత్తర నివేదముకొరకు ప్రభుదర్శనార్థము వచ్చియున్నాను."

"సరే—సార్వభౌము డింకను కైలాసమునుండి మరలి రాలేదు. వారు వచ్చిన పిదప నివేదింప వచ్చును."

"సరే" యని సారణుడు వేవేగముగ మరలుచుండ మాల్యవంతుండును నాతనిం బిలచి, "ఏమి! ఇపు డెందేగెద ?" వని ప్రశ్నించెను.

"అంత వరకును దడయరాదు. నేనే కైలాసమున కేగెద."

"ఏమీ_అంత యవసరమా!"

"ఆఁ—అవసరమే—విద్యుజ్జిహ్వుని నాతో బంప వనుజ్ఞ......"

"ఐన నీకు దోచిన తెరంగున మెలంగ వచ్చును." అని మాల్యవంతుడు సారణునితో సంభాషణ చాలించి, విద్యుజ్జిహ్వునికి శలవిచ్చి భిషగాచార్యుండగు దీర్ఘ కాయుని బిలువ నంప బ్రహస్తున కాజ్ఞనిచ్చి తనపని నెరవేర్చు కొనుచుండెను.

తత్సభ నప్పటి కలంకరించి యుండిన వారిలో నగరాధికారియు సార్వభౌముని దమ్ముండును నగు విభీషణుడు, ప్రధాన మంత్రియగు మాల్యవంతునితో సంభాషణ చాలించి మరలి పోవుచున్న సారణునితో కొంతదవ్వరిగి, "సారణా-ఏమి యిపుడు కైలాసమునకైన నేగి, యీశ్వరారాధనా నిమగ్నుడై యున్న సార్వభౌముని కార్యావరోధన మొనర్చియైనను ముచ్చటింప వలసిన యంత యావశ్యకత కలదా? భూ నాథుడు మరలిన పిదప మనవి యొనర్చునంత దాకయైన నోర్వజాలనియంత యవసరమా?" యని ప్రశ్నించెను.

"అయ్యో! అవసరమా, యని యడుగుచుంటిరా? సీతాకళ్యాణానంతరము మన ప్రభువు మఱి సేయునదేమున్నది? జానకిని దనకిచ్చి వివాహ మొనర్ప గోరుచు నాచే మన ప్రభువు గబురంప నా ననక గా దనక, మోమోటమికైనను గట్టువడక, జనకుడు తన తమ్ముడగు కుశధ్వజునిపై నా భారముంచి తా నొక యోరకు దొలగ, నా కుశధ్వజుండును పామును జావనీయక, గఱ్ఱయు విరుగనీయక అప్పటి కెట్టులనో సన్నంపివేసి, రాముడను నొక క్షత్రియ క్షుద్రున కిచ్చి వివాహ మొనర్ప బన్నగించి యున్నాడు. ఈ యుదంత మంతయు బ్రభు సమక్షంబున తడవు మసలక మనవిసేయ కుంటినేని, తరుణము మించిన పిదప జే గాలిన యాకులు వట్టిన నేమి లాభము? కాన మరి నే తడవు సేయరాదు; ఇక నే శలవు గైకొనియెద," నని సారణుడు తమకమున దేని విమానమున విష్వక్సహ్యునితో హుటాహుటిని కైలాసముంగూర్చి వెడలెను.

సారణ విష్వక్సహ్యులు విమానమున వెడలిన పిదప,

"ఏమి మునుగన్నై యున్నదో గద! మండలాధి పతి యని
సంతసింపనా; రాజ మండలికి మండనాయ మానంబగు మాన
సము లేనందుకు జింతింపనా; వేదాంత పరిజ్ఞాత యని వేనో
ళ్ల బొగడుదునా; సిద్ధ సాధ్య కిన్నర గరుడోరగ కాంతల గూ
ర్చిన యేకాంతపు టూహలకు దుఃఖింతునా? ఛందశ్శాస్త్ర ని
ర్మాతనై, భరత శాస్త్రమునకు జనకతండ్రినై, సంగీత శిక్షా
నిపుణుడనై, వేదమునకు ఘన, జడలను గల్పించి, అర్థశాస్త్ర
మంత్రశాస్త్రముల రచియించి, మించి, బ్రహ్మను మెప్పించి,
ఈశ్వరోపాసకుడనై, చండికను స్వాధీనమొనర్చికొని, సృష్టిలో
దిగ్విజయ మొనర్చి, అతల, వితల, సుతల, తలాతల, రసాతల,
మహాతల పాతాళముల నెదురులేని నిర్వక్ర పరాక్రమ సార్వ
భౌముండని బిరుదంది, భూలోక, భువర్లోక, సువర్లోక, స్వర్గ
లోక, మహాలోక, తపోలోక, సత్యలోకముల నవధులేని దిగంత
విశ్రాంత కీర్తివంతుండనయ్యును, నానాటికి బెచ్చుపెరుగుచున్న
నీషణత్రయాసక్తికి దోడుగ సాధు పూజ్య జన బాధకత్వము
పరదేవతా లోకములకే కాక స్వజన లోకమునం గూడ దన
లోకింప నైన, సేవ జనింప జేయుచున్న నాతని నడత నె
మూర్చుకొన జూచునో లేదో గదా? ఎంతటి ధీశా
ంతటి ప్రజ్ఞానిధినైననేమి; యెంతటి పాండిత్య
యెంతటి తపోధనుడైన నేమి; ఒక్క డు
బైన మానసం బెంతెంతలైన శక్తు
న్య విరోధంబులగు ద్వాంద్వం
క యెత్తైరంగున దగులు పడి
కొంతె నచ్చెరువు నోడ

గూర్చుచున్నదిగా! కాదందుమా: పాప భీతిలేని దైవ చింతన, ము, పరమెరుగని విద్యావైశద్యము, తర్కమెంచని శాస్త్రచర్చ, మనో విశ్చలత్వములేని తపో బలము, సాత్విక శూన్యమై ఉపకార లేశ వాసనా రహితమైన వ్యక్తికి పరదేవతా సందోహముచే నొసంగబడిన వర నికరమునకును నే మందుము? పరమ సాధ్వీమ తల్లియు, నెనలేని సరిరాని సౌందర్య వతియు, నగు మందోదరి దరి నుండ, అణిమా ద్యష్టైశ్వర్యములను సాధించిన సామర్థ్య మలవడియుండ, దేవత లెల్లరును గడ గడ వడంకు నంతటి వర మహిమలచే సురక్షితుండయి యుండ, నిక గడవెడు పాలలో నొక చుక్క బొట్టుంబోలె నీ పాపపు వ్యసన చింతయే లేకుండిన నిక నాతనికి లేని దేది? అవివాహితగానున్న జానకిం గూర్చి యింత తత్తర పాటేల నీ సారణునకు? ఔను-జనకునకు గబురంపి యుండెగా: నైన నేమాయె? కాదనె ననుకొందము: నీ సారణున కేమి పోయినది? కైలాసమున దైవచింతనా నిమగ్నుడై యున్న ప్రభు నేమరింప నీసారణున కింతలో నింత వేగిరపాటేల? నీచ సేవకులకు జన పిచ్చి వారిచ్చు దురాలోచనలకు లోనయి యెంతెంతలైన కార్యముల సేయజూచుచున్న ప్రభు నధిక్షేపించు - ఇంతకును కైలాసమున కేగిన సారణు డేమి దొల్ల జేయునో గద—ఏది యెట్లున్నను రేపో చూచిరా సనిలుని పంపి చూచెదగాక!'

మునవితర్కించు కొనుచు మగుడ

సార్వభౌముండు దిగ్విజయమవురి గెల్చి స్వస్థానమ్ము

బాగాంచిన నరక కూపముల నెల్ల రూపము లేకుండ జేసి, తత్స్థాన
మునగూడ, స్వర్గ లోకమును బెంపుసేయ ఆదోసంగిన యా
జ్ఞాను సారముగ మంత్రికుల శేఖరుండగు మాల్యవంతుండు
ప్రహస్త, మహాపార్శ్వ, విశ్వకర్మాదులతో, తత్కార్యా ను
ష్ఠానమునుంగూర్చి కొలువు కూటమున నదివరకే నెరపుచున్న
ప్రసంగమున నీ విభీషణుండును జేరుకొనియెను.



యే శిలోచ్చయావతంసు గుహాంతరంబులు ప్రమథ గణంబుల కోలాహలంబులకును, పిడుగుల చప్పుడుల వ్రాలె వినంబడు నందీశ్వరుని ఱంకెలకును, బ్రతిధ్వనించుచుండునో, యే యచలేంద్ర కుహరములు తత్ప్రియులం గలసిమెలసి యెడలేని మోహపు మమతల విహారంబు సలుపు కిన్నర విద్యాధరాంగనాలావాసంబులు కనికిపట్టు లయ్యెనో, యే గోత్ర మాణిక్యము తపోనిష్ఠా గరిష్ఠులగు రాజర్షి, బ్రహ్మర్షి, దేవర్షి గణంబులకు యజ్ఞభూమియై, దేవతల కన్నసత్రమయ్యెనని పురాణములవినుచుండుమో, యే మహీధరేశ్వరుండు భువనపావనకరము లగు సింధు గంగా ప్రముఖ నదీమతల్లికలకు గన్నతల్లియై విలసిల్లెనో, యే శిఖరేంద్ర కటి ప్రదేశము దాటి మేఘమండలము చరియింపజాలదో, యే యద్రిరాజు దీర్ఘ శృంగములతో, దుర్గ మారణ్యములతో, నమూల్య రత్నములతో, సువర్ణాది లోహములతో, నుత్తమ దివ్యౌషధులతో, గైరికాది ధాతు సమూహములతో, బహు సత్త్వ సంపదలతో, నెన్నొ ప్రకంశారు సెలయేళ్లతో, సొబగుమీరు చరియలతో, నిండియుండి చూపఱకు గనుల పండువు సేయుచు, నాశ్చర్యంబును, సంతోషంబును, భయంబును గొలుపుచు, బరమేశ్వరుని యనంత మహిమంబును బ్రకటించు చుండునో, అట్టి మహా పర్వతరాజ మగు హిమవన్నగమున కుత్తర భాగంబున సింధునదికి జన్మస్థాన మయి, మలయానిలముచే శీతలతరమయిన శ్రీగంధ వాయువులచే సర్వదా మనోహరమయిన కైలాసం బను శృంగంబు నందెక్కడ జూచినను నందరును మూడు కన్నులు గలవారే; అందరును లేతచంద్రుని దాల్చిన వారే; అందరును పులితోలు గట్టిన వారే; అందరును పాము

కడియంబులు బెట్టినవారే; అందరును చేతులబునుకల ధరించినే వారే. దేవసేనాధిపతియగు గుమారస్వామి యాడాడ దిరుగుచుండ, సామేన బార్వతిం ధరియించి, శిరమున చంద్రరేఖను, గంగను నిడికొని, కట్ట బట్ట లేకనో నా మువ్వన్నె తోలు గప్పికొని, అష్టయిశ్వర్యముల బత్తుల కొసంగ సత్తిగలిగియు, దానిస్పుంజాటనో నా విభూతి బూసికొని, వేళ కింత యోగిరము గుడువ పాత్రమైన లేకనోనా వెలవలకేల గకపాలబూని,దాపలకేల ముక్కుమూసికొని అఖిల జగదీశ్వరుం డగు నీశ్వరుండు నిష్ఠమెయి తపం బొనర్చుకొనుచుండ నొక్కనాటి ప్రదోష కాలంబున నొక్క వ్యక్తి తమకమ్మున తన విమానమ్ము డిగ్గి వినయమ్మునడగ్గరి కొంతవడినా యీశ్వరుంగూర్చి బ్రార్థనంబు సలిపియు, నెంతకును నా మహేశ్వరుండు బ్రసాదింపమి, విసిగి యొ గాబోలా పర్వత శిఖరంబు తన బాహు బలంబు కొలంది శాఖా సమేతంబగు నొక వృక్షము నూపిన ట్లూవ, పార్వతీ సమేతుండై, ప్రమధ గణంబుతోపాటు తొట్రుపాటు వడి, -యిది యే-మని గనువిచ్చి జూచి,ఆ యూపినవాడు తన భక్తుండుగా నెరింగి, తన భుజబలము గుర్తించుకొను దలంపున విలాసమున దన కైలాసము నిటుల సడలించెనుగా యని యూహించి, తన కుడికాలి బొట్టన వ్రేలితో నా భక్తుని శిరంబు నదుమ నాతండును తన నడు మొకింత వంగ తాండవం బొనర్చుచు స్తుతి నిరతి భక్తిమెయి స్తవం బొనరించె.

(పుట దిప్పునది)

## "ఇపుడెయ్యది యనుసరణీయము?"

### పంచచామర వృత్తము

జటాకటాహ సంభ్రమ భ్రమ న్నిలింప నిర్ఝరీ
విలోల వీచివల్లరీ విరాజమాన మూర్ధని
ధగద్ధగ ద్ధగ జ్వలల్ల లాట పట్టపావకే
కిశోర చంద్రశేఖరే రతిః ప్రతి క్షణం మమ॥

దరాదరేంద్ర నందినీ విలాస బంధు బంధుర
స్ఫురద్దృగంత సంతతి ప్రమోద మాన మానసే
కృపాకటాక్ష ధోరణీ నిరుద్ధ దుర్ధరాపది
క్వచిద్దిగంబరే మనోవినోద మేతు వస్తుని॥

జటాభుజంగ పింగళ స్ఫురత్ఫణా మణిప్రభా
కదంబ కుంకుమ ద్రవ ప్రలిప్త దిగ్వధూముఖే
మదాంధ సింధుర స్ఫురత్త్వగుత్తరీయ మేదురే
మనోవినోద మద్భుతం బిభర్తు భూతభర్తరి॥

సహస్రలోచన ప్రభృత్యశేష లేఖ శేఖర
ప్రసూనధూళి ధోరణీ విధూసరాంఘ్రి పీఠభూః
భుజంగరాజ మాలయా నిబద్ధ జాటజూటక
శ్రియైచిరాయ జాయతాం చకోరబంధు శేఖరః॥

లలాట చత్వర జ్వల ద్ధనంజయ స్ఫులింగభా
నిపీతపంచ సాయకం నమన్నిలింప నాయకమ్
సుధామయూఖ లేఖయా విరాజమాన శేఖరం
మహాకపాలి సంపదే శిరోజటాలమస్తునః॥

కరాళఫాల పట్టికా ధగద్ధగద్ధగ జ్వల
ద్ధనంజయాహుతీకృత ప్రచండపంచ సాయకే
ధరాధరేంద్ర నందినీ కుచాగ్రచిత్ర పత్రక
ప్రకల్పనైక శిల్పిని త్రిలోచనే మతిర్మమ॥

## పరిణయ విభ్రమములు

నవీన మేఘమండలీ నిరుద్ధదుర్ధరస్ఫుర
త్కుహూ నిశీథినీతమః ప్రబంధబంధ కంధరః
నిలింప నిర్ఝరీ ధరస్తనోతు కృత్తిసింధురః
కళానిదాన బంధుర శ్శ్రియం జగద్ధురంధరః॥
ప్రఫుల్ల నీలపంకజ ప్రపంచ కాలి మచ్ఛటా
విడంబి కంఠ కంధరా రుచి ప్రబంధ కంధరమ్
స్మరచ్ఛిదం పురచ్ఛిదం భవచ్ఛిదం మఖచ్ఛిదం
గజచ్ఛిదాం ధకచ్ఛిదం తమంతకచ్ఛిదం భజే॥
అగర్వ సర్వమంగళా కళా కదంబమంజరీ
రసప్రవాహ మాధురీ విజృంభణా మధువ్రతమ్
స్మరాంతకం పురాంతకం భవాంతకం మఖాంతకం
గజాంత కాంధకాంతకం తమంత కాంతకం భజే॥
జయత్వదభ్ర విభ్రమ భ్రమద్భుజంగ మస్ఫుర
ద్ధగద్ధగ ద్వినిర్గమ త్కరాళఫాల హవ్యవాట్
ధిమి ద్ధిమి ద్ధిమి ధ్వన న్మృదంగ తుంగమంగళ
ధ్వని క్రమప్రవర్తిత ప్రచండతాండవ శ్శివః॥
దృషద్విచిత్ర తల్పయో ర్భుజంగ మౌక్తిక స్రజో
ర్గరిష్ఠ రత్నలోష్ఠయో స్సుహృద్విపక్ష పక్షయోః
తృణారవింద చక్షుషోః ప్రజా మహీ మహేంద్రయోః
స్సమం ప్రవర్తయన్మనః కదా సదాశివం భజే॥
కదానిలింప నిర్ఝరీ నికుంజ కోటరే వస
న్విముక్త దుర్మతిస్సదా శిరస్థమంజలిం వహన్
విముక్తలోల లోచనో లలామఫాల లగ్నక
శ్శివేతి మంత్ర ముచ్చర న్కదా సుఖీ భవామ్యహమ్॥

ఇమంహి నిత్యమేవముక్త ముత్తమోత్తమం స్తవం
పఠన్స్మరన్ బ్రువన్నరో విశుద్ధిమేతి సంతతమ్
హరేగురౌ సుభక్తిమాశు యాతి నాన్యథాగతిం
విమోహనం విదేహినాం సు శంకరస్య చింతనమ్॥ 18.

( ఇతి శ్రీ దశకంఠ రావణ విరచితం
శివ తాండవ స్తోత్రం )

తన ప్రార్థనాది కానంతరము నీశ్వరుకడ వినయమ్మున సెలవు గైకొని స్వగృహోన్ముఖుండయి బయలుదేరి, యాహితమైలావరోహణము సేయ వేరొండు విమానమున నిర్వురు బూరుషులంగాంచెను. వారును దమ విమానమ్ముల డిగ్గి నాతనికి నమస్కరింప వారును దానునుంగలసి గొంతతడవట ముచ్చటించిరి. అందొకండు—"ప్రభుశేఖరా! సీతను తమకిచ్చి వివాహము సేయ నిష్టము లేకున్న మానెగాని, ఇన్ని డొంకతిరుగుడుమాటలేల? మరియు నొక ఱేనికి దగని కల్లలా ?" యని యనెను.

"అవును వాఁడొక ఱేఁడు- నీవొక మంత్రివి!—చాలును లే—సారణా !

"విద్యుజ్జిహ్వా, వింటివిగదా! జనకుని జవాబులును, కుశధ్వజుని కూతలును! జనకుడు నాకు బాల్య మిత్రుడు గదా యనియు, అవివాహితయగు కన్యారత్నము తనకడ నున్నది గదా యనియు, నే నొక రాజరత్నమును గదా యనియు, నెంచి మించిన యాసతో కమ్మవ్రాసి పంపగా, నాకు తానే స్వయముగ జవాబు నొసంగక, నా జాబు కుశధ్వజున కందీయ నాతండును ఆ జాబుం జూచి లిఖితప్రాశస్త్యమైన ప్రత్యుత్తరం బొసంగక,

సీత కిపుడు వివాహ మొనర్చు సంకల్పమే లేదనియు; అటులె వివాహ మొనర్పవలసివచ్చినను, కన్య యేరిని వరించిన వారికే వివాహ మొనర్పవలసియుండు ననియు, నింతకును వరాన్వేషణ సమయమున సీత యేమి గోరునో యనియు, వివాహ సమయమునకు సందరు రాజులకుం బలె నాకును నొక యాహ్వాన మంపుదు ననియు, టక్కరి మాటల నా తుంటరి వచించిన పలుకు లాలించితివిగా! ఈ సారమును మరలి వచ్చుచున్నప్పుడు గ్రామములలో నటనట గట్టబడుచుండిన మంగళ తోరణముల వృత్తాంతమును గూడ వింటివిగా! ఇక నే మందువు? అబ్బా! ఎంత మోసకాడా విశ్వామిత్రుడు గూడ! జనకుండును దానునుం గూడ గుసగుసించుకొని సీతను నాకంట బడనిచ్చినచో నే నేమి చేతునో యను శంకచే పరస్పరముగ హుటాహుటిని యాగస్థలమునకు గొంచబోయి, యాగము నవలోకింప నాహ్వాన మొనర్పబడు రాజులలో రాముం గూడ సీత నవలోకించుటకు బన్నగించి, తత్సమయంబున నన్యోన్యావలోకనము నేర్పరచి, 'యాగ సంరక్షణార్థము రాము నాహ్వానించుచున్నా నను బ్రత్రతి నెరపు మనచేతను మన బలగంబుచేతను విఘ్నంబులు దొరయకుండ గాపాడు మని వేడుకోలుగా పరసురాము మూలమున, తాటకి ముఖంబున నాకు గబురా? ఆ పరసురామునకెంత సిగ్గులేకపోయెనో జూచితివా విద్యుజ్జిహ్వా! విశ్వామిత్రుని యాగము సంరక్షింప నిందరు కావలెనా; ఒక్క పరసురాముడు చాలడా! తనకు కాదని ఈలెని యాగము నిర్విఘ్నముగ గొనసాగనేను, క్షుద్ర క్షత్రియ కుమారుల వేడుకొన వలసి వచ్చెగా! ఈ యుసంత మంతయు పరశురామున కెఱుక రానీయ

లేను గాబోలు! చూతము గాక వీ రందరును వాని యనాగము నెంత గాపాడుదురో; సీతను నాకంట బడనీయకుండ నెంత గాపాడుదురో! విద్యుజ్జిహ్వ! ఇపు డెయ్యది యనుసరణీయము? ఏమి నీ యాలోచన ?"

"ఆలోచన కేమున్నది! తమ శెల వైనచో దీర్ఘకాయుని బిలిపించి తమ చిత్తవృత్తి దెలియజేసినచో నాతండును తమకు గనుపులో జల్లకదలకుండ సానమందు, రసము, బసమును, ఘనమణి మంత్రౌషధములు, క్రియ, బంతి, బనసిక, గుళిక, మూల్కె, బూతి మొదలగు శుద్ధక్రియలచే నెంతేని సులభముగ సీతను గొని తమ మోల నిలువంబెట్ట గలాడు—"

"ఈ మార్గ మెంత మాత్రమును ననుసరణీయము కాదు."

"కానిచో తమ బంధుగుండును వశీకరణ తంత్రశాస్త్ర వేత్తయు నగు మహోదరుని బిలిపించినచో నాతండును తమకు దలపువ్వ వాడకుండ, జిల్లేడు దూదిని, గోశఫల రసమున మెదపి, వత్తిగా జేసి, కుసుమ నూనెను దీపంబు వెట్టి యా తరుణిని తమకు వశంవద సేయగలడు."

"ఛీ! ఛీ— అవి నాకు దగని పనులు. మఱియు నవస్థా భేదముల నొకింతయైన బాటింపక నీ వాసంగు సలహాలు నా మానసంబున కెక్కంజాలవు."

"చిత్తము. తమ కీమార్గములు దృష్టికరబులు గాని నాడు తమ శెల వైనచో నా మంత్రి శాస్త్ర మహిమచే నామె నిపు మూర్ఛపుచ్చి గొనితేగలను" అని విద్యుజ్జిహ్వాను విధేయుడై పలికెను.

"అది యెంతేని యసంతృప్తికరమగు మార్గము."

"అదియును కానిచో తామే తగిన యోజన సేయవలసి యున్నది." అని సారణు డనెను.

"మన మిపు డాలోచింపవలసిన విషయము ముఖ్యమైనది. సీతకు రాము నందు వ్యామోహము కలదని గదా వినుచున్నాము. రామునకుంగూడ సీతను బెండ్లాడునిష్టము కలిగియుండదా? నేనుదిగ్విజయయాత్రకుబోవునప్పుడును,కార్తవీర్యునితోబోరాడ బోవునప్పుడును,నా రామలక్ష్మణుల రూపములం జూచియుంటి గదా! సారణా, ఆనాడు నీవును నేనును జనకుని సందర్శింప బోయినపుడు సీతను జూచియే యుంటివి. ఇపుడు నేను రాము రూపముతో సీతను జూడ నేగినచో సీత నను గాంచి రాముడే యని భ్రమగొని, మరులుగొనును. అదియ యదనుగ జేసికొని యామెను గొనితే నగును. కాదేని వీలు జూచుకొని పరిణయమే యొనర్చుకొన నగును. ఇందు కేమందువు? విద్యుజ్జిహ్వా!"

"చిత్తము- ఇక్కడి యనుసరణీయమా మార్గ మాలోచించితిరి."

"ఔను- ఈ పనికి మీ రిరువురును సంపూర్ణ సహాయ మొనర్పవలయును."

"చిత్తము- తమ యాజ్ఞానువర్తులము కామా!"

"సారణా, ఇదే నేను రాము వేసమునను, నీతడు లక్ష్మణు వేసమునను, నీవు సీతా రూపమునను బయలుదేరి, ఆ ర్యావర్త నాటక రంగమున మాయా "విభ్రమ" నాటక మాడి మన యాప్సితము నెరవేర్చుకొనవలయును."

"చిత్తము. మేము చేయువలసిన పనుల నియోగింపుడు; దైవర, యాజ్ఞల నిర్వర్తింతుము."

"మలదకరూశ దేశములకు దక్షిణముననున్న విశ్వామిత్రాశ్రమ సమీపమున నున్న వనమున మన మిరువురమును రామలక్ష్మణుల రూపముల దాలిచి, అదృశ్య కరణీ ప్రభావమ్మున మన మొరులకు గానరాకుండ నుండి, అచ్చటి విశేషముల గనుగొందము. సారణా! నీవు సీత వేషమున సేయుందగు కార్యముల మున్ముందు దెలిపెద. ఇపుడు మాతో ననుచరుండవై మీ రిరువురును గలసి వచ్చిన విమానమున ఖరాలయమునకు బోయి యచ్చట ఖరునితో కొన్ని సంగతులు ముచ్చటించి పోవలయు." అనుచు తన ప్రత్యేక విమానమున తాను రాము వేషమునను, రెండవ విమానంబున సారణ విద్యుద్జిహ్వులు సీతాలక్ష్మణ వేషములతోను, ఖరుడను రాజప్రతినిధిని జూడ ఖరాలయమునకు పవనవేగంబున బర తెంచిరి.

ఇప్పటి రాయపూర్ జిల్లాలో "ఖరియాల్" అనబడుస్థానమే అప్పటి ఖరాలయము. ఇది దండకారణ్య మధ్యభాగమున తూర్పుతీర భాగమునంటియున్న జనస్థాన మనబడు ప్రదేశమునకు సుమారు ఉత్తర ముఖ ద్వార మవదగియున్నది. అలనాటి జనసానమిప్పటి మధ్యపరగణాలలోని రాయపూర్ జిల్లా యొక్కయు, బస్తరు సంస్థానము యొక్కయు పూర్వభాగమును, సంబల్పూర్ జిల్లాలోని చాలభాగమును, (2) చెన్న రాజ్యములోని జయపుర సంస్థానాంతర్గతమైన గోదావరికి నుత్తరమందలి కొంతభాగమును, గోదావరీనదికి దక్షిణమునను, (3) నైజాము రాజ్యములోని చాలభాగమును, అయియున్నట్లు వాల్మీకి విరచిత శ్రీమద్రామాయణము ననుసరించిన సుబోధకమగుచున్నది. ఈ జనస్థానముననే అగస్త్యభ్రాతృ

రాశ్రమము, అగస్త్యాశ్రమము, పంచవటి, పర్ణశాల నిర్మిం చుకొని రాముడా వాసము చేసిన భద్రాచలమును గలవు.

* * * * * * *

"ఖరా! మేమిపుడు విశ్వామిత్రు యాగము జూచిరా నేగుచున్నాము. ఈ రెండవ విమానము నిట డించి పోదుము. నీ వీ ప్రాంతముననే యుండి రాముం డీ తెన్నున వచ్చినచో నాతని నిచ్చటన బరిమార్పుము." అని వానికి గట్టడి చేసి యొక విమానము నట వీడి, రెండవ విమానమున ముప్పురును వారి వారి నిక్షిత రూపముల బటువేగమున నుత్తర దిశను విరాధువనమున కేతెంచి, విరాధునకుంగూడ నట్టి కట్టడినే గట్టిచేసి, తమ మొదటి సంకేతిత స్థలమగు విశ్వామిత్రాశయ సమీపమునన్న వన ప్రాంతమున తమ విమానము విడిమ జేసి, ప్రదోష సమయమున, చండికాలయమునుండి శాంతా సీతలు చెలికత్తెలతో సంభాషించుచు మరలుచుండుట మారు వేసముల నున్న నీ ముప్పురును గుర్తించిరి.





# పరిణయ విభ్రమములు

## నాలవ ప్రకరణము

## ప్రథమ సమావేశము

"చిరకాలమునుండి జరుప నెంచిన యజ్ఞము, నీ జనకుని
కోర్కె ననుసరించి యించుక వేగముగ నీ సౌమ్య సంవత్సర
మాఘ బహుళ పంచమీ దివసమున ప్రారంభింప నిశ్చయించి,
రాజులనెల్ల రా బంచి, ఋషి మూకలనెల్ల నాహ్వానించి, దనుజ
యాతుధానాది క్రూరుల బారినుండి బాధలు రాకుండ నాక్రతు
వు రక్షింపుమని లంకేశ్వరు గోర బరశురాము ప్రార్థించి, రా
నయియున్న కుశధ్వజ సమేత యా జనకపుత్రికకు మాయావుల
నుండి బాధలు కలుగకుండ రాక్ష సాంధఃకణముతో మహాకంక
ణముల నంపియుంటిని గదా! ఇక నేకక్రియా ద్వైధకకీ యను
నటుల జనకుని గోర్కె నెరవేర సీతారాముల యన్యోన్యావ
లోకనమును, మునిముఖ్యుల యాప్సితము గడతేర మద్రచిత
మా యాగము నిర్విఘ్నముగ దనుజజన విలుంఠనము గాకుండ
జయప్రదముగ గొనసాగ దశరథు బుత్రులా రామలక్ష్మణుల
నాహ్వాన మొనర్చు కార్యమునకై, నేనే స్వయముగ బోవుచు
న్నాను. ఇక కార్యము సానుకూలపడ కేమియగు?" యనుచో

నుచు రాజఋషియగు విశ్వామిత్రుడుతన యాశ్రమము వీడి అయోధ్య దేశాధీశుండగు దశరథు దర్శింప బోవుచుండెను.
జంబూద్వీపము (ఆసియా), ప్లక్షద్వీపము (దక్షిణ అమెరికా) క్రౌంచద్వీపము (ఆఫ్రికా) శాకద్వీపము (యూరోపు) శాల్మలి ద్వీపము (ఓషీనియా) అనగా దూర్పు పసిఫిక్ మహాసముద్రములోనున్న ఆర్చిపిలగో, పోలనేష్యా, మైక్రోనేషియా, సండాద్వీపము, న్యూజీలాండు, అను విభాగములు గల ద్వీపములలో ప్రథమద్వీప మగు జంబూద్వీపమున భరతఖండమున, మగధ దేశమునకు మహోదయమును పట్టణమును రాజధానిగా నేర్పఱచుకొని పరిపాలించుచుండెడి యొక క్షత్రియుడే విశ్వామిత్రుడు. అప్పటి మహోదయ మిప్పటి "కనోజ్" సమీపముననున్నది. రాజ్యపరిపాలనకు రోసి, దేశాల వీడి, విశాలమగు హిమవత్పర్వత పరిసరారణ్య ప్రదేశమున నీశ్వరుంగూర్చి దపమాచరించుకొనుచుండు రాజఋషియాతండు. జంబూద్వీపము (హిందూదేశము)న సరయూనదీతీరముననున్న కోసలమునకు ముఖ్యపట్టణమగు నయోధ్య (ప్రస్తుతపు ఔడ్ + ఆగ్రా) ను ముఖ్యపట్టణముగా జేసికొని, ఇక్ష్వాకువంశజుడై అజేందుమతీ పుత్రుండైన దశరథుడు, తన కొలువుకూటమ్మున దృష్టి, జయంతుడు, జయుడు, సిద్ధార్థుడు, అర్థసాధకుడు, అశోకుడు, మంత్రిపాలుడు, సుమంత్రుడు నను నష్టప్రధానులు బరివేష్టించియుండ వశిష్టు, వామదేవుడు, జాబాలి, మొదలగు పురోహిత హిత వాక్యమ్ముల నాకర్ణించుచుండ, కాశ్యప, సుయజ్ఞులు వేదాధ్యయనము గావించుచుండ, విశ్వామిత్రుండు వడివడి ధశరథు సమీపించి—తాజన్న మొనర్చుననియు, తత్సంరక్షణార్థము నీ

ష్ణునంగు గొమరులౌ రామలక్ష్మణుల నిర్వ్యర ననుపు మఱియు యాగము దర్శింప ని న్నాహూయ మొనర్చుచున్నా ననియు విశ్వామిత్రుఁడు దశరథుమ్రోలఁబలుక, నాతండును "రామలక్ష్మణుల నాకృతమా యాగమును సంరక్షింప నంపు"మను వాక్యము తన చెవింబడుటయె దడవుగ చేష్టలుదక్కి మాఱు పలుక నేరక మిన్నకుండి, కొంతవడికి తెలివిదేర నిట్లనియెను.

ఉ॥ కటకట! లేక లేక బహు ♦ కాల తపంబొనరించి కన్న యీ
పటుసుకుమార గాత్రులగు ♦ బాలకులెక్కడ? వద్దు వద్దు రో!
కుటిలతరోగ్రదశ్యజన ♦ కోటుల వెక్కడ? వద్దు వద్దు రో!
చటులరణోద్ధతిన్ నిలువఁ ♦ జాలుదు నే స్వయమేన వచ్చెదన్."



"దశరథా! నీవు గాజులు దొడిగించుకొని కూరుచున్న మాత్రాన శూరాగ్రేసరులును, శ్రీ మహావిష్ణ్వంశ సంభూతులౌ నీ యనుంగు బుత్రులు రామలక్ష్మణులుం గూడ నీవలెనే లోకాన కనుపమోగు లనుకొనుచుంటివా? ఖలులగు దశ్యజనముల చెండాడ నవతారమొందిన రామలక్ష్మణుల నీవు మానవమాత్రులుగా దలంచుట నీ ప్రకృతి ధర్మంబులం గూర్చి నీ యపరిచితినే దెలియజేయుచున్నది. మఱియు నే జేయునది సకల మానవ నికరంబునకు శుభంకరంబును, సర్వదేవతానీకమునకు సంతోషప్రదంబును నౌ యాగము. నాచే నాహ్వాయము కాబడుచున్నవారు కేవల విష్ణ్వంశ సంభూతులౌ రామలక్ష్మణులు. ఇంక వారొనర్చునది వారి శౌర్య బల పరాక్రమంబుల కేమియు గాని యాతుధాన జన సంహారము-అదియు

నవసరమైననే గాని వేరొండు గాదు. నామాట నాలించి, నను జిన్నంబుచ్చక, రామలక్ష్మణుల బల పరాక్రమంబులకు నపకీర్తి రానీక, మానవలోకమునకే గాక, దేవతాలోకమునకుం గూడ మేలొనగూర్పుము." అని విశ్వామిత్రుడు దశరథు మానసమున కెక్కునట్లు వలుకనాతండును, "మునికుంజరా! నీవేమి బేలువడు చున్నావు. నీ యాగరక్షణమున నా పసికూనలౌ రామలక్ష్మణులు దస్యులను అవసరమునైనను, సంహరించు కార్యమున నియోగించినచో వా రెందుకును కొరగారు సుమా! నే నలనాడు కౌసల్యను వివాహ మొనర్చుకొను సందర్భమున కోసల కేగునప్పుడు సరయూనదిం దాటు తరుణమున దస్యుజన ముఖ్యుండగు లంకేశ్వరుండు నే బయనముసేయుచుండిన నావ నన్నెని వ్రక్కలుజేసి నా వివాహమునకు ప్రతిబంధము వాటిల్లజేసె, తానే కౌసల్యను బరిణయం బొనరించుకొన బన్నగించిన దుండగిండ్రంబోలు క్రూరుల బరిమార్ప నిపు డీ ముకుపచ్చలారని బుడుతల వలన నేమి యుపయోగము? నీ యాగము జయప్రదముగ నెరవేరదనియు, నీ పసిబాలురకా అపాయము వాటిల్లు ననియు, నే నెంతేని సంశయించు చున్నాను." అని దశరథుడు తన కొమరుల నమ్మునివెంట నంప దన యనిష్టమును వెలువరచెను. అంత నమ్మునికుల తిలకుండును దశరథు శంకల నివృత్తిసేయ సృష్టి మూలకారణమ్మును, రామలక్ష్మణుల యవతార కారణమ్మును, తన యజ్ఞ కారణమ్మును, నామూలమ్ముగ విదిత మ్మొనర్చి, దశరథు మానసమ్మునకు నచ్చజెప్పెను. ఇక్ష్వాకు కులగురుండగు వసిష్ఠుండును విశ్వామిత్రుని తపోబలంబును నుగ్గడింపుచు, ధనుర్బాణ ధరులగు రామలక్ష్మణుల

సేమ్మునివెంట నంపుట బాలకులకు క్షేమంకరమాటయె గాక, శుభంకరమును గూడ నౌనని దశరథునకు సుబోధ గావింప, దశరథుండును, నంగీకార పురస్సరంబుగ తన పుత్రులా రామ లక్ష్మణుల గా బనిచి "విశ్వామిత్రు నాజ్ఞల నౌదలల ధరించి వర్తింపు" డని శాసన పూర్వకంబుగ నానతిచ్చి వారి నమ్ముని వెంట నంప విశ్వామిత్రుండును సంతసించి దశరథు దీవించి సం త్రియుక్తమా తాటంకయుగము నౌతని కొసంగి వెడలెను.

పింగళుండను రామ మిత్రుడు గూడ రామలక్ష్మణుల వెంట నంటి విశ్వామిత్రునితో పాటు తదాశ్రమాభి ముఖుండయ్యెను.

వెడలుచు, నదివరకే తన శిష్యుడగు సత్యవ్రతునిచే నాహ్వానింపబడిన దశరథు కూతురా శాంతయును, నామె భర్త యగు ఋష్యశృంగ మహర్షియును తన యాశ్రమమున కేగరా కా నెఱుంగ పంచి, ప్రశ్నించి, వా రావరకే యాగ దీక్షను వా వెడలినది తెలిసికొని, సంతసంబున వెడలుచు, మార్గమధ్యం బున నెన్నియో యస్త్రంబుల, తత్త దుపసంహారంబుల గూడ శ్రీ రా మున కుపదేశించుచు విశ్వామిత్రుడు పయనము సాగించుచుండె.

విశ్వామిత్రాశ్రమము - పెక్కండ్రు రాజులచేతను, వారి పరివారములచేతను, అసంఖ్యాకులగు ఋషులచేతను, వారి వారి శిష్యులచేతను, వనప్రదేశమునగల వనమృగముల ఘీంకార రవములచేతను, శకుంత సంతానముల కలకలా రావముల చేతను, మిక్కిలిగ నెడతెగని సందడిలుచుండెను. రాజుల విడుదులు వేరు; మునుల వాటికలు వేరు; ఋషుల యాశ్రమములు వేరు. దుమ లిటుల వేర్వేర విస్తరిల్లి యుండినను శాంతా ఋష్య

శృంగులు విశ్వామిత్రు నాశ్రమము సమీపింపగనే "జనకుని పిడుగు"యను పేరనున్న తాపున జనకుని సోదరుండును, తత్ప్రతినిధియు నౌ కుశధ్వజుండు వారిని విడిదికి గొనిపోయి సగౌరవంబుగ సుస్వాగతం బొసంగెను. శాంతయు జనకుని కూతురౌ జానకియు, కుశధ్వజుని కూతురౌ ఊర్మిళ, మాండవి, శ్రుతకీర్తియు నను ముగ్గురును, తులసి, సర్వమంగళ యను జానకి చెలికత్తెలును సాయంసమయముల కాత్యాయని యాలయమునకు బోవుచుండుటయు, తత్సమీపమున నున్న నందన వనమున వనవిహార మొనర్చుటయు లోనుగాగల కార్యముల కాలము బుచ్చుచు శాంతా సీతలు అన్యోన్యానురాగులయి యెంతేని మైత్రిమెయి సంచరించుచుందురు.





# పరిణయ విభ్రమములు

## అయిదవ ప్రకరణము

## సూచన

సంభాషణ వశమున:

"యాగారంభము యీ(*సౌమ్యసం॥) మాఘ బ॥ పంచమి నాడేగద; నే డప్పుడే తదియగదా! రావలసిన వా రందరును వచ్చిరా?" యని శాంత ప్రశ్నించెను.

---

* వైవస్వతమన్వంతర పంచమ త్రేతాయుగ చతుర్థభాగమున 30,000వ సంవత్సరమగు సౌమ్య సంవత్సర మాఘ బహుళ పంచమి యే విశ్వామిత్రుని యజ్ఞారంభము.

శ్రీ రాముని జననము

| | | |
|---|---|---|
| త్రేతా యుగము | 12,96,000 | సం॥ |
| ద్వాపర ,, | 8,64,000 | |
| కలియుగ ,, (భుక్తం) | 5,024 | |
| | 21,65,024 | |
| | 30,000 | |
| శ్రీరామజననం | 21,35,024 | |

అనగా నేటికి 21,35,024 సంవత్సరములకు పూర్వము విశ్వామిత్రుని యాగము జరిగెను.

"ఏమి రాకేమి! అందరును వచ్చి వారి వారి విడుదులలో దిగియే యున్నారు." అని తులసి పలికెను.

"మరి రావలసినవారు లేరా?" యని సీత యడిగెను.

"ఇక రావలసినవారు మగపెండ్లివారే." యని తులసి యనెను.

"తులసీ, నీ వెల్లవేళలను నన్ను పరిహాసక మాడుటకే జన్మించితివి గాబోలు?"

"ఏమిటా, ఇందు పరిహాసకమున కేమున్నది? యాగ కర్త యగు విశ్వామిత్రుడు పెండ్లిపెద్ద కాడా? రాబోవు రాముడు పెండ్లికుమారుడు కాడా? ఇందసంభవమేమున్నది?"

'అసంభవమా? రాముడు పెండ్లికొడు కెట్లు కాగలడు?'

"నీవు పెండ్లికూతురవు కాదలచుకున్నావుగనుక!"

"నీ పొల్లుమాటలు మానివేయవే- ఎందరెన్నిననూ——"

"అమ్మా, తులసిపలుకులు పొల్లుమాటలు కానేరవు. సంభవములై జరుగనై యున్న సంగతులే! ఈ యాగమునకు రామలక్ష్మణులను గూడ విశ్వామిత్రుడాహ్వానము చేసి దోడ్కొని బోయెను. నేటికే రావలసి యున్నది. రానినాడు రేపటిరాత్రికైనను రా గలడని తలంచెద—ఈ యాగముయొక్క పరమార్థము సీతారాముల యన్యోన్యాలోకన శుభకార్యమే. అటులనే జరుగగలదు. ఇందు సందేహము లేదు." అనుచు శాంతయు, తులసియు సీతను దోడ్కొని నైళము మాత్రశమున జేరుకొనిరి. సూర్యాస్తమయమును కాజొచ్చెను.





# పరిణయ విఘ్నములు

## ఆఱవ ప్రకరణము

# ఎదురు సన్నాహము

## I

"వింటివా, విద్యుజ్జిహ్వా వీరి పలుకులు! అందరు రాజులును వచ్చినట్లును, రాముడింకను రానట్లును దెలియుచున్నది. మరియు నాచే ననుజ్ఞాతుండయి పోయిన మన సారణుడు మిథిల నుండి మరలివచ్చి చెప్పిన వృత్తాంతమంతయు సత్యమనుమా! ఈ పన్నాగపరమార్థమే రామునియొక్కయు శాంతి యుప్రదీప్తము చే వచించినది. రాముడు పెండ్లికొడుకట! విశ్వామిత్రుడు పెండ్లిపెద్దయట! అబ్బా! యెంతటి పన్నాగ మొనర్చె నా జనకుడు? ఆతని పన్నాగ మాచరణకు దేవలసినవాడీ విశ్వామిత్రుడా? అది యేదో పరీక్షించి చూడవలసినదే! కాని, విద్యుజ్జిహ్వా! మనకు గానవచ్చుచుండిన వారిరువురు మాత్రమే యయ్యును, మువ్వురికంఠస్వనము లెటుల వినవచ్చుచున్నవి? ఏది యెటులున్నను మనము నిర్ణయించుకున్న కార్య మవశ్య మాచరణీయము. మరి జాగేల? సారణా! సీత రూపము నిదివరకే చూచితివిగదా? ఇకనీవు సునాయాసముగ సీతవు కాగలవు. మనము మువ్వుర మీ విమానమున బోయి రామాదు లెంత దవ్వున నున్నారో చూచి వత్తము."

* * * * * *

II

ఋష్యశృంగుడు, దశరథు కూతురగు శాంతభర్త. ఋష్య శృంగుడు ఋషి లోకమునకెల్ల దల మానికము. శాంత తండ్రియగు దశరథుడు తనకు పుత్రసంతానము లేమింజేసి పుత్రకామేష్టి యను యాగ మాచరించునపు డా యాగదీక్ష నెరపుటకు ఋష్య శృంగు దన తపోవనము నుండి రాజాస్థానమున కెంతేని శ్రమగొని దోకొనివచ్చి దశరథుడు, తన పుత్రకామేష్టి సంపూర్తియైన పిదప ఋష్యశృంగుని దన తావున నప్పటి నుండియు నుంచుకొనియెను.

"జానకీ, నీవు చండికాలయమున కేగునపుడును, వన విహారమునకు బోవునపుడును గూడ శాంతను వీడి యొంటరిగ నేగకుమీ!" యని ఋష్య శృంగు డనెను.

జానకిని బిలచి ఋష్య శృంగుడు నుడివిన మాటలాలించి, శాంతయు, "అమ్మా! నా వెంటనంటియుంట మాట కేమిగాని, విశ్వామిత్రుడు నిసుధరింపుమని యొసంగిన రాక్షసాంధకరణమ లో మణికంకణముల ధరించితివిగా?" యని శాంత సీతతో ననెను.

"కుశధ్వజు నానతి వడసి, మనము చండి కాలయమునకు బోవునపుడు, మణి కంకణముల ధరియించియే యుంటిని. ఇంట నున్నపు డేల నని యిపుడు ధరింపనైతిని."

"అటు కా దటు కాదు! నా సరసనుంట నిను రాక్షసులు సమీపింప జాలరేగానియీమణి కంకణములో రాక్షసాంధకరణములు సుమీ! ముక్కిడి మూకలు నిను సమీపించినను,

వారు నిను చూడ జాలరు. నీ రూప మెటుల నున్నదో, నీ వెందుందువో వారు కనుగొన జాలకుండు కొరకే యా ముని సత్తము డొసంగిన వరములవంటివి. వానినెడ బాయజనదు."

"నే నెన్నో సారులు చెప్పుచునే యున్నానమ్మా! ఆ మణి కంకణములు ధరించునెడ నే మూలనుండి రాము జేరెంచునో, అట్టి రామునకుంగూడ తాను గానరాజాలనేమో యని శంకించు చున్నట్లున్నది. ఆ మణి కంకణములు ధరించినను రామునకు గానరాగలవమ్మా! ఆ మణికంకణ ధారివౌ నీవు గానరానిది ముక్కిడి రక్కసులకు! మరి సంశయింప బని లేదు. ధరింపు మా మణికంకణములను—" అని సీత చెలికత్తె యా తులసి మొకసక్కె మొనర్చెను.



III

"ఆఁ—ఔను- నీ వట సీతను, నే నిట రామునింగూడ చూచితిమి. నీ విట సీతనై మారీచ సుబాహుల తత్సఖి జనులుగ జేసికొని యీవన ప్రాంతమున సంచరించుచు, విశ్వామిత్రి సమేతులైన, రామ లక్ష్మణు లీ తెన్నున రా దటస్థించినచో వారల నీ ప్రాంతమున గలసికొని కొంచెము తడయు నట్లొనర్పుము. మీదు మార్గమున వారేగినచో, నట దాటకతో మున్ముందుగ గట్టడి యొనర్చెదగాన నామెయు వారిని మన్ని గొనును. తాటకి వనప్రాంతమున వా రేతేరిన నీవు మరి,

జేయవలసిన పనియే లేదు. అప్పుడు నీవు సరా సరి నా విశ్వామిత్రి నాశ్రమ ప్రాంతమున నున్న వనమున కే తెంచి నీ బుద్ధిని వినియోగించి, యప్పటి పరిస్థితుల నవలోకించి, కాలోచితముగ మెలంగ నగును."

"చిత్తము; తమ పంపు నొనర్తును."

"ఇట నీ వృంతము. మే మిప్పు డీ విమానమున సీత విహార మొనర్చు వనమున కేగుదుము. నేటి సాయంకాలమున మరల వారు విహార మొనర్ప నట కరుదెంతురు. ఆ సమయము మేము బోగొట్టుకొనరాదు. నేటి చవితి చందురు డుదయించకయు మున్న నన్ని కార్యములును గొనసాగ వలసి యున్నవి."

"చిత్తము" అని సారణుడు శెలవు గైకొనియెను.

* * * * * * * * * * * * * * *

IV

"ఏమి యువ్వా! సేమమా?"

భవత్కటాక్షమున నిటుల—సారణుడు నా వర్తమానము దెలియజేసెనా?"

"మిథిలనుండి సారణుడు గొనివచ్చిన వర్తమానము, సారణు ముఖంబున నీ వనిపిన పరశురాము వార్త, విశ్వామిత్రుని గొంటుతనంపు పన్నాగము, జనకుని కపటపు టూహా, యివి యన్నియు నను జేరినవి. కష్ట పరంపరచే కాయము కూట్లుపడి నేమములనో తలవాచుకొని కాలముబుచ్చుచున్న

నీ కెక్కడ దాపురించిన దా వార్తావహత్వము ? ఏమీ, తనకు దానుగా రాజాలకపోయెనో యా కౌశికుడు ? ఇంతవాఱ్ఱిన కా పరశురాము బ్రతిమాలి నీ ముఖంబున నాకు గబురా ? ఆ పరశురాముడే యేల నా మునియాగము గాపాడరాడు ? ఎన్నో టకటొంకువార్త లంపగలిగిన నా జనకు డేల మూలలను డాగియుండవలెను ?

"చూచితివా, యవ్వా! తన పుత్రిక యగు సీతారత్నమును రాజరత్నమనగు నాకొసంగి వివాహ మొనర్పఁగోరుచు చిన్ననాటి స్నేహ మింతలో మరచునాయని యెంచి నేను సారణుముఖంబున జనకునకు గబురంపనను గాదని క్షుద్రమానవమాత్రుండగు రాముని కిచ్చి వివాహమొనర్చు నుత్సాహతో సారణునకు టక్కరి జవాబు నొసంగి పంపివేసి విశ్వామిత్రు యాగమిషను, సీతారాముల కన్యోన్యావలోకనము సిద్ధింపన శ్లేర్పాటు జేసికొని, ఆ యాగము నిర్విఘ్నముగా జరుగునట్లు నను బ్రార్థనాపూర్వ సంభాషణముల గోరుమని విశ్వామిత్రుడు పరశురామునితో జెప్ప నాతండును నీముఖంబున గబురంపెనుగా!

"చూచితివా, తాటకీ, యెంతమోసమో! నను మోసగింప నెంచి పన్నిన యీపన్నాగమునకు బ్రతిహతముగా విభ్రమనాటకమాడి సీతను గొనితే నేగుచున్నాను. నీ కుమారులగు మారీచ సుబాహుల, సీతవేషమున నున్న, సారణునకు సాయముగ నంపుము. విశ్వామిత్ర సమేతుడై రాము డీతెన్నున యాగ సంరక్షణార్థ మేతెంచినచో, నీ విట నాతని గడతేర్చుము. మీదుమార్గమున నాత డేగినచో, నట సారణ, మారీచ, సుబాహు లుందురు గనుక మరి చిక్కు లేదు."

"సార్వభౌమా! తా మింతదూరము నాకు గట్టడి సే
యవలెనా? ఒక్కమాట చాలదా?"

"అటుగా దటుగాదు. స్థితిగతు లన్నియు స విచక్షణగా చెప్పినచో నా కార్యదీక్ష నీకు సుబోధకమయి, నీవు సంపూర్ణ సహాయ మొనర్ప జాలుదువు గదా యని చెప్పితిని."

"చిత్తము."

* * * *

* * * * *

V

"ఏమి పింగళా, వెనుక బడుచున్నావు? బడలితివే, మార్గాయాసమున? అల్లదిగో మన మార్గాయాసమెల్ల బోద్రోలు గంగానదీ జలములనుండి వీచు పిల్ల వాయువులు పుష్పలతా నికుంజముల దాకి పూలతావులచే భార భరితమైనవో యన మంద మారుతములు వీచుచున్నవి. ఇక మన యాయాసములు దొలంగు." అని శ్రీరాము డనెను.

"రామ చంద్రమా! పింగళుని మార్గా యాసమున కేమిగాని, బలా బల విద్యల క్షుణ్ణముగా నవగాహనము జేసి కొంటివా?"

"ఋషిసత్తమా! నేను పఠించుకొనుచు మీయాన లక్ష్మణునకు కూడ నుపదేశించితిని. ఈతండును అభ్యసించుచున్నాడు."

"తమ ప్రసాదంబు కతంబున మా కాకలి దప్పులు తప్పి, మార్గాయాస మపనయించినది." అని లక్ష్మణుడు దృఢీకరించెను.

"మాహేశ్వరిం బునశ్చరణ మొనర్చుచుంటివా రామచంద్రా?"

"మే మిరువురమును గూడ బునశ్చరణ మొనర్చుచున్నాము."

"వేళ యతిక్రమించుచున్నది. మనము వడి వడిగ బోవలెను. మన మిపుడు బ్రవేశించునది తాటకవనము. ఇందు తాటక యను రక్కసి వేయి యేనుంగుల బలము గలది మనల నెదుర్కొన నేగుదెంచును. మన మిపు డప్రమత్తులమై మెలంగవలయును. మాహేశ్వరింజపించుచు మన మరుగవలయును."

* * * * * * * * *

## VI

"విద్యుజ్జిహ్వా! నీకు లక్ష్మణు రూపము చక్కగా నమరినది; కాని రామురూపము నాకమరినదా?"

"అమరుటయే కాదు—రామునితో రేయింబవళులు దిరుగుచుండు పింగళునకైనను తామే రాముడని, దోచకమానదు."

"మనమిట నదృశ్యకరణీ ప్రభావమున నొరులకంట బడకుండ సురక్షితులమే కదా!"

"అందుకు సందేహమేమి!"

"అల్లదె శాంతయు కొందరు చెలులును ఈ తెన్నున వనవిహారమున కెనలేని కుతుకమ్మున వచ్చుచున్నారు. కాని అందు సీత గానరాదేమి?"

"సీత వీరితో రాలేదేమో!"

"అయ్యో! వారిలో సీతలేకున్న మన ప్రయత్నమును శ్ర మయు నంతయు వ్యర్థమేయగును గదా!"

"అట్లన దగదు. వారి సంభాషణ మనము వినినచో కొంత కొంత తేటపడగలదు.

"మరి తేట పడుట కేమియు లేదు. మరి తేలవలసినది తేలి పోయినది. మరి సీత యిటకు రాదు. మనము నెత్తిపై గొంగు వైచుకొని మరల వలసినదే గాబోలు. కేవలము సీతావ హృదయుండనయి, దమయంతికొఱకు ఇంద్రాదులు మానవరూపము దాల్చి నలుని రూపమున నెంతేని శ్రమలు నొందిరి కాదే యని నామానసమున సరిపుచ్చుకొని యీపని కొడంబడియు, త్రిలోక విజేతనైన నే నీ నైచ్య సంధానం బొనర్చియు, నిట నట గుందుచున్న నాకు, తుదకు సీతా సందర్శన లాభమైన నొడ గూడదు కాబోలు!"

"ఇంద్రాదులకు దమయంతి యెంతచిక్కుట లేదు!" లో నిట్లను కొని విద్యుజ్జిహ్వుడు "ప్రభు శేఖరా! తామట్లు శంకింపనవసర ము లేదు. మరికొంతతడవున కామెయు రానోవు. అల్లదె అరసా లము పొంత గూరుచుండి యా నారీలలామ లేమో పలుకుచు న్నారు. మనమును సమీపించి యాలకింతము." అని ప్రత్యు త్తర మిచ్చెను.

* * * *

## VII

"తులసీ, చిత్తరువు వ్రాయు నిమిత్తము సంబారములు జేర్చిన శీలవతియు, రామ విహ్వలమానసయా నీ సీతకు

నైత్యోపచారముల నిమిత్తము తామరాకులను తామరతూండ్లను దేబోయిన సుచరితయు నింకను మరలి రాలేమి? నేటిరాత్రికిదప్పిన రేపటి రేపకడ వత్తురు శ్రీరాముడు లని నే నెన్నెనితెరంగుల నెరింగించితినే గాని శాంతింపదమ్మె నీ జానకి — తులసీ, ఆ వచ్చుచున్న దెవరో చూచి రమ్ము. శీలవతి యానట్లున్నది."

"ఔ నమ్మా, ఆ వచ్చువారు శీలవతియు, సుచరితయు నేమో హస్తతలమ్ములగొని వడి వడి వచ్చుచున్నారు."

"కొంత తోవ గానవచ్చినది. జానకీ, అదె మనశీలవతి వచ్చుచున్నది! ఏమో విశేషములు దెచ్చుచున్నట్లున్నది! నీవును శాంతింబొంది గూరుచుండుము."

"అదె రాముడీ రేయి కిట జేరునని, చూచివచ్చిన మన సర్వమంగళ చెప్పుచున్నది."

జానకియు సేదదేరి "శ్రీరామచంద్రుడీ తావున బ్రత్యక్షము కాకమున్న నా పరమపురుషుని రూపపటము చిత్రించి నాకు జూపువారైనను లేరుగా!" యని సోత్కర్షంబున బలికెను.

"అమ్మా, అపురూపమగు శ్రీరాముని రూపము, నాతని నా జన్మమును రేయింబవళులు చూచుచున్నట్టి దాననయ్యు చిత్రలేఖనారచన మెరుంగని దాననౌట నే నంతుల కుపయోగించను. కాని యేదో నొక యుత్సవ సందర్భమున వర్షమునకై దారు తూరులు వచ్చుచుబోవుచు రాముని సందర్శించుచుండు మన సర్వమంగళ మంచి చిత్రలేఖరి—

"సర్వమంగళా, ఏదీ, రాముని రూపపటము వ్రాయుము.

అదిగో శీలవతి గొనివచ్చిన చిత్రలేఖనా సంభారముల గొని యీ మంగళాకారుని యాకారము చిత్రింపుము. మా జానకి చూచి యానందించును." అని శాంత యనెను.

"సర్వమంగళా! శ్రీరామచంద్రుని రూపము నీవు చక్కగ జిత్రించినచో నీకీ మణికంకణములు బారితోషికముగ నిచ్చెదను."

"ఆఁ—ఊఁ—వలదు—వలదు—జానకీ, నీ సేమముకొరకు గౌశికుఁడొసంగిన యీ మణికంకణములు రాక్షసాంధఃకణములు గదా! నీ వవ్వాని నొరుల కీవగునా?"

"రాక్షసాంధఃకణములే కానీ; మానవాంధఃకణములే కానీ. శ్రీ రామచంద్రరూప దర్శనముకన్న నివి మిన్నలా? ఇంతకును మాటదాటుదాన నెట్లు కాగలను?" అని సీతయనెను.

 



## VIII

"సార్వభౌమా! మన యెదుట నెవరెవరు మాటలాడుచున్నారో గమనించితిరా? తులసీ శాంతల దొలుతనే గుర్తించి యుందురు; చిత్తరువు వ్రాయు సంబారములతోడను, శైత్యోపచార పదార్థములతోడను తరువాత నేతెంచిన శీలవతీ సుచరితలఁగూడ బోల్చుకొనియే యుందురు. వీరుకాక ఇంకొకరి కంఠస్వనము మాత్రమే యిపుడిపుడు వినవచ్చినది కాదా? వా రెవరో గుర్తించితిరా?"

"ఇంతసేపును రాలేదని మన మనుకొనుచున్నట్టియు, తా ధరించిన మణికంకణముల కారణమున మనకురూపదర్శన మొసంగనట్టిదియు, నిపుడు రాము రూపపటము వ్రాయుమని తన చెలికత్తెయను గోరినదియు నగునదియేజానకియని తలంతును."

"చిత్తము. ఆమెయేజానకి; మనము నేడింతవరకును నా కు రూపమే చూడజాలని వారమిపుడా సర్వమంగళ రాము రూపము జిత్రించినంతన జానకి తన మణికంకణముల నిచ్చివేయును గనుక, మన మా జానకిని జూడ ననువుపడును. అంతదనుక మన మీ నందనవన ప్రాంతముననే నిలిచియుండి జరుగబోవు విశేషముల జూచుచుందుము గాక!" అని విద్యుజ్జిహ్వుడనెను.







# పరిణయ విభ్రమములు

## ఏడవ ప్రకరణము

## తాటకవధ

"నిన్న మనము కామాశ్రమము దాటి సరయూ గంగా సంగమ ప్రదేశమున గాలము గడపితిమి గదా!"

వడి వడి నడచుచున్నారు.

"నేటి సాయంసమయమున (బ॥ చవితి)మన మీ తాటక వనము దాట వలసి యున్నది." అని విశ్వామిత్రుండనియెను.

"ఋషికుల సత్తమా! పట్ట పగలయ్యు నీ దుర్గ మారణ్యమున నీలపురుగుల గీపెట్టు రొదయు బెట్టిదంబయిన క్రూరమృగ సంకులారావములును, నీ పవలింటి జీకటిని మరింత భయంకరముగా సేయుచున్నవి. ఇదియే తాటక వనమా? తాటకకును ఈ వనమునకును సంబంధ మేమి?" యని రాముడు ప్రశ్నించెను.

"శ్రీరామా, తొల్లి సంతాన హీనుండగు సుకేతుం డను యక్షుండు సంతానార్థియై బ్రహ్మంగూర్చి ఘోరంబగు దపం బొనర్ప నా విధాతయు, వేయి యేనుంగుల బలసమన్విత యౌ నొక కూతుగలుగ వరంబొసంగె; అపు డాయక్షునకు జన్మించిన యనుపమాన బలసమన్వితయౌ నాతి యగు తాటకను ఝర్ఝ

గానే యు బూనిన మంథర యను విరోచనుని గూతు నింద్రుండు వధియించుట నెరుంగవా! మంథర యాడుది కాదా! మరియు భృగు పత్నియు, శుక్రుని తల్లియు నగు నారాగ, సృష్టిని బ్రతిసృష్టి యన దగిన నింద్రుని లేకుండ జేసెద నను నామె పూనిక చే, నీ ప్రకృతపు మాయా మానుష రూప మే పరంజ్యోతి నుండి తునకయై యిపు డిట నాముంగల నిలిచి యున్నదో, యా ప్రథమ రూపము, ఆశుద్ధబ్రహ్మ, విష్ణుమూర్తి యగుయి యాపైదలి యెదపై దన నిర్వక్ర పరాక్రమ యుతంబైన చక్రంబు నంపి హత జేసెనని మరియొక తూరి జ్ఞప్తికి దెచ్చుచున్నాను. మరియిక జాలము వలదు. నీకు జయంబగు గాత" మని విశ్వామిత్రుండు శ్రీరాముని హెచ్చరింప నాతండును విజృంభిత పరాక్రమంబున తన బాణ తూణీరంబుల గొని, తన వింటి నడుమును బిగికిలించి, బిగియించి, దిక్కులుమారు మ్రోగునట్లు మొరయించి, సారించి, టంకారంబు గావించి, తన విలువిద్యా కౌశలంబు బ్రకటింపనో యన, అస్త్ర బలంబు సూచింపుచు, మొయిలు మొత్తమ్ముల మధ్యమ్మున నున్న నా టక్కరి కత్తె నొక్క బాణమ్మున నిహత మ్మొనర్ప విశ్వామిత్రుం డమితానందంబు నొంది శ్రీరాము శిరంబు మూర్కొని మరల మరల నాశీర్వదించి, "తాటక చచ్చినది. ఇక నీ వనమున మనల నిపుడెదిరించు వారులేరు. ఈ రాత్రి యిందే మన ముపశమింతము. రేపకడ లేచి మ దాశ్రమంబున కేగనగు" నని యా రేయి నటనే కాలము గడపిరి.

తాటకచే బాధింపబడినవారును, ఆబాధల నెరింగినవారును నగు ఋషులు పెక్కండ్రు ప్రమోదవార్తం దెలిసినవారా రాత్రి

విశ్వామిత్ర సమేతుండగు రాము సందర్శించి, కౌశికుం గీర్తించి, శ్రీరాము నభినందించి, యాశీర్వదించి, దొలి ప్రమాదకరంబు లగు దుఃఖ పరంపరలును, తదనంతరము ప్రమోదాకరంబు లగు సుఖ తరంగములును, సమకూడు నను వచనంబు నిర్వచించుసన, సంజకడ జీకటియు, ననంతరము వెల నెల రేయి యునగు నా రాత్రి, రాత్రించర మారణాంతరము, సుఖంబున గాలము గడపరి. మరుచటి యుదయమున, లోకంబున తపస్స ప్రవర్తింప జేయు నుద్దేశముతో, తొలుత తానే తపం బాచరించుటకును, యోగంబనుష్ఠించుటకును సిద్ధయుం బ్రొద్దె వసంబున వాసంబు సేసెనో, మహా తపోధని యగు కాశ్యపుం డేవనంబున సిద్ధిం బొందుటం జేసి సిద్ధాశ్రమంబను పేరు వహించెనో, ధర్మ కీర్తనీయ బ్రహ్మర్షి జనసె, దేవతల సంతోష నిమిత్త సహితముగా జయించి, భగవదారాధనా రూపంబగు నొక యజ్ఞంబు గావించు చుండి, సకల చరాచర రూపంబగు నీ సృష్టి నంతను దన తపోబలంబున గజ గజ వణంక జేసెనో, అట్టి రాక్షస రాజగు బలిచక్రవర్తిని వామనావతారంబున నే తాను మూడడుగుల మేర నడిగి, మూడవ యడుగున బలిని నణంచెనో, శ్రీ మహావిష్ణువు నవరావతారంబగు వామ దేవున కేదియాశ్రయ మయ్యెనో, అట్టి యీ యావాసమే మున విశ్వామిత్రు నావాసము. ఈ యావాసమున బ్రవేశించిన పిదప, గడచిన రేయి జరిగిన తాటకవధ వలన, స్త్రీ హత్యా దోషము నివారించుకొనన నవసగు మంత్ర రాజంబుల శ్రీరామున సుపదేశించి విశ్వామిత్రుదు లటనే అపరాహ్ణము దినుగు నందాక గడపి సాయంకాలము సరు యోగివాలకు బో



......నా టక్కరికత్తె (తాటక) నొక్క బాణమ్మున నిహత మ్మొనర్ప— 47.

నుంచి తత్సమీపస్థలి నున్న యుపవన ప్రాంత మందలి ఋషులచే సగౌరవమ్ముగ సమ్మానింప బడుచు, సూర్యు డస్తాద్రికి జనక మున్నె, దామును యజ్ఞ వాటికకు బో బయనము సాగించుచుండ విశ్వామిత్రుడు శ్రీరామున కెన్నెని *అస్త్రములును, తత్తదుప సంహారములను నుపదేశించెను.



*ధర్మచక్రంబును, కాలచక్రంబును లోనుగాగల మహా చక్రంబులును బ్రహ్మాస్త్రాది దివ్యాస్త్రంబులును, మోదకి శిఖరి మొ॥ మహాగదలును, కాల పాశ, వరుణ పాశాది మహా పాశంబులును, మరియు నెన్నెని మహాస్త్రంబులును, సత్యవంతము, సత్యకీర్తి, ధృష్టము రభసము, ప్రతిహారతరము ఆదిగాగల యుపసంహారంబులు గూడ రామున కుపదేశించి వానివాని నియమానుసారముగ పునశ్చరణల గావింపజేయుచు, మెల్లమెల్లన బయనము సాగించుచు నేగుచుండిరి. రాముండును తా నేర్చినదెల్ల తన తమ్ముండగు లక్ష్మణునకు నేర్పుచు బునశ్చరణము సేయించుచు, తత్తదధి దేవతల స్వాధీన పరచుకొనుచు, తన తమ్మునిసయితంగూడ స్వాధీనపరచుచు తదుపసంహారములగూడ నభ్యసింపజేయుచుండును.



# పరిణయ విభ్రమములు

## ఎనిమిదవ ప్రకరణము

## ప్రతిజ్ఞా పాలనము

### I

"రాముడిక నీతెన్నునరాడు. ఇపుడిపుడే మనము వినిన యీ హాహాకారమునుబట్టి చూడ తాటకకును రామాదులకు ను నేదోయొక సంఘటనము సంభవించియుండును. రాముడిక నీతోఁ బ్రవనురాక హుటాహుటిని విశ్వామిత్రు నాశ్రమము జేరి యుండును. మన మిక నిటనుండిన బ్రయోజనమేమి? తులసీ, నీవు మున్ముందుగ నేగి సీతాదు లెట నేమి సేయుచున్నారో చూచిరమ్ము."

"ఇదె పోవుచున్నాను."

అనుచు తులసియు నాతావు వీడి చనెను.

"అమ్మా, తాటకను రామాదులు సంహరించియుందురే మోయని నాకెంతేని సంశయము కలుగుచున్నది. కానిచో తాటక యంతటి యర పరువ నేమికారణ మయియుండును?"

"రామునకు మతి (వి) భ్రమము గలుగజేయ నెంచి యిటుగాచుకొని యుండుటవలన నీకును మనోభ్రమము కలిగినట్లున్నది. కానియెడల అప్రతీప ప్రతాపవంతురాలగు తాటకను

ప్రతారింప రామాదృశులకు వశమనుట, అబలారూప ధారణమాత్రముననే, నీకు బేలతన మలవడుట కాదే!"

"కావచ్చునేమో; అదే! తులసి—తులసీ! యే మిది!! మనోవేగమునకన్న మిన్నయగు వేగమున మరలి వచ్చితివే!!!"

"తులసీ, యేమి విశేషములు?"

"విశేషముల కేమున్నది. కొందరు స్త్రీలట నున్నారు. సీత చెలులని యనుకొనుచున్నాను. రాముడట లేడు. సీతయంతకన్నను లేదు. ఆ స్త్రీలోకము లేచి నిలచి యుంట నవలోకించితిని. అందొక తరుణీమణి తనచేతనున్న పటము నింకొకరితకందిచ్చుచున్నది. అందరును దానినే దిలకించుచు తలల పంకించుచున్నారు. ఆనందించుచున్నారు. ఎటకో పో బ్రయాణోన్ముఖులై యున్నట్లున్నది. ఇంతే సంగతులు"

"సరే! తరుణము మంచిదే. ఇక రాముడా ప్రాంతమునకు తాటకను తప్పించుకొని రాగలిగినచో, వచ్చుటో, లేక రాలేక తాటకచే జచ్చియుండుటో జరిగితీరవలెను. కనుక తులసీ, మనమిటనుండ బ్రయోజనము లేదు. నీవిపుడు వారిని జూచివచ్చితివిగదా. మనరూపము లక్కడనున్నవారిలో నేరేరిని బోలియుండవలెనో, అట్లు సమముగా నమరియున్నవా? కానిచో సరిగ్గ సవరించుకొనుడు. ఇక మనము దక్షిణముగా బోయి, యావనమును సమీపింతుము."

"సమీపించిన పిదపనైనను నీవమాత్రము ముందేగి రాముని జూచి యాతని విభ్రమింపజేయుము. దూరమునుండియు క్షణమాత్రములో నిన్ను గలుసుకొనగలము. కాదేని రసభంగమునకు గారణంబగు. రామాదులు కాలినడకను రారుతే.

వారును విమానములపైనే వచ్చియుందురు. కాని వారే విప్పటికిని గానరాకుండుట కేమికారణంబగు ?"

పడి పడి నడచుచుండిరి.

ఈ సీత యొంటరి యయ్యెను.

* * * *
* * * * * * * *

II

"బాబూ, సార్వభౌముడు లంకా పట్టణమున కింకను తరలి రాలే దేమని, కనుగొని రమ్మని విభీషణ ప్రభువ రేన్యుడు నను మీా కడ కంపవచ్చినాను."

"సార్వభౌముడు జానకిని దోడితే సి తెచ్చు సరి యోగెను. విశ్వామిత్రుని యాగము జూడవచ్చినదట జానకి!"

"ఈనాటికి సార్వభౌముడు జానకితో మరలియుండునా?"

"ఏదీ— ఇంకను సంపూర్ణముగా తెలియలేదు—గాని అనిలా, జానకినిగొని త్వరలో సార్వభౌముడు లంకను చేరగలడని విభీషణ ప్రభునితో చెప్పుము".

"సరే—ఖరశేఖరా, శెలవు దీసికొందును."

అనుచు విభీషణు పంపున వచ్చిన యాతని యనుచరుండగు ననిలుడు ఖరాలయము వీడి లంక కేగెను.

III

"రూపపటమున జిత్రింపబడిన రూపము జూచి ఆమె తొటుల తల పంకించుచున్నదో చూచితే రామా ?"

"ఎవతె యెటుల దలపంకించిన నేమి? ఏది సీత? అయ్యో! జానకి యేదీ?"

"మణి కంకణ మీఘుచ్ఛన్నంబైన చంద్రరేఖయుంబోలె జానకి డాగియున్నది."

"అట్లని సంతసింపుమందువా యేమి?"

"అక్కరలేదు. రూపపటము జిత్రించినవారి కా కంకణముల నుపాయనముగా నొసంగి తమకు రూపదర్శన మొసంగగల దా జానకి—వారేమో సంభాషించు చున్నట్లున్నది. మన్మిూ పొదలమాటునన నుండివిందుము గాక."

* * * * * * * * * * * *

## IV

"సరిగా జిత్రించినది. బహుమానార్హమైన యీసర్వమంగళ చిత్రలేఖనా సామర్థ్యము సంస్తవనీయము."

"సర్వమంగళా! ఎవరిని చూచే ఆచిరునగవు?"

"మరెవరిని? మన జానకిని—"

"నీ మొగతాళి మానవుగదా!"

"సహజముగా రాముడు స్మితాననుడే! ఎల్లప్పుడును మొగమున చిరునగవు దొలుకాడుచుండునే! అంతియేగాని ఒకరిని జూచి నగవును, వేరొకరినిజూచి యింకొకటియు నాతని కుండదు."

"ఈ స్మితముసహజమేగాని, ఉద్దేశపూర్వకముకానేకాదా?"

"సీతా! నీకేమి బుద్ధిమాంద్య మమితమగుచున్నట్లున్నదే! చిత్తరువున నున్న రూపము నిను జూచి, మందహాసముసేయునందువా యేమి? నీ విటుల మాటలాడుచుందువు గనుకనే తులసి నిన్నిక సక్కెము సేయుచుండును. అగు, మందమేల మగుంగాని నినుజూచి మందహాస మొనర్ప నదె రాముడుసు దెంచుచున్నాడులే!" అని శాంత యనెను.

"రాముడే స్వయముగవచ్చినచో, నిక నాతనితోడి సల్లాప

ము లతో నాబాల్యోత్సాహికము మాటయే మరచెదవు. ఇక నో పారితోషిక మొసఁగుము." సర్వమంగళ బింకము జూపెను.

అందరును విశ్వామిత్రాశ్రమోన్ముఖులైరి.

"ఏమి యాలోచనలో బడినదా వేమి? శ్రీరాముని దర్శించిన పిదప నాపటము నావలబారవైచి వానినే దర్శించుకొనుచు ననుజూడక యూరక గూరుచుందువు. గాబోలు!

"శాంతా! చూచితివిగదా యీ యన్యాయము! నీయట్టి సాక్షి యుండగనే యిటుల జేయుచున్నదిగదా యీ జానకి! నీవే లేనిచో నికనే నెరితో మొరవెట్టుకొనగలను?"

"సర్వమంగళా! రామురూపపటమును రచించుపట్ల నీవెంత త్వరితగతిని చూపితివో, అట్లనే నీ యూహలును నీమాటలునుంగూడ తొందరను పొందియున్నవి. తా నిదివరకు శ్రీరామ రూపముంగూర్చి వినిన యట్టి స్మితాననము, ధవళాబ్జ పత్రనేత్ర యుగము, * కాకపక్షములు, కంబుసన్నిభ కంఠము, దృఢ గుల్భములు, దీర్ఘ బాహువులు, పీన వక్షము, పదయుగంబున బద్మ రేఖలును, మన జానకి బరీక్షించి సంతృప్తి నొంది, దుందుభి స్వనము వినమే యని బరిశీలించుచు నుండనోపు. తొందరయేల! నీబహుమానము నీకనుమానము లేక నొసంగక దా నవమానము నొందు ననుకొంటివా?"

"ఏమో అప్పుడే హస్తతలమ్మున చిత్తరువు నిడుకొని వడివడి నడచుచు నాశ్రమము సమీపించుచున్నది గదా! ఇంకెప్పుడు నా బహుమానము—"

* * * *

* కాకపక్షములు=జానపములు

V

"ఏమిది! తుదకు మనమిట నామె రూపమయినంజూడజాలక నువ్విళులూరుచు నిలువవలసినదే గాబోలు! ఏమోయి, నామనం బెంతేని తత్తరించుచున్నది! త్వరపడినగాని కార్యము చెడునట్లు దోచుచున్నది! నే నొక్కరుండనె బోయి, యామె నెత్తుకొని వచ్చెదను."

"వలదు- వలదు- జానకీ రూపమయిన గాంచజాలని మన మిపుడిం దే గజగమన జానకియని గొనిరా సాహసింపగలము?"

"అయిన నింకెప్పుడు?"

"సమయమునకు వేచియుండవలెను. అదిగో మణికంకణముల గూర్చి వారల నేమో సంభాషణ జరుగుచున్నది. అది గమనించుటే మనకు గర్తవ్యము—లొందరింపజనదు."

*　　*　　*　　*
* *　* *　* *　* *

VI

"సర్వమంగళా! ఆడినమాటదాటుదాసనని నీమానసముస నటమటించుచున్నావా! అపురూపమగు శ్రీరాము రూపము నా కనుల గట్టినట్టుల జేసిన నీచిత్రకళానైపుణి బహూకరింపబడకనే రిత్తవోవునే? ఇదె మెచ్చితి! ఇచ్చితి నివె గొనుమా మణికంకణములు!!"

సర్వమంగళయు నా మణి కంకణముల గైకొన, వా రంత మను సరస సల్లాపంబుల నాపక్కనున్న నికుంజ కుంజంబులకై పెస విన విన సేగిరి.





# పరిణయ విభ్రమములు

## తొమ్మిదవ ప్రకరణము

## తప్పుల తమాషా

"ఏమోయి లక్ష్మణా! యింకను తత్తరింపవలదు. తడయు చుందువా? జానకీ రూపవులీల జూచితిని. ఆమె నునుబల్కుల వింటిని. ప్రతిఫలించుగండఫలకమ్ములపోలిక గాంచితి. అర్ధచంద్రుని సొంపునైన నవఘుళించు మోము సొ రారసితి, త్వరగమనయై పోవుచుండ జానకీ కుటిల కోమల కేశమండలి మందార దామ మకరంద రస పానమ్మున నొడల్దెలియక మధుపాళి సేయుచుండిన గాన రసాస్వాదన మొనరించితిని. పోబోవుచు తుదకు రామావృత స్వాంతయై పలికిన ములుకలవంటి పలుకులు గూడ వింటిని. నా మనం బెరిసెడిని— తుదకు సీతయు మన దృక్పథము దాటినది. వేచియుండుమని పలుమారు నుడువుచు తుదకీ దుస్థితి నీవ జేకూర్చితివి—ఎంతపని జేసితివి?"

"వేగిరింప జన దుపాయమ్మున నామెంగాని యేగవలెనంటి నం తెగాని— భమ న్మనోవాంఛ జేకూరమికి గాదు. ఇంతకును సీత నా నికుంజముల పొంత కొక్కరిత మున్నుందుగ నేగినది. మన మీ దెస నేగిన నామెం జూడగలము.—"

ఇరువురును నాల్గయి దడుగులు వెనుకకు నడచిరి.

"రామా! అల్లదె—ఆ నికుంజముల పొంతనుండి సీతయే వచ్చుచున్నది. ఆమె వెంట నున్న పరివార మామెను సమీపింపకమున్నె మీ కార్య మాచరింపుడు. నేనును విమాన సన్నాహమున నుందును."

* * * * * * * * *

"ఔరా! యివ్వరారోహ యెంతటి గొంటుతనంబు గలయది? ఇం కెందు బోగలదు!"

కన్నుల బడుటయె తడవు; మరి తడవులేదు. అప్పపాటు కాలమైన వ్యవధిలేదు.

* * * * * * * * *

ఈ సీతా రామలక్ష్మణులు విమానమున నున్నారు.

అదె! విమాన మవాఙ్మానస గోచరమై నింటిదెస, కంటిరెప్ప లల్లాడునంతలో నెన్నియో యోజనముల దూరము బరతెంచుచున్నది.





# పరిణయ విభ్రమములు

## పదియవ ప్రకరణము

## స్వయం కృతాపరాధము!

## రహస్యము బయలు వడుట

"జాహ్నా! యివ్వరారోహ యెంతటి గొంటుతనంబు గల యది! ఇంకెందు బోగలదు?

* * * * * * * * *

"అహా యేమి యీ సోయగము! మన్మధుండను విధాత నేరకేటటి యనల్లెచ్చి వెన్నెలతేటనించి, తొల్కారు మెఱుంగులం దుఱంగలించు రంగులిడి, సుధన్ప్రజునిచ్చి, మేటి శృంగార రసంబు జిల్కి, యీసోయగముల బొమ్మను నబ్రముగా రచియించి యుండవోపు. కాముడు కామారిశ్రమమున దహనమై చిర కాలమయ్యును, రూపముల సృజియించు శక్తి వీనికెటనుండి గలిగెనోగదా! స్మరు డనుమాట వాసికినిగూడ స్వాయముగ జెల్లు నన నిట్టి రూపముల సృజియింపనోపు. కన్యారత్నమగు నీమెస్త్రీరాజరత్నమనగు నాంకేల దగదు? ఇంతకును అవివాహిత యూ నీమె యెల్లరిసొత్తునునై యుంట "వానిదే యగును; గాని సదిది కా" దని యేను వాకుృవ్వగలరు? భాషా ప్రపంచమున

స్త్రీరత్నావళి వంటిదే కన్యారత్నముం గూడ! సరిరాని సుకళాం
తలును, ఉపమింపరాని యక్షసతులును, ప్రతిరాని కిన్నర భామ
లును, పోల్పరారాని సిద్ధవనితలును అసమానలౌ గరుడస్త్రీలు
ను, దీటురాజాలని గంధర్వస్త్రీలును సీమెకుసాటిరాజాలమి వీరిని
విడిన మఱి యేకి యీయామె కెనయగు యన్న మిన్నలు!” అని
తనవిమానమున నున్న సీతం గూర్చి లక్ష్మణ సహితుడౌ నా
రాముడు తనమనమున ననుకొనుచు ఒక యూహాపోహము జేసెను.

ఈసీతయు నోట మాటలేక యుంట తన్నొంటిపాటున నొక
పూరుషు డెత్తుకవచ్చెగా యను నభిమానమందుమా? చాలిక
త్తైలకు దూరమైతినే యను దుఃఖమందుమా? వివాహముజేసి
కొన దలంచియు, నిటుల విమానమున గొనిపోవుటజూడ సరి
వారిలో నవమానము కాదా యని చింతిలు చున్న దందుమా?
మఱియేమందు మా బిబ్బోకవతి నోటమాటలేని మానము
దగ్గిను? లేక యుండేదియుగాక, నే గోరుకొనుచున్న రాముని వ
శే జిక్కితి నను ననునయ సంతోషమున నోడత్రైలియని ఘూన
మా? ఇదియునుగానిచో నిక కపటనటనమే యని యుందుమా!

ఏది యెటులున్నను ఈ సీత తన మానసమున, నేమి
యనుకొనుచున్నదో వ్రాయ నశక్య పడకున్నది. ఇంతకును
స్త్రీల మానసము లగాధములు కదా! ప్రక్క నున్న లక్ష్మ
ణుండును నోరు మెదల్ప డయ్యెను. వీరి యూహా లభేద్యము
లాయెను. ఇక వీరి యూహాలు వీరి యాచరణాల వలన గనుగొ
నవలసినదే గాని మరి మార్గాంతరము గానరాదు. అదిగో, వి
మానము డిగ్గి అందలి యా రాము డెటకో బోనున్నాడు. ఆ
తని ననుసరింతము. ఈతడు విమానము దిగుటయు దపపుగ

పెనుబొబ్బ లిడుచు భీకరాకారయగు నొక వ్యక్తి, “చిరకాల మునకు మానవాహారము దొరకినది. ఇతడే రాముడు కానోపు. ప్రభునాజ్ఞయు గడ తేరును—” అని ప్రకాశముగ సువ్యక్తముగ బలుకుచు పాప మీ రామునిపై నురుక బోవ రాముండును, “ఖరా! నేను నీ ప్రభువు నగు లంకేశ్వరుండను; నినుగూడ సంపూర్ణముగ భ్రమ పెట్ట దగిన రాము రూపము దాల్చి తిరస్కరిణీ ప్రభావమున నొరులకు గానరాకుండ మెలంగి, తుద కదృశ్యకరణి నావల ద్రోసి జానకిని గొని వచ్చితిని. లక్ష్మణు రూపమున విద్యుజ్జిహ్వుడును సీతయు విమానమున నున్నారు. తాటక వన ప్రాంతమున జానకీ రూపమున నున్న సారణు డిటకు వచ్చినచో, సీతంగొని, ప్రభువులంక కేగెనని చెప్పి యాతని కా విమానము నిచ్చి పంపి వేయుము.” అని మరియు నేమేమియో సంభాషించుకొనుచు విమానము సమీపించిరి.

వీరు విమానమును సమీపించుచు “జానకి రూపమున తాటక వనప్రాంతమున నున్న సారణు డిటకు వచ్చెనా, సీతంగొని ప్రభువు లంక కేగె నని చెప్పి యాతని కా విమానము నిచ్చి పంపి వేయుము—” అని యాడుకొనుచుండిన మాటలా సీత చెవిని బడుటయో దడవుగ నేమొకో గాని, యింత దనుక ప్రఫుల్లముగ నున్న ఆ జానకీ ముఖచంద్రబింబము కళావిహీనమై వెల్వలబోయెను. ఇంత దనుకను మానము నూనిన ఈ సీత “ఎంత మోసము! సార్వభౌమా, యెంత మోసము!” అని యెలుగెత్తి దీర్ఘోచ్ఛ్వాసము విడిచెను. పాప మీ లక్ష్మణుండును వెల వెల బోయెను. ఇక నా రామునకా! పాప మాతని మిన్నువిరిగి మీద బడినట్లు, నేల చతికిలబడెను. సీతయు నేను సారణుండ ననియు, తాన్న

లనకొని, మీ వెంట బడి, తుదకు ఘోరాలయము వరకును మిమ్ము ననుసరించి, కడకు ఘుమని త్రోసి నో లంకేశ్వరా, నీవు లంకేశ్వరుండవ నని చెప్పుకొను వరకు మీ మాయల దెలిసి కొన జాలక యింత దూరము మిమ్మనుసరించిన పాపవిమోచనార్థము సచేల స్నాన మొనర్చి వార్చుకొన బోదుము. ఈ రాత్రి నను మమున నిశాచరులను మిమ్మనుసరించుకంటె వేరుపనలేమి అదె యట కానున్న మిశ్వామిత్రు యాగము జూడ బోదుము. మీ రెందేగిన నేగుడు. పొండు!





# పరిణయ విభ్రమములు

## పదునొకండవ ప్రకరణము

### సహాయ సంభ్రమార్థనీయము

"ఎంత యవమానము! ఎంత మోసము! ఎంత నీచపు పనికి మానసము పీకినను, లాభింపక అపారమైన యవమానాంబుధిం బడి మునింగితిమి! ఇంక నీ మొగ మెత్తుకుని యెవరిని జూడగలము. సారణా, నీ కిడిన కట్టిడియే, తుదకు స్వయంకృతాపరాధముగా పరిణమించి మించిన యపరాధమయ్యెనే!"

"ఇందు నా మోస మేమియు లేదు. తాటక వనమున గగ్గోలు వినినంతనె, యిక, నే నా తావున నుండిన బ్రయోజనము లేదని యెంచి, సీతాదు లుండు తావున కేతెంచితిని. అట సీత తన చెలికత్తెలతో నెటకో పోబోవుచుండ తత్సమీపమున రాము రూపమున నున్న తమ్మొంటిగ నుంట జూచి, నిజమగు రాముగా నెంచి, యపుడిచ్చు యదనని భావించి, సమీపించితి. నే ననుకొనినట్లే నన్నే సీత యని భ్రమించి సన్నిత్తుకరాగా, రామాపహృతనైతిగా నని తలంచి సంతసించితినే గాని యీ విరాధు వనప్రాంతపు దెస నేగుచుండిన తమ విమానపు తెన్నవలోకించి, కించిత్తు సంశయించితినే గాని, ప్రేమ మాడిన నేమి వచ్చునో యను భయమున మిన్న కుంటిని

ఖము డిప్పుడిట తమ్ము బలుకరింపకున్న నింకను నాకు దెలియ కనే పోవును గాని సంశయము మాత్రము వృద్ధియగుచుండె డిని." అని సారణుడు నుడివెను.

"ఇందీ విద్యుజ్జిహ్వునిదే తప్పు. అగు మాకు పనియే పన్న చివర వరకును దాచించు చుండి, తుద కీ యవమానము ను మోసమును జేకూర్చెను. విద్యుజ్జిహ్వా! ఈ యపరాధము నీయందున్నది గదా—ఇందు కేమందువు?" అని రావణు డనెను.

"సార్వభౌమా! ఇది నా యపరాధమే యైనచో, నేను శిక్షితుడను కావలసినదే; కాని నేను శిక్షితుడనైనంత మాత్ర మున తమ యభీష్టము నెరవేరదే!" అని విద్యుజ్జిహ్వుడు రాజనీతి గాంభీర్యమున లోకజ్ఞానమును సూచించెను.

"కావున నేమందువు?" అని రావణుడు కెక్కసమున వెక్కసము చూపెను.

"తమ యభీప్సితము నెరవేరు నట్లును, నాకు శిక్ష యగు నట్లును దామే యోచించి నను నియోగింపుడు."

"నేను నిను నియోగించుట కాదు. నీవు నీవ నియో గించుకొని మదీప్సితము తరుణము పెడకుండ నెరవేరు భారము నీవ వహింపుము. ఈ ప్రయత్నము సఫలత నొందు వరకును స్వదేశమున కేను మరలువాడను గాను."

"చిత్తము. తమ బాల్య మిత్రుండను, తాము తలంచి నంత మాత్రమున బ్రత్యక్ష మయి బ్రసన్నుడు కాగల పా తాళ లంకేశ్వరు సహాయ మీ కార్యమున నెంతేని యపేక్ష ణీయము."

"నీవు జలస్తంభన యంత్రి సాహాయ్యమ్మున నాతని కడకు బోయి నే నంపితి నని నుడివి, వైళమ దోడ్కొని రమ్ము. పొమ్ము."

"చిత్తము."

విద్యుజ్జిహ్వుడు మరి యిట లేడు.

*   *   *   *   *   *

"సారణా! రాము రూపమున నున్న నన్ను సీత వేషమున నీవు, సమీపించు సరికి నలువంకల దిలకించి యుంటివా?"

"జ్ఞాపకము లేదు గాని—చూచియే యుందును. ఏమి? ఏ కొరకయి నను బ్రశ్నించు చున్నారో విన గోరెద."

"ఏమియు లేదు— నిను నే గొనిపోవు నపుడే రైనను నను జూచి యుందురా—యని."

"ఏమో గాని కొందరు మునుల శిష్యులును, యజ్ఞవాటికను జూడవచ్చిన వారును, దూరమున నున్నట్లు బొడకట్టి నది. ఉండిన నేమి? చూచిన నేమి?" అని సారణు డనెను.

"అటు కా దటు కాదు. ఈ యవమానమునకు దోడుగ నింకేమి మంగళహారతు లందవలసి వచ్చునో యని యిపుడె తెలిసికొన గోరి యడుగుచున్నాను."

"నే నంతగా బరిశీలింప లేదు గాని అందు వలన నెట్టి యిక్కట్టును రారాదు."

"మన మూరక నిట నిలువ నేమి ప్రయోజనము? నీవు త్వరగ మనుండవయి పోయి యజ్ఞము నాలుగైదు రోజులు గతించు దాఁక మున్నకుండి అనంతరము యజ్ఞ కుండము వెల్వ్ర

నిశ ముందున కేమి కానయి యున్నదో యని సంశయం బలపడుచున్నది.

"ఛీః—ఇంతకును పట్టుదల యున్నచో నెట్టి కార్యమయిన నిరాటంకముగా కొనసాగ గలను గదా! చూచెదగాక, ఏది యెటుల కాజాలదో!" అని రావణుడు తన మనమున వితర్కించుకొనుచు నుత్తరదిశను గూర్చి. ప్రయాణమయ్యెను.

శిశిరఋతువు. మార్గశిరమాసము. సంధ్యాసమయము దాటిపోయినది. వెలుగుపోయినది. చీకటి దట్టమయ్యె, దురాలోచనా పరుడగు వాని హృదయ గాఢత్వము సూచించుచు, వాని దారుణప్రటాహాసమితివలె దుర్భేద్యమై, వాని రూపమువోలె భయంకరమై, అనన్యసామాన్య భయానకత్వమొందియుండెను.





# పరిణయ విభ్రమములు

## పండ్రెండవ ప్రకరణము

## యాగము

"రామా! యిదె యజ్ఞవాటిక; యిదే సిద్ధాశ్రమము; వామదేవుని యందలి యనన్య భక్తిం జేసి యాతని దైన నియ్యాశ్రమంబున గాపుర మున్నాను. శ్రీరామా! నీవు శ్రీ విష్ణ్వవతారంబున వామన రూపుండవయి యీ యాశ్రమంబే గయికొని యుంటివి; గాన తొలి నీకును, వలి నాకును స్వంత యావాస మైనది. ఇపుడు మన మిరువురము నిట జేరితిమి. ఇం దేమి యుపాయములు నాకును నా జన్మంబునకును వాటిల్లినను నీకే వాటిల్లెనుగా దలంతువు గాక! యజ్ఞ విఘ్నకారులౌ రక్కసులీ యిక్కడకే మక్కువ వత్తురు. మారీచ సుబాహులాదిగా గల పెక్కండ్రు రక్కసులీ తావున చరియించు మునుల నెన్నేనిధాల బాధించు చుందురు. నా జేయు యజ్ఞంబునుం గూడ వా రేమి సేయుదురో యను భయమున నే నిన్నిటకు గొని తెచ్చితిని. నేడే నేను యాగదీక్షవహింతును. నీవును నీ యనుజన్ము సహితంబుగ నారహోరాత్రులు నిద్రాహారములు మాని కేవల ఫలాహారములపై నాధారపడి యీ తపోవనంబునకు గాపునై, కేల బలుల నూని యీ యజ్ఞంబు గాపాడుడు. మీ ధైర్యసాహస విక్రమంబుల జూపుడు, క్షత్రియ

కుమార కిశోర సింహము లనిపించుకొనుకు. నావలన నీవును, నీవలన నీ దమ్ముండును సకలాస్త్రంబుల నేరిచియే యున్నారు గదా. మీతో వచ్చిన పింగళుడీ జన్నము జూడ వచ్చిన రాజపుంగవుల విడుదల సుఖంబున నుండగ గలదు. నేటి నుండియు యాగము జూడ రాజకుటుంబములు స్త్రీ పురుష వివక్షత లేకయే వచ్చుచు, బోవుచు నుందురు సుమా! క్షత్రియ లోకమున కపఖ్యాతి రానీయక, నా క్రతువున కంత రాయము వాటిల్ల నీక, పీక మెయి నేటి మొదలారు దినములపరిమత్తులయి సోదరు లిరువురును జన్నము గాపాడు దీక్షను బూనుడు. ఇదె నేనును యాగ దీక్షను లుపక్రాంబగుచున్నాను."

"తమ యాగము నిరాఘాటముగ గొనసాగ గల దను ధైర్యమున నిబ్బరముగ దీక్ష నూనుడు."

అగ్ని వేల్చుచుండ, విశ్వామిత్రు డగ్ని సమీపమున దీక్ష వహించి యుండ, రామలక్ష్మణులు బాణతూణీరములతో గాపుండ నిలచి యుండిరి.

"శ్రీరామా! సూర్యోదయమునకు బూర్వమే లేచి కాల్యంబుల నిర్వర్తించుకొని, సూర్యోదయ సమయమునకువచ్చి అపరాహ్ణమగు వరకును బాణతూణీరయుతులై మీ రిరుగురు సోదరులును యాగము నిర్విఘ్నముగా జరుగ గాపుండుడు. మరల సూర్యుడస్తమించు నెడకు యాగవాటిక కడ దెల్లవారున వేగుంజుక్క పొడమువరకు గాపుండ వలయు. ఇక నీ మునిపుంగవుండు దీక్షనూని యుంట వలన వ్రతమునను నుండును. ఏ విషయము మీ రిరుగు రన్నదమ్ములును దెలిసికొనగోరి నను మునికులతిలకమగు నీ విశ్వామిత్రుని బలుకరింపక, జన

మహస్సురసి తెలిసి కొను" డని యటనున్న మునులు దేట తెల్లముగ బలికిరి.

వల్లె యని రామ లక్ష్మణులును నా యాజ్ఞల నౌదల ధరించి యప్రమత్తులయి కాచి యుండిరి.

రానున్న విశేషములు, వినవలసినవార్తలు, తెలుసుకొన దగిన విషయములు నొక యోరకుంచి, యిపుడు మన యెదుట జరుగుచున్న యాగదిదృక్షులమై, అటదీక్షలోనున్న విశ్వామిత్రుని స్థితిగూర్చియు, యాగవేదికపై బ్రహ్మపీఠమున వేంచేసియుండిన శ్రీ ఋష్యశృంగమహర్షిం గూర్చియు, మరియు జుట్టును యాగ కార్యావలంబులయి యుండిన తదిర ఋషి.లోకముంగూర్చియు, యాగపరికరములుం గూర్చియు, ప్రకృతము విపులముగా నిట వర్ణింప బూనుట యప్రస్తుతము కాదా యని యవ్వలికథ వినబోదుమా ?





# పరిణయ విభ్రమములు

## పదమూడవ ప్రకరణము

# సహాయ సంపత్తి

"ఇదె సుస్వాగతము—నీకు. పాతాళ లంకేశ్వరా! సుస్వాగతము!"

"సర్వదా దిగ్విజయమస్తు. నను బిలచిన కారణం బేమి ?"

"ఏమని చెప్పుదును? నాకు జరిగిన యవమానమును నీ కేమని విశదీకరించ గలను ? నాకే సిగ్గుచున్నది గదా!"

"నిన్నవమానించు నంతటివా డెవడు ?

"నీవలె:—

శ్వసనునిచేత లోగిలి సమ్మార్జనము చేయించుకొని, సముద్రునిచే నింటిముంగల గలయంపి జల్లించుకొను నంతటి మహా శూరుండును,

అనలునిచే వండించుకొని, యమునిచే, గూడ బరి చర్యల జేయించుకొను నంతటి ధీరాధి ధీరుండును,

దేవేంద్రునిచే గల్పక ప్రసూనముల దెప్పించుకొని ధనుజాధి నాధుచే గైదండ నందుకొను నంతటి యోధాను యోధుండును,

కుబేరునిచేఁ దన రాజ్యమునఁ గోశాధిపత్యము వహింప జేసి, యీశ్వరునిచే నష్టైశ్వర్యములంగొనునంతటి వీరాధివీరుండును,

బృహస్పతిచే బంచాంగము చెప్పించుకొని, యక్ష గంధర్వ కిన్నర సిద్ధ సాధ్య నిర్జర కింపురుషోరగ విలాసినులచే వైభవంబున విలాసముల దీర్పించుకొను నంతటి పరమ రసిక ప్రభుండును నగు సర్వం సహాధినాథు డేడీ ?

త్రివ్వని యగడ్తలై యగాధమగు మహాసముద్రము ద్వీపమునకు నలుకెలంకులును గలిగియున్న లంకేశ్వరుని, నిన్ను,

ఇంద్రాది దేవతల ననుచరులుగ జేసికొని సేవల నందుచున్న సర్వ తంత్ర స్వతంత్ర ప్రభుని నిన్ను,

యక్ష గంధర్వ సుర గరుడోరగ కాంతలనెల్ల స్వీయ రాజ్యస్థానమున మెలంగజేసిన సరసాగ్రగణ్యుని నిన్ను,

మహాపద్మము, పద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, వరము నను నీ నవ నిధానములను స్వీయమగు భండారముల దొర్లాడునట్లుంచుకొనగలిగిన మహా భాగధేయుని నిన్ను,

సమస్తలోకములను మహోత్సాహ వృత్తిని బుష్పకం బెక్కి విలాసమున దిరుగగల స్వేచ్ఛా విహార సింహుని నిన్ను,

బ్రితారింప నేరి తరమగును ? నినుమోసగించువా డేడీ యీరేడు లోకముల ? ”

“నా కా బాల్యాదిగ బరమ మిత్రుండయి చెలంగు జనకున కొక గూతురు కలదు. ఆమెపేరు సీత-ఆతడు యజ్ఞము జేయనెంచి,యజ్ఞవాటికగా నేర్పరచుకొనిన నేల దున్నింప బో

ప్రచుండ నాం కాలమున నాగటిచాలునకుదగిలిన యొక పేటికయం దీమె దొరకుటచేత "సీత" యను నామ మీమెయందు సార్థకపడిన దని పెక్కండ్రు పలుకుచున్నారు. ఆమె కింకను వివాహము కాలేదు గదా యని యీ సీతను నాకిచ్చి వివాహ మొనర్పగోరుచు నొక కమ్మవ్రాసి జనకుని కంపితిని. జనకు డాకమ్మను జూచుకొని నా పంపున నేగిన యాసారణుని, తనతమ్ముండగు కుశధ్వజుని కడకంప నాతండును నే ననక కాదనక, ఇంకను వివాహకాల మాసన్నము కాలేదనియు, వివాహము స్వయంవర రూపమున నగునేమో యనియు చెప్పి ఈకమ్మసారణుని కిచ్చి పంపివేయ, నాతండును మరలుచు తనమార్గమున, జనకునిగోరికచే విశ్వామిత్రుడు యజ్ఞమును నెపమున రాము డను నొక క్షత్రియ కుమారునకును సీతకును సందర్శన యోగము నియోగించి, తదనంతరము వివాహము జరిపింప నున్నారని విని నాకా యుదంతమంతయు నెరిగింప విశ్వామిత్రు యాగ స్థలమున నున్న సీతను నే గొని రా నెంచి, యాగదిదృక్షార్థ మరుదేరనున్న రాముని మార్గమధ్యమున కొంచెము తడవాలసింపజేయ సీతారూపమున సారణుని నియమించి, ఆ యవకాశ సమయమున రాము రూపమున నే నే సీతను దోడ్కొని పో నుద్యుక్తుడనై పోయి యుంటినేగాని, అన్యోన్యము తెలిసికొనజాలక మాలో మేమే భ్రమపడి సీత రూపముననున్న సారణుని గొనివచ్చి మోసపోయితిని. ఇపుడు నాకు కావలసినది సీత. అందుకు నీసహాయ మపేక్షించితిని."

"ఇపుడామె విశ్వామిత్రునాశ్రమము నగదా యున్నది."

"ఔను విశ్వామిత్రాశ్రమముననే యున్నది. కాని

ఆమె వెంటనంటి మరియొక కాంత 'శాంత' యనునామె యెల్ల వేళల దిరుగుచుండును. ఆమె మన ప్రియత్నమున కంత రా యము గల్పించు నేమోయనియు, కానిచో, నామెసీత నంటి యుంటయో మన కవకాశము జిక్కనీయదేమో యనియు, సం శయించుచున్నాను."

"అదియొక యభ్యంతరమా? సీతను దోడ్కొనివచ్చుట యొకపనియా? నిశ్చింతగ, నిర్భయముగ, నిస్సంశయముగ, నిరా ఘాటముగ లంక కేగి, నీ గుండియలపై జేయివైచుకొని నిద్రిం పుము. క్షణములో పోయి సీతనుగొని తెచ్చియిచ్చెదను."

"మాలో నెవ్వరినివెంట నంటియుండు మనిన వారము వత్తుము."

"మీలో నెవ్వరును రానక్కరలేదు; గాని సీతను గు ర్తించదగిన యొక్కరుడు నావెంటవచ్చి నా కామెను జూపి పోవచ్చును. ఆమెనుగొని తెచ్చుటలో నాకేరి సహాయమును వలదు. ఆమె నెన్నండును నేను చూచియుండలేదు గావున నా మెను గుర్తించుటకు మాత్రి మూమె నెరింగిన వానినొక్కని బంపినజాలును. నీవు నిశ్చింతగ లంక కేగనగును."

"విద్యుజ్జిహ్వా, నీ పాతాళ లంకేశ్వరు వెంటనేగి సీత ను గుర్తించి, యీ నామిత్రిన కామెంజూపి వైళమ మరలి రానగును" అనిరావణు డనెను.

"చిత్తము."

మైరావణ విద్యుజ్జిహ్వులు హుటాహుటి నేగిరి.

* * * * * *

రంగము:— యజ్ఞవాటిక

రెండవ దినము. (ఉదయము)

"జానకీ, యీ యాగము జూడ నెందరు రాజులువచ్చి యున్నారో, చూచితివా? రామలక్ష్మణులు ధనుర్బాణ ధరులై దశదిశల దిలకించుచు నీ యాగ సంరక్షణార్థ మెత్తైరంగున నిరుదెసల నిలచియున్నారో!"

"వారేనా రామలక్ష్మణులు! అందు రాము డెవరు?"

"ఏమీ నన్నడిగినగాని నీకు తెలియదా? సర్వాంగశో విరచితమగు మున్నటి చిత్రపట విలిఖిత రూపము జ్ఞప్తికి దెచ్చుకొనుము."

"ఆఁ-ఆనీలమేఘచ్ఛాయగల పురుషుడేనా రాముడు!"

"ఔ-నౌ-నాతడే! మరచితివో స్మితావనము! సరిగా చూచితివా? ఇకనాతని సోదరునిం దిలకింపుము—"

"శరీరకాంతిభేదమును, పెద్దచిన్నయను వనుభేదములును దక్క నాకార విశేషముల నిరువురును నొక్క తెరంగున నున్నారు."

"ఉంగరములు తిరిగియున్న కేశముల విలాసమును, నంగిన చేపతోకలవలె వ్రేలాడుచు గండఫలకములపై బ్రతిఫలించుచున్న జనపముల (కాకపక్షములు)తో, తపేక ధ్యానమున జ్ఞ లీల నిలచియున్నారో చూచితివా!" అని శాంత యనెను.

"చూడకేమి గాని, నీకు దమ్ములాట నెంతేని వారిని వర్ణించుచునే యుండుము. ఇం దసంగతి మేమున్నది?"

"శ్రీరాము రూపాభివర్ణనయందు సత్య విరుద్ధమున

నత్రైపిత్రాలంకార మేమున్నది?"

ఆమె నను సిగ్గున దలవంచి, చిర్నగవున మిన్న కుండెను.

"నీ మౌనము నా యుపపాదనమున కర్థాంగీకారము యయి యుండనోపుగాని చూచితివా? ఈశాన్యమున గూరు చుండిన కౌసలేయుడు. అతడే కోసల దేశాధిపుడు. మరియు నాతని కూతురును దైవము కటాక్షించినచో, నీకు కాబోవు అత్తగారును నగు కౌసల్యకుమారుడే శ్రీరాముడు. అపుడపు డుండీ యుండి యాతడు తనకు దౌహిత్రుడగు శ్రీరాముని వంక జూచు చుండును. నీ కవసరమేని కని పెట్టుచుండుము."

ఆమెయు కోసలేయుని వంక జూచును.

"ఆ వాయవ్యదెస గూరుచున్న తేడు మగధరాజు. ఆతని కూతురగు సుమిత్రి పుత్రులగు లక్ష్మణ శత్రుఘ్నులలో నొక్క రుండగు లక్ష్మణుడా దెస నిలచియున్నాడు."

ఆమె లక్ష్మణుని దెస జూచును,

"ఆ యాగ్నేయ దిక్కున గూరుచున్నరాజు, శిబి కు మారుండగు కేకయుడు. ఈయన, కుమార్తెయగు కైకేయి కుమారుడే శ్రీరామునకు మొదటి తమ్ముడును, లక్ష్మణుని కన్న పెద్దవాడును నగు భరతుడు.

"చూచితివే సీతా! దశరథుని కుమారుడును అంగ దేశాధీశుడును నగు రోమపాదుడు. ఆ తేడే నా పెంపుడు తండ్రి. ఆయనయే నాకు వివాహ మొనర్చెను. ఊర్మిళా! నా పెంపకపుతండ్రియగు రోమపాదుని, ఆవల ధనుర్బాణ ధరుడయి నిలచియున్న లక్ష్మణుని జూచితివా?"

"అమ్మా, నీ విపుడు లక్ష్మణుడని నాకు చూపిన యూ

తని యన్నయగు రాము డేడీ ?" అని యాత్రికుఁబ్రశ్నించెను.

"అల్లదె—ఆదెస నీల మేఘచ్ఛాయను బోలు దేహ కాంతితో, కరతలమ్మున బాణ తూణీరముల ధరించి నిలచి యున్నాఁడే—అతఁడే రాముఁడు."

"ఈ యాగము జూడ, నెక్కడెక్కడి రాజులును యినుకబోసిన రాలని తెరంగున గ్రిక్కిరిసి యున్నారే!"

"ఇందరికిని మనశ్శాంతి నొసంగుచు నిర్విఘ్నముగ జన్నము కొనసాగ జేయ శ్రీరామ లక్ష్మణులు దీక్షనూని యున్నారు గావున ధైర్యమున నీ ఋషి సత్తముండు తన యాగక్రియల నెరప గలుగుచున్నాఁడు."

"కీక్షలో నున్న విశ్వామిత్రుని దీక్ష జయప్రదముగ గొనసాగజేయుదునను దీక్షను మరొక్కరు బూని యుండిననే గాని, ఋషి దీక్ష నెరవేరు టెట్లు ?"

"ఎండ యెంతో తీవ్రముగ నున్నది— మన మిపుడింక మన విడిదికి మరలుదుమా?"

"మరలుదుముగాని, పాప మా యిరువురు రాజకుమారులును ఈ సూర్యాతపమున కెట్లోర్చి నిలువగలరో కదా! కొంతసేపు విశ్రాంతి నొంది మరల తమ స్థానముల నిలువరాదో!"

"అగ్ని దీప్యమానమున వారికి విశ్రాంతి నొసంగిన చో యాగరక్షణ దీక్షావశత్వము నూని యుండువా రింకేరి? ఇంతకును గురునానగదా !"

"ఔను గాని, శాంతా, నీ రహస్యశక్తు లెట్లు నిలుగాన్న గారు (సుంది కొప్పు)ందు చేనా? దినమున చెప్పుకైన సవకాశ ముండు నా?"

"లేకేమి! అపరాహ్ణము దిగినది మొదలు దీపారాధన పర్యంతము విశ్రాంతియే. అపుడే వీరి పరిసరారామముల కేగుటో, చండి కాలయమున కేగి దేవిని దర్శించుటో, చేయుదురు."

"మన మిక విడిదికేగుదమా?"

"మనము నేడు బ్రాహ్మీపూజాదులొనర్ప వలసి యున్నది." అనుచు శాంత సీతను వెంట నిడుకొని విడిది కేగెను.

వీరి విడిదిలోనే కదా, భార్యాయుతా శాంతాసమేతుండగు ఋష్యశృంగుడును రామమిత్రుండగు పింగళుండును గూడ నివసించుచుండిరి. ఆం దీపింగళుడు పప్పుబావయ్య. ఈతనికి యజ్ఞమక్కరలేదు; యాగమక్కరలేదు. ఏలోక మెట్లున్నను అతనికి జోక్యమే లేదు. ఈలోకమును రాముడేలినను, రావణుడేలినను అతని కొక్కటే. రామునకు ప్రియుడై చెలికాడు గావచ్చును. మిక్కిలి తిండిపోతుగావచ్చును. కాని యీతడు విదూషకునివలె తన మిత్రుని మానస మెల్లప్పుడును రంజింపజేయుచుండుటే ప్రధానకార్యముగా నెంచి, కాలముపుచ్చుచుండును. అట రాముని కీర్తనను సీతయు తులసియు నటులనే పూష్టరించిరి.



చెట్లయాకుల సందుల నుండి యీ చంద్రిక బరతెంచుచు నెంత మనోజ్ఞముగా నున్నది! ఈ శిశిరపు చంద్రికా మనోజ్ఞత యెంత యాహ్లాదకరముగా నున్నది! ఈ హిమవంతంబు ప్రాంతంబున నున్న శ్రీగంధమలయానిలం బీ పారిజాత కుసుమ వాసనాభరితం బయి విరి మల్లెలపరిమళంబున, మందమందంబయి కపురంపు కమ్మతావియు, కుంకుమ మిళిత జవ్వాది సౌరభంబును గలసి, మదగజ గమనాకృతిం దలపింప జేయుచుండ నీ వెన్నెన నొక మదవతీలలామ యేగుదెంచు స్ఫురణ దోచెడిని" యని యనుకొనుచు రావణుం డా వెన్నెన మెలమెల్లన పదము లిడుచుపోవుచుండ, నేలరాలిన పుష్పాడి దుమారంపు దిప్పల నడుమ తనకాలి యందియల చప్పుడుల నల్లనల్లన నాచికొనుచు, లేని నడుముపై నూగులాడుచున్న తనూలతతో, జీమ చిటిక్కుమన్న గళవళించి వెల్వాల వారుచుండు మోము వన్నెతో, నా చంద్రికలో చెట్లనీడల నడుమనుండి, తా నప్పటికి ధరించియుండిన నీలమేఘు చ్ఛాయ దనరు తన యంశుకము నుండి వింత రంగు లీనుచున్న తన తనూ సహజ యరుణకాంతితో, తన వ్రేలి ముసుంగ నెడి నీలమేఘచ్ఛన్నం బైన మోము చందురున కొక వింత విన్నాణ మొసంగ నొక నారీలలామం దన కురంగటగాంచి, "మేలి వలిపె సరిగంచు చలువ పైఠాణి శాలువ మేలు ముసుంగిడి శరద్ఘనంబున వెలింగెడు నెలరేఖం ద్రుణీకరించి, మగజాల పంజరంబున జెలరేగు వలరా యొజ్జ పట్టపు రాచిల్క కనుంగు చుట్టం బై దిట్టతనంబుతో, నెటకు బోనున్నా" వని యా పురుషుం డడుగ, నామెయు, త న్నొంటికి పాటున వెన్న కాని వెన్నెన, నిట్టుల బలుకరీవ సాహసింప

గలిగినవా డెవడని భయకంపిత, చంచల దృగంచలయై, పవన సంచలిత దేహవల్లియై, జిచ్చవడి నోట మాటలేక కొండొక తడవు మిన్నకుండి "నీ కొమరుండౌ నలకూబరు భార్యనౌ రంభను నేను. నాకు మామవౌ నీ కిదె నమస్కార మాచరించు చున్నాను;" అని య య్యంభోజానన బ్రత్యుత్తరంబిచ్చెను.

"నీ తొడల్జూచినంత నే నీవు రంభవని తలంచితి నే గాని కులిశాయుధుని నిండుకొలువులో మెప్పవడసి యుద్ధమున జేరి వచ్చుచుండు వీరు లాదిగాగల వారికే తెన్ను సూపితివి? నీవు విధి విరామములేక వచ్చుచు నుండువారిని సత్కరించి, తనివిదీర్చి, వారి నిచ్చలు సంతోషవార్థి ముంచుచుండునదే పని గదా—నీ కెటుల నీ విరామ మొనరగల్గె ననియే నా సంశయము."

"మామా, నీ కుమారుండగు నల కూబరు సన్నిధికి నాతని పంపున విలాసమున నేగుచున్నాను. కాని వేడుకగాండ్రకై వెతల నెన్నియొ గుడుచుచు నైనం దిరుగుచుండెడి సంగలి వేశ్యల నాడిన కైవడి నన్ను నీ విట్లాడగ బాడిగాదు. ఓ దనుజాధిప! నీవు నాకు మామవు; నే నౌదు నీకు గోడలు; నిట్టిపట్ల మందెమేలపు బల్కుల కెక్కడిది తావు? ఇదె పునర్నమస్కారము; సెలవిమ్ము—నీ కొమరుసన్నిధిం జేరెద—"

"ఆం-నలకూబరుడు నాకెంతకుమారుడో నీవును అందుకు దగిన కోడలివే! నాకు వరుసలు గల్పింప నీ కింతనేర్పెటుల నలవడియున్నదే! ఏడీ యిటు వినుము:—

"తండ్రి కుమాళ్లు జన్నము నెరపి నినుజేర, వానికుపకు న. నీ కేటియగున.ను?

నెట్టన, నలకాపట్టణ రాజ మధ్యమున, నీటౌ నీలంపుఁగోటలోప
లి బంగారు హజారముంగడచి ననుగెంపుటౌ మేడలోపల నలరం
భరాక కెదురు తెన్నులు సూచుచుండు నలకూబరు జేరఁబోయి
తన కట్టెదుట నడలుచు, గాటుక కన్నీరెడ తెగక జడి గురియ
నొడలు గడ గడ వడంక, నిట్టూర్పులు సెలంగ, దీనగతి భర్త
యడుగు దామరులపై వ్రాలి, తన కన్నీటి నీటిచే నభిషేకిం
చుచుండ, సఖుల యెదుట తన జవరాలి జడగొని, నశ్రు
ల్ దుడిచి జారెడి క్రొమ్ముడి చక్కబెట్టి, లేవగ నెత్తి
"నిన్నంత నలయించిన తుంటరి యెవ్వం" డని ప్రశ్నింప
నామెయు "నాథా! యే మని చెప్పగలను! నో రాడకున్నది.
వజ్రియును గొలువు వీడిన పిదప నిన్నుఁ గలయు దమకమున
నీ మానసమున కింపగు వేసమున వడి వడి వచ్చుచుండ, నను
మార్గ మధ్యమున నవరోధించి, యా పదిశిరముల రక్కసుం
డు, వల దని చెప్పుచుండ, కూడ దని మందలించుచుండ, పాపి
కాదని నీతి గరపుచుండ, తనకు నే గోడల నౌట గూతు స
మాన నని న్యాయ నిష్ఠురము లాడుచుండ, నాయొప్పమి జూపు
చుండ, తన మోటుతనంపు చేష్టలకు నావెగటుతనంబు వెలుప
రచుచుండ, దా నేమియు సరకుగొనక, నెంతమాత్రమును గ
మనింపక, తన కింపునింపు తెరంగున, రాజహంసలు విహారమొన
ర్పు సర్వహాకొలని లులాయంబు కలచినటుల కలచికలచి, నిజా
ధహా సముద్రుని పొందుగోరి తమకమునబర తెంచుచున్న నదిని
తల్లిని మత్తగజేంద్రము గలంచినటుల గలంచికలంచి, పున్నాగం
శ్లేషమున కెగబ్రాకుచున్న నెలదీగెను జెనకి, గాసిపుచలింపజేసి,
వాడబార జేసినటుల, నన్నవమానించి మోసపుచ్చి, బ్రిస్మ వాహా

నహా సంచను గిటి యొంచి, యలచి నటుల, నన్నలచి య
లంచి, బలిమిన్నై పట్టి బెట్టిదముగ న న్నటమట జెట్టి పెట్టి,
నా మేలు కట్టిపెట్టి, యా ధనవిభుని పట్టి, పె న్రిట్టుల పాల్జే
సి యా దశకంఠ హాతకుడు నన్ను జెరపె" నని యని. నా
నలకూబరుండును "ఒప్పని రంభను బలాత్కరించిన రీతిని నే
కాంత నాతం డిక పరిభవింపబోయినను, వాని శిరంబులు సహ
స్రవక్క లౌగాక" యని శపింప, నట తన ద్రోవను మరలు
చున్న రావణునకు నెన్నని దుశ్శకునంబులు పొడసూప నిది
యే మని తన మానసమున నించుక కొందుచు నెట్టన బోవు
చుండ, నెదురుచు దను గనుగొని వచ్చు చున్న యొక స్త్రీ
"ఇంతటి యన్యాయ మెచ్చటనైన గలదా? నీవే వివాహ
మొనర్చి, నీవే నను వైధవ్యమునకుం బాల్పడ జేసితివి గదా
నే నిపుడు గర్భవతినై యున్నానే! నా కేమిగతి కల్పించితివి?
ఇంత అనాలోచితముగా నీ విట్టి యకార్య మొనర్తు వని యె
న్నండును దలపనైతి. సోదరులు తమ యక్క సెల్లెండ్రకు పస
పు గుంకుమ నిత్తురే గాని, తామిగా నిచ్చిన పసపు కుంకుమను
విచ్ఛిన్న మొనర్చుట నెందును గని విని యెరుంగము. నీ యు
ద్ధము మాసిపోను—నీ దిగ్విజయ యాత్ర మంటగలయ—నీ
చదువేల—గాల్పనే! ఇంతటి యకార్యమున కొడిగట్టుదు వని
నే కలనైనం దలపనైతి. నిరపరాధియగు నీ మఱదిని మన్నిగాని
న హేతువ న న్నిన్ని యిక్కట్టుల గుంద జేసితివా దలప వైతివి.
మన తల్లిదండ్రులు గతించిన పిదప, నీవే యన్నియు నని డ
లంచి, నీ ప్రాపున బెరిగి పెద్దనయి, తుదకు నీచేతనే వివాహి
తనై కడకు నీచేతనే వైధవ్య మనుభవింప విధాత నిర్ణయించె

ను గాబోలు! తుదకు దిక్కులేనిదాననై యిక గూటికిని గుడ్డికును దూరమై దేశ దేశాల దిరుగవలసి యున్నదిగా!" నని వాపోవుచు తన కాళ్లపై బడ నాతండును పెద్దయుంబ్రొద్దు చింతించి, చింతించి, కట్ట కడ కిట్లనియె.

"చెలియలా! తెలిసి చేసిన పని కాదది. కాలకేయులతోడి సమర సంరంభమున మిన్నుమన్నులు తెలియనిసమయాన యంతటియనర్థము వాటిల్లి యుండును. అది నే గుర్తింపనైతిని. ఇక ముందు సేతల నెంచవలె నంతెగాని, గతించినదానికింత వగవంబని లేదు. నీకు నిలువ నీడ లేదని విచారింప బనిలేదు. ఖరున కిదివరకేయొక యాలయము గల్పించి ఖరాలయ మనుపేర నొక సీమ నిచ్చి యాతని కా నేలకు నేతజేసితి. ఇక నీకు దండకయంతటిపై నధికార మొసంగు చున్నాను. నీ గర్భస్థ శిశువు మగవాడైనచో నీ యనంతర మాతని యధికార మొనర్పజేసెద. మరియు నీ కిష్టమున్నచో, మనజాతికి విహితమే గనుక, సమరమున సమసిన నీ భర్త పేరింటగాడే నామంత్రివర్గమున గలడు. ఆతండును మంత్రిశాస్త్రనిపుణుండౌ విద్యుజ్జిహ్వుడు. ఆతని బెండ్లాడి సుఖంబుండుము. ఇంకను నీవు విచారించిన ఫలము లేదు. శూర్పణఖా! నే నిపుడు ఖరాలయమునకు బోదును. రా దలంచినచో నీవును రమ్ము."

"పిల్లల తల్లినై, మరియు నందున నిపుడు గర్భిణినై మారు మనువునకు బోవునంతటి యావశ్యకత గానరాదు."

"సరియే; నీకు దోచిన తెరంగున నొనర్పవచ్చును. నే నిపుడు దూషణుని జూచి, యనంతరము ఖరుకడ కరుదెంతును." అని శూర్పణఖ నుడువుచు వడమటిదెస ను గూర్చి పోయెను.

రావణుండును, "అన్నా ! అన్నియు నేమరుపాటున వా టిల్లిన విఘాతములే యగుచున్నవి. పాపము శూర్పణఖ కెట్టి విపత్తు సంభవించినది! ఏమో! ఏమి కానున్నదో గాని, కొలది దినములనుండి యన్నియు నేమరుపాటున సంభవించిన విపత్తులే! అయినను గాల మెల్లప్పుడును నొకే తెన్నున నుండబోదుగద!" యని విచారించుచు ఖరాలయపు దెన్నున బోవుచుండ, నొక వికారరూపియా వ్యక్తి తన్నెదుర్కొని, "ఎంతపనిచేసెనో యా రాచకూన వింటివా?" యని యేడ్చుచు నిలచెను.

"ఏమి యొనర్చెను? ఆ రాచకూన యెవడు?" అని తొట్రుపాటున రావణుం డడిగెను.

"ఏమీ—ఇప్పటికిని తెలియనే లేదా! ఎంత వింత! మేము సీత చెలికత్తెలా తులసీ సర్వమంగళ రూపధారులమై సీతారూపధారియైన సారణుని వెంట నుండ, పెద్ద యరపు వి న బడెనే గాని, అది మా తల్లియా దాటక కంఠధ్వని యని యెరుంగమైతిమి; విశేషించి, మా తల్లియొకా నవియైన నను మానింపజాల మైతిమి. నిను రాముగా దలంచి సమీపింప బో యిన సీతారూపధారి యైన సారణుడు మము వీడిన పిదప మరికొంత సేపటికి మా యనుచరులు కొందరు వచ్చి మాతల్లి యా దాటకను యిద్దరు రాజకుమాళ్ళు వచ్చి వధించిరనియు, వారివెంట నొక జడదారి యుండె ననియు చెప్పిపోయిరి. ఇం త విపరీతకార్య మొనర్చినది రామలక్ష్మణు లయియుందు రని యును, వారివెంట నంటియుండిన యాతండు విశ్వామిత్రు డయి యుండు ననియు, నూహించి, వారికి తగిన ప్రతీకార మొనర్ప నెంచి నేనును సుబాహుండును విశ్వామిత్రు నాశ్రమమునకు

బోయి చూతుము—అక్కడ యాగదీక్షలోనున్న యా ఋషియు, యా బాలక ఖండాలులును గూడ వారే! తత్క్షణమే వారి ముప్వుర బరిమార్ప సుబాహు డూహించెనే గాని 'వలదు వల' దని, 'యిది యెదను గా'దని, 'ఇప్పటికి మిన్నకుండు' మని, మన ప్రభునితో చెప్పి మరీ తగిన ప్రతీకారము మరి చేయుట మరల మరల యొప్పిద' మనియు 'యిపుడే మనము చేయిగలుపుట తొందరపాటగునేమో' యను శంక వాడమ జేసి వాని నట నుండ జేసి నేనిటకు దర్శనార్థినై వచ్చితిని. తమకు నివేదన చేయవలసినది నివేదన చేసితిని. ఇక మా వేదన బాప ననువగు నుపాయము ప్రసాదింప బ్రార్థించుచున్నాను." అని యాతడు వడివడ మాటలు తడబడ నన, "అన్నా! మారీచా, ఎంతపని జరిగినది! ఆహా తాటకివంటి మహా పరాక్రమశాలి, సహస్ర గజబల సమన్వితయా తాటక! అకటా!! యెంత యగాధమైన దీ విపదంబుధి! ఇది దాటదగిన తెప్ప లేదే? తెన్ను గానరాదే! మారీచా, నీకు తల్లి చనిపోయినది; నాకు కుడిచెయ్యి తెగిపోయినది! నీకు తల్లిపోయిన దుఃఖ ముండ, నేను బ్రతికియుండియు, నాకు కుడిచేయి పోయినందున నే నెవ్వరికిని యుపయోగించ లేకపోవుట యటుండ, నాకు నేనే యుపయోగింపజాలను; ఇది నాకు బహు ప్రమాదకరమైన యాపద! నాకేకాదు, మనవంశమునకే యని యనవచ్చును." అని రావణుండును మిక్కలి విచారించుచు నిలచెను.

"ఏమీ! ఆ యర్భకులగు బాలకులకే యింతభయపడవలెనా? కార్తవీర్యార్జుననివంటి సహస్రబాహునితో బోరి, వాలివంటి నిర్వక్ర పరాక్రమశాలి నెదిర్చి, దిగ్విజయ యాత్ర సలిపిన

ప్రభువవు నీవే యని జ్ఞాపక పరచుచున్నాను."

"ఏమి మారీచా! ముకువచ్చు లారని రాచకూనలకు జంకితి నని తలంచితివా? అట్లెన్నటికిని కాదు. మహా సత్వ సంపన్నయగు తాటక గతించెనే యను విచారమే గాని యా బాలుర వధించుటగాని మోసగించుట గాని, యొక పనిగాదు. రామ వాంఛిత సీతను గొని తేబోయి సీతారూపధారియగు సారణుచేత మోసపోయితిని. ఇక నెట్లయిన సీతను గొని తేబోవు నా ప్రయత్నములకు నీవును సహాయ మొనర్పుము. ఇపుడు జరుగుచున్న విశ్వామిత్రుని యాగము పూర్తి కాకమునుపే నీవు పోయి యా ప్రాంతమునుండి సమయముచూచి యజ్ఞకుండము నపవిత్రముగా నొనర్పుము. నీకిదివరకే 'యజ్ఞము నాలుగైదు రోజులు గతించుదాక మిన్నకుండి అనంతరము యజ్ఞకుండము వ్రేల్చుచుండు సమయమున, దిదృక్షులందరును పరాకుననున్న సమయాన, మేఘ మండలమున డాగియుండి యజ్ఞగుండము నవలీలగ నపవిత్ర మొనర్చి, అంతర్ధానము కమ్మని నా యాజ్ఞగా మారీచ సుబాహులకు గట్టడియొనర్పుము-పో" మ్మని సారణుచే గబురంపితిని. ఇద్దరును చెరి యొక తెన్నయిరి. ఇక నీవు మరలి మ దభ్యర్థిత కార్య మనివార్యముగ నొనర్పుము."

"చిత్తము: ఈమాత్రపు పొడము నాకు దొరకిన దంతే చాలు. సెలవు గైకొనుచున్నాను."

మారీచుండును ఉత్తర, దిశను గూర్చి మరల, రావణుండును ఖరాలయపు దెన్నున నేగెను.

---



# పరిణయ విభ్రమములు

## పదునైదవ ప్రకరణము

## అమోఘ సమావేశము

"లక్ష్మణా! నేడీ యారామమున నుంటకన్న చండికాలయమున కేగి దేవిని దర్శించుకొని సంజవడక మున్నె మరలి వత్తమా?"

"సోదరా, అటులనే సేయుదము. అదె పింగళుండును వచ్చుచున్నాడు."

"పింగళా! నేడింత యాలశ్యమైన దేమి?"

"ఆలస్య మనిపించుకొనదగినంత వేళ యైనదా? నేనన్న విడిదిలో జనకరాజ కుమార్తె యగు జానకి బ్రాహ్మ ప్రీతము సేయుచుండ నట గూరుచుండి, ప్రసాదము లొసంగునంతదాక వేచి, ఆపని కావేగమె నాకిచ్చిన కదళీఫల ప్రసాదము గొని, సేవించుకొని, రాబోవ, శాంతాదేవియు సీతయు గూడ దేవీ దర్శనార్థము వచ్చుచున్నా మన నేనును కొంచెము తడవు వేచియుంటినే గాని—స్త్రీలు చేదస్తము ఎప్పటికిని తెమలి రానందున నేనే ముందుగ వచ్చి, మీరు యజ్ఞవాటికలో లేనందున, చండికాలయమున కేగియుంటి రేమో యని మున్ముందుగ నట కేగి మరలి యిక్కడకు వచ్చుటచేత నింత యాలస్య మైనది."

"నీ కెప్పుడును తినుటకు ఫలహారాదులే కావలెను."

"బ్రాహ్మవ్రత ప్రసాదఫలము లొసంగ వద్దన, నీ యంతటి నిర్భాగ్యురాలిని కాను."

"పింగళా, నీ ఫలహారాదుల కేమి గాని, లక్ష్మణా, మన మిపుడు చండికాలయమునకు బోవలయును."

"ఇదె మనము చండికాలయ సమీపమునకె వచ్చుచున్నాము."

"పింగళా, సీతతో శాంతయు గూడ వచ్చునా?"

"శాంతతో సీతయా — సీతతో శాంతయా? ఎవరితో నెవరు?" అని పింగళు డనెను.

"ఎవరితో నెవరైన నేమి? వీ రియువురును గలసియే వత్తురు గదా?" అని లక్ష్మణు డడిగెను.

"పింగళా, మా బావగారు గూడ వచ్చియున్నారా? ఒక్క శాంతయే వచ్చినదా?" అని రాముడు ప్రశ్నించెను.

"అయ్యో, మీ బావగారు ఋష్యశృంగులవారు పనికే యాగ మొకటా? ఉప్పులేని కూరయా? ఆయనే యిప్పుడు జరుగుచున్న యజ్ఞమున బ్రహ్మస్థానము నలంకరించినారు."

"ఎవరు బ్రహ్మస్థానమున, ఎవరు విష్ణుస్థానమున, ఎవరు ఇంద్రాది స్థానముల నున్నారో, ప్రథమ, ద్వితీయ, తృతీయ చరణముల నెవరెవరు ప్రత్యేక బ్రహ్మస్థానముల నలంకరించుచున్నారో చూడ మన్నను నెడమే లేకున్నది."

"మనము తెలిసికొనకున్న మానె గాని, దీక్ష మాత్ర మక్షతముగ జరుగుటయే మనకు ప్రధానము కాదా! యాజ్ఞవల్క్య మహాఋషి యాశ్రమమునకు ప్రతి సాయంకాలమును

మనము పోయినచో సన్నియు విదితము కాగలవు."

"మన మెక్కడకును బోననవసరము. ప్రస్తుతము చండికాలయమున కేగి దేవిని దర్శించుకొని వత్తముగాక !"

అందరును ఆలయముదెస బోయి పోయి ఆలయమున ప్రవేశించుచుండిరి.

* * * * * * * *
* * * *

"నీలమేఘ శ్యాముఁడగు రాముఁ డిటకే వచ్చుచున్నాడే చూచితివా ?"

"ఏల, యిట కేల వచ్చుచున్నారు ?"

"దేవీ దేవుల దర్శింప"

"దేవీ దర్శనార్థ మనుట సమంజసమే గాని—'దేవుల దర్శింప'—ననుట దేటి మాట ?"

"చండిక దేవి యయిన, శాంత సీతా దేవులు—'దేవులు'—కారా ?"

"నాటకరంగమున నీ వొక విదూషక పాత్ర మైకొన సన్నద్ధవుగా నున్నావు."

"విదూషకుఁడ నేనైనపుడు, నీవు—'నటి' వి కావా ? అపు డీ జగన్నాటక సూత్రధారుఁడేనా సుత్రధారుఁడు కాఁడు !"

"ఏమో ! నీ మాటలు తెల్లపుకును ధ్వనిపూరితములై యుండునే !"

"ఏమీ ! ఒక్క నామాటలే యనుకొనుట ? ప్రతిమాటయు ధ్వనిపూరితమే !

"మీ ధ్వనుల కేమిగాని, సీతా! ఆ నీలమేఘశ్యాముఁడు ఆ స్మితాననుఁడు, ఆ రాజీవదళాక్షుఁడు మనదెస జూచుచు తన్న

తమ్ముడగు లక్ష్మణునితో నల్లదె యేమో పలుకుచున్నాడు—ఆలింతము."

* *   * *   * *

"లక్ష్మణా! అదె మన శాంతయు వచ్చుచున్నట్లున్నది? బావగారి మాటయు నడుగుదుమా?"

"నే నడిగి తెలుసుకొందును."

"మిత్రిరత్నమా! శాంతయు నంటిరే—యు—నను టిలో నింకెవరని తమ యూహ?"

శ్రీరాముడు తన సహజ స్మితాననమునకు గొప్ప శృంగారమురా. మిన్నకుండెను.

"ఓహో! సీతయు నామె ననుసరించి యున్నదని మా యా—'యు'—అను సముచ్చయమున కర్థము? కాని మన గురువుగారగు వసిష్ఠులవా రెన్నండును 'యు' అన 'సీత' యని అర్థము చెప్పియుండలేదే!"

"పింగళా! ఓటికుండవలె నెంతమాటలాడెదవోయి? కొంచెముసేపు శాంతింపుము."

శాంతా సీతాదేవులును, తులసియు దేవీదర్శనానంతరము రామ లక్ష్మణ పింగళుల కెదురగుదురు.

"అక్కా! నమస్కారములు. మీరు మీ మీ విడుదులలో సుఖముగా నున్నారా? బావగారేమి చేయుచున్నారు?"

"ఏమిచేయుచున్నారని యడిగెద వేమి? నేటి కౌంచ నములనుండి యజ్ఞమున బ్రహ్మసీత నలంకరించి, పని చేయుచుండు చూచుచుండుట లేదా?"

"ప్రభూ! ఎవరెవ రేయే స్థానముల నిలచి పనిచేయుచున్నారో, ఒక యరనిముషమైన చూచి యానందింప నవకాశము లేక, మే మిరువురము నా యాగ రక్షణార్థ మిరుపార్శ్వముల నిలచియుండుట చూచుచునే యుందువుగదా! ఇప్పుడు మీ రెచటికి బోవుచున్నారు?"

"ఏ రెచటికిబోయిన నట కేగ నెంచుచున్నాడు గాబోలు శ్రీరాముడు!" అని పింగళుడు తన మనమున ననుకొనెను.

"ఇప్పుడు తొలుత మీ విడిది కేగుదము; జనకరాజపుత్రికయగు సీ సీత నేడు బ్రహ్మచారిణీవ్రత మొనర్చెను. కావున సహస్ర పూజాదోద్యాపన మొనర్చి, యనంతరము యజ్ఞవాటిక కడకు బోనున్నాము. అదె సూర్యుడును తనఅస్తమయ బంగారు చాయల బఱపుచున్నాడు. మీరును మీ కార్యముల దీర్చికొని నైశమ యజ్ఞవాటిక జేరుకొను వేళ యగుచున్నది. విశ్రాంతికను దడయరాదు."

"ఇదె; దేవీదర్శన మొనర్చికొని అనతికాలమున మరలుచున్నాము."

"సోదరా! నే డేమోగాని మన ... మందమందముగా నడచుట, కాలమునైన గమనించకుండుటయు, చేయుచున్నాము."

"నీవును మావలెనే నిలచి జన్మపు ... గావుంటివా నీకును సుగోచరము కాగలదు."

"నా కష్టముమాత్రమె మన కెరుగుదురా? ఎవరికి వారే 'తామే యెక్కువ కష్టము నొందుచున్నా'మని యనుకొనుట సహజముగాదా?"

వీరు ముప్పురును దేవీదర్శన మొనర్చుకుని త్వర గమనులై మరలుచుండ త్రోవలో విశ్వామిత్రి శిష్యుండగు సత్యవ్రతుండు "సింగళా! రేపు సాయంకాలము మనము రామలక్ష్మణుల దోడ్కొని యారామమున కేగుదమా?" యని ప్రశ్నింప నాతండును వల్లె యనెను.

వీ రందరును వారి వారి తావుల జేరిరి.





# పరిణయ విభ్రమములు

## పదునారవ ప్రకరణము

## యాగాంతము

"సీతను దా నిదివర కెన్నండును జూచి యుండమి, సీతను దనకు జూపవలసిన దను వార్తతో విద్యుజ్జిహ్వుని, సీతను జూప వైరావణుం గూడ నా కడ కంపుటయు, నేను వారికి సీతం జూపుటయు జరిగి నేటికి మూడు నాలుగు దినములు గడచియు, నాతని క్రియ మేమియు నెరుక రాదయ్యె. నేటి రాత్రితో యాగము గడతేరగలదు. అనంతర మిక జేయునది లేదు గదా! చేయవలసిన దేమేని యుండినచో నేటి రాత్రితో సరి. కావున నో సుబాహూ, ఇటురమ్ము—" అని యాతని బిలచి యాతని చెవిలో నేమో గొణిగి మారీచుండును మాటు మణగెను.

*   *   *   *   *

అన్నా! అయిదు దినములు గతించిపోయినవి. ఒకనాడైన నీ శాంత విద్యుజ్జిహ్వునకు చూపిన ఆ సీతను పీడించియుండదాయెను. పోనీ యని యుద్దాని నొక్కటి తూగ నెత్తుకపోవు వాని వాని సవిరాసింపఁగోదుమన్న నా కారణము తెలియకున్నాని, భ

రింపరాని, ఊహింపరాని, వేడిమి యనుభవింపవలసి వచ్చుచు
న్నది. రావణుడు చెప్పినటుల సీత తన చేతులనున్న మణికంక
ణముల నొరుల కిచ్చివేసియుంట గాబోలు ఆమెను పట్టి తేజా
లకున్న మానె గాని, నాకన్నులకైననుగానవచ్చుచున్నది. కాన
వచ్చుచున్నంత మాత్రమున నేమి ప్రయోజనము? ఆమెను
సమీపింపవలనుపడని మృగ్యకారణమగు యీ వేడిమి కేమం
దును? ఈ వేడిమింగూర్చి రావణుం డేమియు చెప్పియుండలేదే!
మంత్రశాస్త్రవేత్తయు ప్రజ్ఞానిధియు, పండితుండును, వేద వే
దాంగ పారంగతుండును, జ్యోతిశాస్త్ర పారగుండును, సంగీత
భరతశాస్త్రములకు గురుండును, నయి, యవసర మయినపుడు
దశ శిరముల జూపుచు తత్కాంగల వేళల నొకే శిరమున దర్శ
న మీయగల కామ రూపుండును నగు రావణుం డేల సమీ
పింపలేదు! ఏల కరతలమ్ముల నెత్తుకొని పోలేదు! ఓహో!!
జ్ఞప్తికివచ్చినది. స్వయంకృతాపరాధమున మోసము నేకూరె
నని గదా చెప్పియుండెను. కావున నామె నరాత్తుగ నెత్తుకొని
పో నుద్యమించి యుండలేదు. అటుల తా నెత్తుకొనిపోయి యుం
డిన యామె ప్రమాద నశమున స్వ విరచిత నాటక పాత్రనే
ఱగుట యీ చిక్కానికి తటస్థించనే లేదు. ఇపు డీ మం
త్రసాని గండము నాకు సంభవించినది. ఎటులైనను మాట ని
చ్చితిని గదా! ఇపు డీ మాటనాటు టెటుల? ఆ కాంతను ప్ర
తనుండి వేరుపరచు టెటుల? అటుల వేరుపరచిన గదా సహ
జముగ నా జ్వాలా సన్నిభమైన వేడిమి యేరి కారణమున సంజ
నితమైనదో తెలిసికొనుట? తుద కీ యోగ దినములలో వలను
పడకున్నదే! మహాగానాంతరము మెసరితొవ్వలను వారలు వారలు

పట్టున నైన సీత శ్రాంతను శీఘ్ర నష్టమగునా! ఇక నవు పట్టు
ల కప్పించుకొనగలదు? అదియును చూచెదగాక! నేటి రాత్రి
జన్మమున నేమి యగునో!”

* * *

“శ్రీరామచంద్రా! దీపారాధన మైనది. నేడారవ
దినము గదా! ఇంతవరకు యెట్టి యిక్కట్టులును లేకుండ జన్న
ము గాపాడితివి. ఈ రేయియు సక్షేమముగ గడచెనేని, దేవ
తల యజ్ఞానష్ఠిత స్నాన మొనర్చు పి కౌశికుని యాశ్రితము
నన తేజ్ఞసాధ నగుదువు. మరియు ‘విశ్వామిత్ర యాగ రక్ష
కుడు-రాముడు’ అను కీర్తినామము కాల కాలములవరకును
నిలచియుండును.” అనుచు నాతుని గుంపుగుండి, యెడుకర్రుండ
ముందుకువచ్చి రాముని సంబోధింప నా రాముండును “మీ
రందరు నిశ్చింతముగ, నిర్భరముగ మీ మీ కార్యముల నుం
డ నగును; మీ దీక్షను రక్షణ మొనర్చు భారము మాది.
మీ కంటను గూర్చి యేమాత్రమును భీతి వలదు.” అని పలికి
“లక్ష్మణా! నేడారవదినము సుమా. ఈ రేయి నేమేని దాన
వులు వాటిల్లునో కానని యీ ఋషులు సంశయించు చున్నా
రు. కావున నీవును మనుపటికంటెను శత గుణమ్ము లధికమ్ముగు
‘జాగరూకత్వ’ బని సేయువలయును సుమా! ఏమాత్రపు ఏ
మరుపాటును వలదు సుమా!” అని లక్ష్మణుని హెచ్చరించుచు
తానును అప్రమత్తుండయి నిలచి కాపుండెను.

* * *

* * * * * *

రాత్రి రెండు యామములు లయినది మును లందరును త
దేక ధ్యాన పరాయణులయి యుండిరి. నాటి తిథి (సౌమ్య సం॥

బహుళదశమి. కడుభయంకరమగు చీకటి. యజ్ఞవేదికపై ప్రజ్వలించుచున్న అగ్నిహోత్రము కడుపాటవముతో భయంకరశిఖలతో విజృంభించుచు జలరేగుచు రేపకడ సూర్యోదయానంతరము, తాను సూర్యునిలో లీనమగుచున్నానని యెరింగియుంటం గాబోలు యెగిరి యెగిరి గంతులు వైచుచున్నాడు. ఏమి యుత్సాహము! ఏమి బలము! ఏమి సాంవర్తిక! మింటి నంటునా యను నంతటి మంట లెగసి మునగసి కడప యజ్ఞవేదికపైనున్న (1)చమసములను, (2) స్రుక్కులను కం టుకొని, మంటలనేకములై, రేక ముఖములుగ నంతయు ప్రజ్వ ప్రకాశమముగ వ్యాపించుచు నాయ్యెను.

"ఏమిది యుత్పాత మయ్యెన!"

"ఇది అశుభసూచకమేమో!"

"అంతయు నయి చివర కిట్లు లయ్యెనే!"

"ఏమో—ఇంకేమి కానున్నదో!"

"ఈ మంటల నార్పరాదే!"

"ఇట్లయ్యును యజ్ఞఫలము తప్పునది కాదే!"

అని పలుపలు తెరంగుల నచ్చటి మునిపుంగవు లనుకొన జొచ్చిరి.

మంత్రియుత మయిన యా యజ్ఞము యథాశాస్త్రముగ ప్రవ ర్తింపబడిన దయ్యెను దిదృక్షుల మానసములు మాత్రము సం శయావృతము లౌట నాకసపు జెన దృక్కులు నిగిడ్చిరి. అం బర వీధిని మేఘముల యలజడి యుత్పత్తి యయ్యె, అల్లలనె జ డియు, ననంతరము వేడి గాలియు, నిటు నటుం గూడ కీర ద్రో

(1) చమసములు—సోమపాన పాత్రములు (2) స్రుక్కులు—హోమపాత్రములు.

టంగెను. ఈ విపరీత పవనా ఘాతమునకు దోడుగ పిడుగుల చప్పుడులం బోలె పెను రొదలు గూడ విన రా ప్రళయ వర్షము దోతెంచు చున్న దేమో యని దోపజేసెను. ఒకతూరి మింట మంటలును, యింకొకసారి దెస తెలియరాకుండ దిమ్ము చీకటియు, మరియొక పరి మెరుపులును, వేరొక తడవ నురుములును, గుండియలవియ జేయుచున్న సమయాన, "శ్రీరామభద్రా! భద్రము సుమా! విపరీత సూచనములు సుమా యివియెల్ల!" యని భరద్వాజుడు పలికెను.

* * * * * * * *

"మేమును నప్రమత్తుల మయియే యున్నార" మని శ్రీరాముండును బదులు పలికెను.

తుఫానువంటి ఝంఝామారుతము. ఆకసమున చంద్ర కాంతియు, గాఢ మబ్బులును, ప్రకృతికి విరోధ మయ్యు నాయేక కాలమున్న దృగ్గోచరమ్ము లగుచుండెను.

జ్వలించుచుండిన యాగ యగ్నిపై నాకసమునుండి రుధిర వర్షము గురియు నారంభించినది.

"లక్ష్మణా, అతి దారుణ సంఘటన సుమా యిది ! భద్రము—మనల బరీక్షింప బ్రకృతి కల్పించిన యుపాంతరము సుమా యిది—భద్రము--వాయవ్యాస్త్రము బ్రయోగింపుము." అని చెప్పుచు శ్రీరాముండును వాయవ్యాస్త్రమునే నియోగించి ప్రయోగింప, "కీచు....కీచు" మను రొదతో కొన్ని పలలాశనుల కళేబరములవలె దూరముగ నేల బడుటయె గాక, వర్షించు నన్నభయమును సంహరించుచు యోగము, ఆకసము నిర్మలమాయెను. ఇట్టి ని

క్షొంబరము నవలోకించి, "అన్నా, రామచంద్రా! నీ విప్రజా వాయువ్యాస్త్రము సంధింపకున్న నెన్ని విపత్తులు వాటిల్లును!" అని సంతోషమున లక్ష్మణుడన "లక్ష్మణా! ఇంకను ప్రమాదావస్థ తీరలేదు. ఇంతకన్న ఘోరతర ప్రమాద మాసన్నము కానున్నది—అల్లదె—చూచితివా! ఆగ్నేయదిశ నిరువురు నిశాచరు లుండి యుండి కానవచ్చుచున్నారు! మరియు గానరాకున్నారు! తా మొరులకు గానరాకుండ నెంతేని యపకృతి సేయగలరు. రుధిర వర్షమునైన గురిపింపగల సమర్థులు. నీవును నేనుం గూడ నాగ్నేయాస్త్రము నుపసంధింపవలెను." అని శ్రీరాముడనెను.—

లక్ష్మణుండును ఆగ్నేయాస్త్రమునే సంధించెను.

ఏమి ఘోరము! ఎంత విపరీతము! ఎంత నిర్భయత! అదె రుధిర పూరితములగు భాండముల నెవ్వరో యంబర తలమ్మునుండి గుమ్మరించుచున్నారు.

"అదే చూచితే! తమ్ముడా, అదె, అదె, వికృతాకారము నొంది ఆ నిశాచరు డెట్టుల నేలపై గూలుచున్నాడో! చూచితివా!" అని శ్రీరాముడు తన తమ్మునితో ననెను.

"రామచంద్రా! అదె- ఆ దుర్మార్గుడే సుబాహుడను రాత్రించరుడు. నీ యస్త్రవిద్యా ప్రభావమ్ము కతమ్మున నీ దుర్మార్గుడు నేల గూలినాడు. ఈతని యన్నయగు మారీచుడదె ఉద్రేకమ్మున నగ్నికుండమున భాండముతో రక్తము పోయుచున్నాడు. వీ రిరువురును, తమ తల్లియగు తాటక చంపబడెగా నను క్రోధమున నింత లోనర్చుచున్నారు. మీరు తొలుదొలుత ప్రయోగించిన వాయువ్యాస్త్ర బలము

వారి రుధిరవర్షము ఆగిపోయినది; మీ యాగ్నేయాస్త్ర బల మున నా సుబాహుడు నేల గూలెనే గాని అతని యన్నయు బహుమాయావియునగు మారీచుడల్లదె యింకను పోగ రెక్కి చరియించుచున్నాడు. వానిని మీరు రూపు మాపితేని మానవ కోటిని రక్షించుటయే గాక, ఋషికులము నేటినుండియు సుఖముగ జీవించుచు, వారి యజ్ఞాది క్రతువులు సలక్షణముగ జరుగనిచ్చినవారగుదురు. పాపజన సంహారమొనర్ప జనన మందిన యో మాయా మానుష విగ్రహ ధారులగు విష్ణ్వంశసంభూతులారా! యింతకన్న మిన్నగ మే మేమి విన్నవింతుము.” అని అంగిరసుండను ఋషి సత్తముండు పలికె. రామ లక్ష్మణులును తక్షణ మా మానవాస్త్రము బ్రయోగింప నా మానవాస్త్ర పటిమ యెంతయో గాని, వానిని దా దవ్వుల కీడ్చుకొని పోయి సముద్రమున ద్రోసివేసినది. ఈమారీచు డెక్కడ పడిపోయెనో చూతునని గాబోలు అదె కరాళుడు మహేంద్రగిరిపై నెక్కి, నిక్కి నిక్కి చూచుచున్నాడు.

ఈ మహేంద్రగిరియే ఒరిస్సా (ఉత్కళ) రాష్ట్రమునుండి ఖాండేషువరకును అనగా గాండ్వానా వరకును వ్యాపించి యున్నది. ఈ మహేంద్రగిరియే పరశురాము డను మహావీరపురుషుని కెంతో కాలము నివాస స్థలమయి యుండెను.

ఋషిలోక కష్ట పరంపర లెల్ల బటాపంచలై పారె నన చీకటులు దిశాంతముల కేగ, రాత్రి యను ముసుంగు వెలి ద్రోసి, నక్షత్రములెల్ల గప్పికొన నన సూర్యుడును తూరుపు గట్టెక్కెను.

“ఎంతపని చేసితివో రాచకూనా! మొన మొన్ననే

నా తల్లిని బాపి, యిప్పుడిపుడే నా తమ్ముని మన్నిగొని యెంత
తో చాలకనో యన నన్నిపు డింత దూరము తొలగ ద్రో
చితివి! ప్రభు నానతికి వెరచి, సమీపమున నుండియు, వినియు,
మాతృ వియోగ కాతరుండవగు నిను దెగటార్పబో నోపనైతి;
నిను బ్రతారింప నొనర్చిన నా పన్నాగము లన్నియును వమ్ము
నర్చితివి. పై పెచ్చు నను నొంచుచున్నావు. నేటికి ఆరు ది
నములనుండి సమయముకొరకు వేచి వేచియు నెంతో ప్రయ
త్నముమీద నేటి నాటక మాడించినను తుద కింత వంత సమ
కూర్చితివే! ఇంత పసితనమున నెంత దారుణాస్త్రముల నను
నంధింపనేర్చి యేర్చియేసితివి? మా తల్లి సహస్రగజబల సమన్విత
యయ్యు, నీచే నిహత యగుటను నీ వింకను యెంతెంత మం
త్రబలముగల యస్త్ర ప్రయోగముల నేర్చితివో గద!" అని
యొక్కండనుకొను చుండగనే దాపాపులనుండి యొకా నొకడు
డువచ్చి, "మారీచ ప్రభూత్తమా! మనబలమిమ్ముగలసికొసగలనా,
లేదా, యను సంశయముతో, రాము బాణముతో, త త్వేగ
ముతో, నేనును బరతెంచి మి మ్మవలోకింప, మహేంద్రగిరికె
క్కి చూడ, తామీ తావునను జేరుచుండుటగుర్తించివచ్చితిని."
అని యనెను.

"ఓహో, కరాళా! నాకొర కెంత శ్రమపడి యెంత
దూరము వచ్చితివి?" యని మారీచుం డనెను.

"ఎంతో యా వదలోనున్న మీ కన్న నెక్కువ శ్రమ
పడలేదు. శ్రమ యంతయు తమ దేను. నేను మిము కనుగొను
టే దుస్సాధ్య మయినది."

"నిజమే. ఇప్పుడు మనమిట నుండుటే మరియు నప్రశస్త

ము. జరిగిన సంగతి ప్రభునకు విన్నవింప బోదుము — రమ్ము!" అని యనుచు యచ్చటు వీడిపోవుచు, "ఓ రాచ పూవలారా! ఇక నెన్నైన పాట్లు పడియెదరు సుడీ! నేను మును లాలోచింపక యింత పని చేసితిని! నే నెవడనో యెఱుంగక సామాన్య రాక్షసుడ నని యెద దలంచి యింతలు చేసియుందురే గాని, నా పటిమనెరిగి కాదు. కాదందురేని 'మారీచు మాయ' లను ప్రతీతి కాల కాలముల వరకును నిలచియుండునటుల బ్రతీకారము నెరపు నంతటి సాహసుండ నని యెఱుంగరా? నను మరి మరువజాలరు సుడీ! దేశ చరిత్రలతో పాటు, కాల విశేషాలతో పాటు నా మాయల పర్యవసానములును, తన్మూలమున మీా పాటును జనులు కాల కాలములవరకును మరువజాలక స్మరింపుచు నుండు నంటటి కరకు పనులను జేసి మరీ పడచెదను- పొండు." యని బింకాలు పలుకుకొనుచు నా తావు వీడిపోయెను.





# పరిణయ విభ్రమములు

## పదునేడవ ప్రకరణము

### ఖిరాలయము

"ఎంతటికిని కుదుటపడని యీ మానసముతో నెంతసి చిరగుదును? ఏమి చేయుదును? యమలోకముపై దండెత్తిన నాకు, ఇంద్రలోకము జయించిన నాకు, వేయేల లోకాలోకములపై దిగ్విజయ యాత్ర సలిపిన నాకీ సీతాపహరణ కార్యమొక త్రుటిపాటిదియైనను కాకపోయినను, కేవలము స్వామిత్వముకొరకే నేను ప్రధానముగా నాలోచించుటచే యింతటి చిక్కు, యింతటి బెడద, యింతమందిని సహాయము కోరుట, మొదలగునవి నాయట్టి సర్వ సర్వం సహా చక్రవర్తికి తటస్థించుచున్నవి!" అనియనుకొనుచు రావణుండొంటరియై బలు తుంటరి ప్రలాపంబుల గటకటం బడుచుండ,—అసాధారణమై, అమితమై, అనంతమై, యవర్ణ్యమై, యవాఙ్మానస గోచరమై, యంగ ద్రాఘిష్ఠతకును, నంగ దార్ఢ్యమునకును, నంగ స్థౌల్యమునకును, నంగ విజృంభణమునకును, నద్వితీయమగు నుదాహరణ మగు నొక వ్యక్తి తన యెదుట బడెను. అంత మహోత్తుంగ కాయమునకు దగినంత ప్రళయ కాలానల సన్నిభమైన క్షుత్తు, దానికి దగిన యనేక శత సహస్ర శకటాహార రాశిని పటిష్ఠత, యందుకు దగిన మహోన్నతత్త. దానికి దగిన యసాధారణనిద్ర, దాని ననుసరించిన బుద్ధి మాంద్యము, దాని క

వనియు నా కవియే వ్రాసెను. ఇక నాతడాకసమున ధూమకేతువువలె నున్నాడని కూడ వ్రాసెను. ఎంతసేపు వర్ణించినను నాతని వర్ణనా క్రమమును బట్టి మన మూహించుకొనవలసినదే గాని చిత్రించుటకు వలనుపడదు.

ఇంకొకచోట సుమారు కొయ్యల గొప్ప సముద్రపు టోడల నడిమి తెరచాప కొయ్య యా సైతానుని చేతిలో విలాసార్థముగ వహించిన చిన్న బెత్తము (విలాస దండ) మై యుండునో యని మిల్టను వర్ణించినాడు. మా కుంభకర్ణుని గూర్చిన వాల్మీకి మహాఋషి వచియించిన వర్ణనము లన్నియును గొంచెము హెచ్చు తక్కువలతో మిల్టనుకూడ తన సైతానుని గూర్చి కూడ వర్ణించియే యున్నాడు.

వీనినిబట్టి మన కుంభకర్ణుని యసాధారణమైన, యసనుపమానమైన, యత్యద్భుతమైన, యనర్ఘ్యమైన యాంగ మహో మహిమను మనము యోజించుకొనవలసినదే; కాని, వాల్మీకి కుంభకర్ణునకును, మిల్టను సైతానునకును వ్యవస్థాన భేదములు లేకపో లేదు.

సైతానుడు దైవ దూషకుడు; (1) కుంభకర్ణుడు దైవ భక్తుడు. సైతానుడు బహు మాయావి; (2) కుంభకర్ణుడు పట్టి యమాయకుడు.

ధామములో బ్రవేశించి యాదాము భార్యను సమీపించి, యామెను మోసగించి, తన్మూలమున తద్భర్తను భ్రష్టు

(1) ఈ విషయము విపులముగ నీ గ్రంథకర్తయొక్క రెండవ వాల్యము' అగు 'వనవాస విగ్రహములు'లో చూడదగును.

(2) మూడవ వాల్యం 'రణరంగ విగ్రహములు'లో చూడదగును.

పరచి. సైతాను భగవంతునిపై బగ సాధించెను. ఈ పనులలో సిద్ధానికిని మన యువనాయకుండగు కుంభకర్ణుడు పాప మాత్రప్రకృతి చేతనే బనికిరాడు. ఇంతకును విశ్వాసమునకు కాణాచి యగు హిందూదేశమునకు జెందినవాడుగదా కుంభకర్ణుడు!

సాధారణముగా, నసాధారణ దేహదార్ఢ్య మెచ్చటఁ గన్నదో, యచ్చటనే యమితమగు యమాయికత్వముండుటే ను సహజ విశేషము పాప మాయాంగ్ల కవి సార్వభౌమునకు దెలియుటయు యెంతేని శోచనీయము కాదా! ఈ విషయము స్పష్టముగ గనిపెట్టినాడు మన వాల్మీకి. అత్యద్భుత ధైర్య మున్నచోట బుద్ధి వైశద్యము సర్వ సాధారణముగ మృగ్య మని కూడ వాల్మీకి గుర్తెరిగించి మన కుంభకర్ణుని వర్ణించుచు చిత్రించినాడు. కాని పాపము మిల్టను, సైతాను కుంభకర్ణునికన్న సహస్రగుణాధిక శేముషీ సనాథుడు. అసాధారణ దేహదార్ఢ్యతయును, అనన్య సామాన్య శేముషీ సనాథత్వమునకును, గల బద్ధ విరుద్ధ బాంధవ్య సూత్రము నెరుంగక గాబోలు పాపము మిల్టను అంత విక్రమాకారముగల తన శాటనుకు ప్రకృతి సూత్ర విరోధమగు నద్భుత ధైర్యమును అధిక బుద్ధి వైశద్యము ను గల్పించినాడు. ప్రత్యేకము శరీర బలాధికత్వము, శరీర సాహసోత్సాహములే చిత్రింపబడి వచ్చినప్పుడు, ప్రతిభా విశేష ము 'బాక్ గ్రౌండు' (Back ground) లో [illegible]యుండునే కాని వానికి ప్రాముఖ్యత నీయదగదని పాపము మిల్టను నెరుంగడుగాబోలు. ఈ సూత్రము క్షుణ్ణముగ పరిగణించినవాడు వాల్మీకియే.

కుంభకర్ణునకు, సైతానునకు గూడ అసమాన ధైర్యము

ప్రతిబింబమే కానిమొదల రామాయణము ఒకటి పావు కోటి వత్సరముల కన్న నెక్కువ కాలమునకు వెనుక జరిగిన చరిత్ర యింత కాలము నిలువనే నిలువదు. మహోత్కంఠాగ్ని పర్వతాద్యవాంతర ప్రళయముల చే హిమాలయాచలము పాతాళములోనికి కృంగిపోవచ్చును; సింధు గంగా బ్రహ్మపుత్రాది నదులు శుష్కములై నామమాత్రావశిష్టములై నశించిపోవచ్చును। సముద్రము పొంగి యొక్క రాత్రిలో, కాదు-కా-దొక్క క్షణిలో, వింధ్యపర్వతమువరకును దేశము ముంచివేయ వచ్చును; కాలమా! నీవు పదిలక్షల సంవత్సరములు జరజర మని ముందుకును వెనుకకును పోవుచున్నను నీ చిత్తాను సారముగ నార్యావర్తమున నందఱనుగూడ, నల్లులుగను, నాగరికులుగను, రొట్టకట్టలుగను, బహుప్రాయులుగను, మనుష్యాదులుగను, మార్చివేయగలవేమో గాని, నీవు మాత్రము రామాయణ ప్రాచుర్యమును దగ్గింపజాలవు! రామాయణ ఖ్యాతిని మాపలేవు! రామాయణమున నొక యక్షరమైనను దునుమలేవు-చెరుపలేవు-తగ్గింప లేవు! రవిమండల తేజమునైనను నీ సామర్థ్యమున తగ్గింతువేమో గాని రామాయణ రామణీయకత తగ్గింపలేవు! రామాయణ సారము తీర్థ గ్రంథము సముదాయ మెరుంగును. గాలిలోని పరమాణువులు రామాయణ మాహాత్మ్య మెరింగినే తాండవించుచున్నవి సుమా!" ఈ పాట నీ వెరుంగవేమో యని యింత దూర మా కాలమా, నీతో బలుకవలసి వచ్చినందులకు చింతించుచు నీతో నింత సేపు బ్రసంగించుచున్నందులకు నా పై కోపము కంభి కర్ణుండును, రావణుండును, నేమి ప్రసంగించు కున్నారో వినవలె వినవడవలసియున్నందున న— నాలోక్య మా పనులకెంతో

ప్రపంచమును మున్నెరుగ న్నాగు సంతసమ్మున "మిత్రమా ! స్నేహ శబ్దము నీయందు యన్వర్థము నొందినది. నాకు హిత మొనర్ప నీ వెంత శ్రమింపసిలితివో, యెట్టి యుపాయమ్ముల బన్నితివోగద ! నీ కెట్టి యుపాయన మొసంగిన సమంజసమో యని యాలోచించుచున్నాను." అని యాతని బహూకరించెను.

"చెలికాడా, నీకొరకే మాత్రమును శ్రమయు పొంద నక్కరలేకయే సరిపోయినది. సీతా శాంతల వేరుపరుప నే జేసిన ప్రయత్నములలో నేదియు సఫలీకృతముకామి, మార్గాంతరము దోపమి, సీతా శాంత లున్నచ నేమొకో గాని, హనము సమీపింప బోయినచో, భరింపరాని, వేడిమి వెడలుచుండె—— ఆ వేడిమి ననుభవించియో, తత్కారణ మెరిగియో నీవు విఫల మనోరథుండ వయితి వని దలంచితి——"

"కాదు-కా దటు కాదు——నే నా వేడిమి పోడిమి యెరుంగను. ఏదీ వారి నంతవరకును సమీపింపనైన వలనుపడిన గదా ! అదృశ్యకరణితో నున్న నేను, రాక్షసాంధకరణ తో మణికంకణములతో నున్న సీతను, జూడ బ్రయత్నించుట తోడనే సరిపోయినది. జరిగిన వన్నియును దప్పులే ! అందువలన వారిలో నున్న విశేషము లేమియో నేను గుర్తించుట కైనను వనువు పడనే లేదు."

"కాని వారిని వేరుపరచినచో నా యుష్ణతకు గారణ మరయుసగును గదా యని యెంతో బ్రయత్నించియు తుదకు విఫలమనోరథుండ వయి, యా సమీపమున నున్న యొక కొండదొలిచినైచి, విలాసార్థ మాడాడ దిరిగి వారివారి విడుదులకు మరలుచుండు పట్టున నెట్టన వా రిరువురిపై గప్పి, మరి కదల

జాలదు గదా- మరి తప్పించుకొనిపోజాలదుగదా—యని, యీ వార్త నీకు దెలియజేయ నిట కరుదెంచితిని. మిత్రమా, యీ జరుగున్న దాని, నిజావాన దీక్ష సేయుము. నేనును సీతా శాంతలు నిలిచియున్న నివేశన సహితముగ గొనితెచ్చి నీ మ్రోల నుంచువాడను. ఇక నీవు చింత దక్కి యుండుము."

రావణుండును అమితానందంబు నొంది—"మిత్రా, నీ నర్చిన కార్యము సంభావ్యంబె యగు గాని, నీవు నాకొరకొదవిన శ్రమ నివారణార్థ మీ ఖరాలయమున గొంత తడవు విశ్రమించి యనంతరము మరుగడ కార్యమునకుం గడంగుట సమంజసము.

"ఖరా! నీ యాలయము కృతార్థత జెందినది, ఇపుడిట కరుదెంచియున్న మన్మిత్రుండగు మైరావణునకు సుస్వాగత మొసంగి, సపర్యలనిడి నీ జన్మము సార్థకపరచుకొనుము. మనన మరల సాంప్రదాయానుసారము మధుపానాది విశేషములచే మానసమ్ముల సోత్కర్షమ్ములుగ జేసికొందము."

"చిత్తము. అటులనే జేసికొందము." అని ఖరుడనెను.

ఖరాలయమున నన్నియు మంగళప్రద మగు శుభాగమనాదికములే! అంతయు జాజుపుదనమే! అంతయు నానందమయమే! ఆ ఖరుడా ప్రాంతముల నెంతటి యధికారియో, యెంత పలుకుబడి గలవాడో, మరి యెంత స్వల్పకాలమున నిక్కడనుండి రావించెనో గాని, నేల యీనినట్లే గద ఆ ప్రజ! మిన్ను ముట్టినట్లే గద ఆ మంగళ తూర్య నాదములు! ఆ వాద్యముల యింపు, ఆ నట్టువకాండ్ర నాట్యముల సొంపు నేమని వర్ణించుట! అచ్చట నున్నవారిలో నెవ రెవరో యెక్కడ లేవ

తక్కినవా రందరును నోడ ద్దాలియుని యంత యానందవార్ధిని మత్తిల్లియే యుండిరి.

ఇంత సంతోష సమయాన నెవరెవ రెన్ని విధాల నోడ ద్దాలియుని విశాంసనుండిరో గాని, రావణుడు మాత్రము సీత నెప్పుడు జూతునా యని యువ్విళ్లు లూరుచుండెను. మైరావణుం డన్ననో, మత్తిలి, మోటుదనము జూపదగిన సమయాన బుద్ధు ల్వెడలిపోయి, తా నట దాలిచియున్న కొండక్రింద తా గప్పియుంచియున్నా నన్న సీతా కాంతల, నా భూమి పెళ్లతో పాటు గానితే నాలోచించుచుండెను. ఇంక ఖడుడో, రాబోవు సీతా యుత కాంతా సమేతమైన యా మేళ మంతయును యిప్పటికే న్న ద్విగుణించిన విలాసముతో విందుల నొసంగ నాలోచించు చుండెను.

తన కార్యము పూర్తి చేసికొన మైరావణుండును, కొంగసేపటికి తన వచ్చి రాని నిదురనుండి మేల్కొంచి, రావణుం బిలచి, "మిత్రమా, ఇదె నే పోవుచున్నాను. నీవును నీ పుత్ర పౌత్రాదుల సహితముగ, నిశ్చింతముగ, లంక కేగి, సపరివారముగ కార్యోండ వగు నా రాక కెదురు చూచు చుండుము. ఆ ప్రదేశము నొకటి యామమైనను పూర్తియయి యుండదు. మూడవ యామము దాటకయు మున్న నే నా సీతా కాంతల గప్పియుంచిన కొండ, దానిక్రింది పెళ్లతో పాటు నీ లంకను చేరి, నీ మ్రోల నిలిపెద, కావున నీ విట నిక నాలస్యము సేయక, ఏ లయినంత త్వరితముగ నీ ప్రస్థానము జేయుట యొ సల మాకారి. ఇదే, సెలవు గైకొని పోవుచున్నాను." అని దృఢపరచి, యంతఃమును వెడలెను.

"ఇక్కడికి మైరావణుడు కార్యభారము శిరముపై నిడి కొని, సగము పనిచేసికొని వచ్చి, తా నిప్పటికి చేసిన పనిని నివేదించి, శేషించినకార్యమును కొనసాగించుకొని రా నేగెను. ఈతనికి సాయ మొనర్చి మ దీప్సితము నెరవేర్ప నే నపిన కుం భకర్ణుం డేమి యయ్యెనో తెలియరాకున్నది. ఇప్పటికి మైరా వణునకు దుశ్చింత లేదనియే తలంతును. ఇక గుంభకర్ణుం డేమి చేసెనో, యేమిచేయ దలంచెనో గదా! నాకొర కయి రే గిన భ్రాతృమిత్రులలో నేరివలనం గూడ, తనకు హిత మొన గూర్ప నంపబడిన దూతిచే నఖ పొందిన ప్రతిఫలము, నే నం తుకుండిన నంతియ జాలు. అ ట్లేల జరుగగలదు? స్వయముగ విఫలీకృత మానసుండ నగుట, నీప్సితము ఫలోన్ముఖమునకు వచ్చుచుండిన కాలదిని, ఫలము దవ్వులనుండి సమీపించిన కా లదిని, ప్రతివ్యక్తికిని, తన మానసమున, నసయము ననుమాన మును, ననుపమానమా నాందోళనమును, జనించి వేధించు చుండుట సహజమాట ని ట్లనుకొనుచుంటిని. అంతియ కాని యిం దసంగత కార్య మెంతమాత్రమును నూహింప రా దు. తన ప్రేమ కాస్పదమైన పదార్థముం గూర్చి యెల్ల మె డల, నెల్లప్పుడును, సంశయమును, భయమును తా నొందుచుం డుట లోకమున సహజమే గద! ఇం దసంభవ మేమున్నది!" అని తనలో నీ రావణుం డనుకొనుచుండగనే, అదివరకే తనచే నాజ్ఞాతుండయి మారీచునకడ కరిగిన సారణుం డిపుడు మగుడి వచ్చి, "సార్వభౌమా, యెంతో తిరిగితిని; యెంతో శ్రమం ప డితిని; మారీచుడు నాకు గానరాలేదు," యని విన్నవించెను.

"మీ రిపుపురను చెరియొక త్రోవయు నగుట నొం

వారలు గలసికొన జాలకైరి. అయిన దయినది. ఏమిప్పు.

"విద్యుజ్జిహ్వా, వింటివిగదా మన వైరావణు మాటలు! ఇక మన మిపుడు లంక కేగుటయ యుచితము.

"సారణా, విమానముల నిక నీ వాయత్తపరచుము.

"ఖరా! మే మిపుడె లంక కేగుచున్నాము. కుంభక ర్ణుం డిపు డిటకు మరలివచ్చినచో సరాసరి లంక కేరమ్మనుము", అని రావణుం డనుచు బ్రయాణోన్ముఖు డయ్యెను.

సారణ విద్యుజ్జిహ్వులు రావణు ననుసరించి లంక కేగిరి గదా! సీతా శాంతల నొకట నొక కొండక్రింద గప్పియుంచితి మనియు, వారలు నిలిచియున్న భూ నివేశన సహితముగ లంక కే గొనివత్తు ననియు చెప్పి యిపు డిపుడే పోయిన వైరావణు నకు పూర్వమే కార్య భారమున నేగిన కుంభకర్ణు డింకను మ రలి రానేలేదుగదా! సీతను వెదకుట కొక యోషధియును నామెను వశపరచికొన నింకొక యువ యోషధియు నుపయోగింతునని కుంభకర్ణుడు చెప్పిపోయెనే! ఈతని యూహాల యభిప్రా యము మేమోగాని, వెదకుట, స్వాధీన మొనర్చుకొనుట లోను గాగల పనులకు ఓసధు లొండె, మూలికలొండె, యుండునట!

ఏమో! చూతముగాక!





# పరిణయ విభ్రమములు

## పదునెనిమిదవ ప్రకరణము

## ఇవ్వలి కథ

విశ్వా:—శ్రీరామచంద్రా, ఇక్కడికి నీవలన నీ యాగము సంరక్షితమైనది. యాజ్ఞ్యవల్క్య మహర్షిం దర్శించి శెలవు గై కొనివచ్చినాము కదా! ఇక మిథిలానగరాధిపుడగు జనకుడు ఒనర్చుచున్న యాగము జూడ మనల నాహ్వానము సేయ శతానందుడు వచ్చి చెప్పిపోయెను. కావున మన మిక నటకేగి యాగము దర్శించి, యయోధ్యకు మరలుదముగాక!

శ్రీరామ:—చిత్తము. తమ యాజ్ఞానువర్తులము కామా!

విశ్వా:—సరేకాని, ఏడీ! ఆలిండిపోతు-పింగళుడు! మన మిటు ప్రయాణ సన్నాహమున నుండ తానటు నిటు దిరుగుచు, తుదకు మనలను దప్పిపోవచ్చును.

శ్రీరామ:—అట్టి యనుమానము చేతనే, నేనిదివరకే పింగళుం బిలువ లక్ష్మణు నంపి యుంటిని. అదె వారును వచ్చుచున్నారు

విశ్వా:—ఏమి పింగళా! ఎక్కడనుండి వచ్చుచున్నావు?

పింగళ:—మనప్రయాణము మాట మును లనుకొనుచుండగా విని, సీతకడ శెలవు గైకొన బోవ, మన మందరమును విశ్వా

మిత్రి పనేరముగ జనకుని యాగము జూడ నేగవలసి యున్న దనియు, నాయూహాయును శతానందు ముఖమున నిటు కనుప బడెననియు విని, యిక నీ పయనము నాకుత్తరమై నున్నదే యని యనుకొని, పడి పడి నే నిట కరుదెంచు చుండ, నీలక్ష్మణుండును, నా కొరకేంపటు, యెదురు వచ్చెను ఏమి? ఎక్కడినుండి వచ్చుచున్నావు? అనిమీరంత గద్దించి నన్నడుగవలసినంత నేర మేమున్న దిందు?

శ్రీరామ:—నేరమున కేమియును లేదు. మనము జనకునగరము నకు పోవలసి యున్నది గనుక, నీ కొరకె యెదురు చూచు చుంటిమి.

పింగళి:—అంత మీ రెదురుచూచుచునే యున్నచో, నిదో వచ్చి నాను.—ఏది యెట్లున్నను, పిచ్చికనై బ్రహ్మాస్త్రముం బోలె అర్భకుడనైన నామీదనే మిక్కిలి దరుముగ, నురుకుచున్నారే! ఇదేటి న్యాయము?

విశ్వా:—పరమ ఛాందస శిఖామణి వౌ పింగళా! లోకమున నెల్లరకుంగూడ కొంచె మార్గము లైనచో, నీకు గోచరించునవి యెల్లప్పుడును మూడవ మార్గమే. అట్లాట నితరుల మాట గా ల్లప్పుడును నీ కపార్థము లిచ్చుచుండును. నీవు దీర్ఘప్ర సంగములచే కాలహరణము తప్ప కార్యకారి కానేరవు. ఇక మనము ప్రయాణ మొనర్చి మిథిలానగరమునకుఁబోదము.

పింగళి:—ఔనౌను—ఇక ప్రయాణములే. నాదే తప్పు-విశ్వా మిత్రుని యాగము జూడవచ్చిన మనము యిప్పు డింటికి పోగ లక, మిథిలానగరమున కిప్పుడేల? పావన బిడ్డనైన నాకు లేని యూం వచ్చె తప్పదవు ఆకే యీ రాచబిడ్డల కింతయేల?

రాయుట యును నదియా కష్టము? చూచితివా, పింగళా! మన కూ మాట లనుకొను చుండగనే, మన మతిదూరము సాగక మున్నె ఎంత సాంద్రముగ గురియుచున్న దీ వర్షము! అహా! భగవ దేచ్ఛ! ఎందుకును పనికిరాక, ఎంతో కాలమునుండి బీడుగా విడిచిపెట్టబడిన అహల్యాశ్రమా యీ నేల ఎంత వేగముగా సుక్షేత్రముగా మారిపోవుచున్నదో, చూచితివా!

పింగ:—ఋషీంద్రా! సుక్షేత్ర మాటయేగాక, దుఃఖ పరంపరల కోర్చియో, కష్టకాల మెల్ల కండ్లు మూసికొని కాలక్షేపము చేసి, కష్టము లెల్ల దైవికముగ దొలంగ శాప విమోచన మగుట నల్లల్లన లేచి నిలుచుచున్న యీ భూకాంత, తదుత్సవములతో, నెంత మనోజ్ఞముగా నున్నది!

విశ్వా:—పింగళా! నీవు వేద జడుడవు మాత్రమే యని యూహించితినే గాని నీ వింత దూర మలంకారశాస్త్రము నెరింగిన వాడ వని నే నూహింపజాలనైతిని—ఈ అహల్యను శాప విమోచన యయి పునరుద్ధరింప బడిన కాంతగా నెంతేని హృద్యముగా నరిపోల్చితివి!

శ్రీరామ:—మునికుల తిలకమా! ఈ నేల యింత కాలము నుండియు నహల్యగా విడిచిపెట్టబడి యుండుటకు గారణం బేమయి యుండును?

విశ్వా:—ఈ యా వానమున చిరకాలమునకు వెనుక గౌతముడను మహాశక్తికుండగు మహాఋషి నివసించుచు, [illegible]చు, ఋతుకాలముల యందు వర్షించు వర్షములచే నీ క్షేత్ర[illegible]ను ఫలింప జేసికొనుచు, తన్మూలమున జీవించుచు శిష్య[illegible] [illegible] తపం బొనర్చుకొనుచు, కాలము బుచ్చుచుండెను [illegible]

ఎంతో కాల మిట్లు జన చన, నొక్కనా డట్లో ఋతుకాలము కానికాలమునాడు, పెద్దవర్షము గురియ వ్యవసాయమునకు భంగకరమగు నా యకాల వర్షమున కా గౌతముండు గినిసి యిక నీ నేలను కా నుండరాదని నొంచి, యీనేల నహల్య యగునట్లు శపియించి యీ ప్రదేశము వీడి యా గౌతముండు వెడలిపోయెను. ఆనాడు మొదలు నేనాటి వరకును నీ నేల యహల్యగనే యుండి తుదకిపుడు మహాపురుషుండ వగు నీ రాక కతంబున నీ యహల్య శాపవిముక్త యాట కాలకాలముల వరకును, శ్రీరామా, నీవు అహల్యా శాప విమోచనుండని నను కీర్తి నాకమున బ్రకాశించుచుండుగాక!

శ్రీరామ:—మునిచంద్రా! మీ వాక్యము లమోఘములు గదా!

లక్ష్మణ:—ఋషిచంద్రమా! పింగళుండిపు డూహించినదియు శ్రీముని విరచితియు వినినపిదప, నీవర్షకారణమున, నీక్షేత్రి మెల్ల పచ్చనిదై, వనదేవతపొంకటు భూకాంతయోజ, దిక్ప్రదర్శన మొనర్చుచున్నది!

విశ్వా:—కావుననే నీయహల్యనిపు డొక నాతిమిన్నగా జెన్నవలసి యున్నది.

పింగళ:—ఈ నాతి మాట కేమిగాని, నడచి నడచి మన మీ మిథిలను సమీపించినారము గదా! ఇక మన మా జనకుని జూచి మనదేశమునకు మరలుటయే యుక్తము గాని, యింకను మన మీ దేశాల దిమ్మరుచు కాలము బుచ్చుచుండుట అక్రమము కాదా! ఇటు లెంతకాల మింకను జనని జనకులకు దూరస్థులై మనమిటుల దిమ్మరుచుండవలెను? మీ రింకను దిమ

మా ‘నిమి’ వంశమున ‘జనక’ నామధేయమునకు కాల కాలముల నుండియు బృహోపేతుం డగు శతానందుండును యుండె వచ్చు చున్నాడు. ఈ మీ రాజపుత్రులం దోడ్కొని, మా నగరం బునకు విచ్చేసి మా గృహాను పావనం బొనర్చి నా కార్యంబు ఫలవంతంబుగ నొనర్ప బ్రార్థించుచున్నాను.

“రాజ కుమార కిశోర సింహములారా, మీరును నీ మునికులావతంసుని వెంట నరుదెంచి మా నగరి నగరుల పావనం బొనర్చి, మా ద్విరచిత యాగంబు సఫలం బొనరించి, నను కృతకృత్యుంగా నొనర్పుడు.

“మునికులావతంసమా, నా సవినయ నమస్కారం బు గైకొనుడు; ఇదె సెలవు గైకొనుచున్నాను.”

అని వేగుల వారి వలన శ్రీరామాదుల రాక నెఱింగిన శ్రీ జనక చక్రవర్తి పలుక, విశ్వామిత్రుండును, శ్రీరామలక్ష్మణు లిర్వురును, జనకుని పలుకుల కానందించుచు, నాతని కోర్కెని యానాటి కా నగరప్రాంతమున నున్న పూదోటల విశ్రమిం చుచు, సేద దీర్చుకొని, మఱుదినమా మిథిలా నగరమున నున్న జనకు నగరునకు బోయి దర్శింప నాలోచించుచుండిరి.





# పరిణయ విభ్రమములు

## పందొమ్మిదవ ప్రకరణము

### ఆవలి కథ

"ఔరా—నది మాత్రము తొందరపాటు కాదా! పదునాల్గు భువనంబుల సవతులేని యశస్కాముండ వయి సార్వభౌమ బిరుదాంకితుండ వగు నీకు దగని పని గాదా ఆ తత్తరపాటు! ఈపాటికి నింత వంతజెంద నక్కర యుండకుండును గదా! నీవు నారదు పోక మంత్రాలింగము సేయువాడా! జనకుని కడనుండి వార్తగొనివచ్చిన నాడీ సారణుడు నిను గూర్చి నను సంప్రశ్నింపగా, కైలాసమున కేగితివని నేను నుడువ, తా నెంతో తొందరతో నిను సందర్శింప పోబోవుచు, నా విద్యుజ్జిహ్వుని దోడ్కొని పోజూచిన యపుడే యేమి వాటిల్ల నున్నదో గదా యని తత్క్షణమే తలంచియు, దూరమున నున్న నీ మతి ననుసరించవలసిన దురాలోచనాపరు లగు నీ మంత్రివర్గము నానవెట్ట దురాలోచనం జేసియు, మానసమున కాశించి మిన్నకుంటినే గాని, యిక నిపుడన్ననో, నీవు నా సముక్షమున నున్నావు! ఇక నిపు డీసమయమున నెవ్వ రేమనుకున్నను నే జంకుచే గొంకువాడను గాను. ఏ ప్రయత్నమున నీవు సఫలీకృతుండవు గాకుండుటకు దోహదగ నీకుం గూర్పు సఖుం డని యెంచి మైరావణు నీకు సహాయ మొనర్ప గోరుట యొకటియా? ఎంత

ఘోరపాటు! ఆతనికి దోడు కుంభకర్ణుండు కాడా! ఇక నాతనికి సాయముగ నన్నుంగూడ పొమ్మందువా! ఎంత మందుడవైతివో గద! అన్నియు తొత్తరపాటు పనులే గద—ఎంతని విసిగికొందును! ఏదని యుగ్గడింతును!

కాలకేయులతోడి యుద్ధమున చెలియలి భర్తయగు విద్యుజ్జిహ్వుని తన శత్రుకోటిలోనివాడనుకొని, వానిని జరిమార్చి శూర్పణఖను అనాథను జేసితివి; అట్లనన యయ్యె యుబిగదా యొంచిగదా ఆమెకు దండకలో కొంతభాగ మొసంగి దానిపై నాధారపడు మని యంటివి; ఇది ఆలోచనసేయుమైన కార్య మగునా?

కిష్కింధలో నున్న వానర రాజగు వాలితో బోర నూహించి, కిష్కింధకు బోయి, యట వానిం గానక, నాతడు దక్షిణ సముద్రమున (ఇండియన్ ఓషన్) స్నానార్థము బోయెనని విని యటకు బోయి, స్నానముచేసి, సంధ్య వార్చుకొనుచున్న నాతని వద్దం జేరి, యాతని నదిమిపట్టి పాప మాతని నిగ్రింప జూడ, నా వాలియు, శీఘ్రముగ నిన్ను నాల్గు సముద్రముల ముంచి, యలయించి, యేమియు నెరుగనివానివలె నిన్నొకట దిగవిడిచి, "ఏమోయి దశగ్రీవా! ఎక్కడనుండి వచ్చితివి?" అని పరిహాసించి, నిన్నావల కంపివేయుట నీకు సంభావ్యమాగునా?

కార్తవీర్యార్జునితో పోరబోయిన నిన్నాతడు చెరసాల నుంచుట నీకు సంభావ్యంబె యౌనా నేమొ?

మఱియు నొడల్తెలియని స్త్రీవాంఛా దోషమున, వెలున మొన్ననే గద రంభ వలయింపినందులకు గదా పరిభవము

“ఓహో, ఏమి తర్కము! ఏమి చతురిమ! ఏమి యూహాపోహల వైపరీత్యము! ఇంత యుపన్యాసమును, నా చేతల, నా ప్రయత్నముల ఖండించుటకేనా? నీ కింత మాత్రమే తెలియును గాని, నా పూనిక నెఱవేర్చుట, నా పంతము నెగ్గించుట, నా మాట నిలుపుట మాత్రము నీ కెంతమాత్రమును తెలియదు. అక్కఱలేని గొడవ యొకటి యేకరువు పెట్టగలిగిన నీవు కార్యసాధనము దలంపవైతివి! నీకు చెప్పిన కార్యముల లో నేదియు నిప్పటికి సానుకూలపరచితి కావే! ఏదీ:—

మన యుప్పు సముద్రమెల్ల పాలసముద్రముగా మార్చుట మాట మరచితివి;

నరకకూపముల నెల్ల స్వర్గతుల్యములుగా మార్చుట మాట దలంపవైతివే!

ఏదీ నీ విశ్వాసము! శ్వాసమున్నంతవరకును విశ్వాసముండునే గాని మానవున కేదీ విశ్వాసము? అందుచేతను నీ రాజ్యమునకే నీవు నధికారి నైతివే యను ననుమానమున నసూయచే బలీయమైన క్రోధావేశమున నాపనుపడివయ్యును కార్యముల సానుకూలత చూడవైతివి! ఇక నే నీ మాటల నాడినచో, యేవో కొన్ని అక్కఱలేని ముసలియమ్మ గొడవల నేకరువు పెట్టుచుందువు. ప్రభు కార్యాచరణ దీక్షా దురంధరతకు నీవుదగవు. అదుగో, అందుకు దగినవారు సారణ విద్యుజ్జిహ్వులే! నీవన్ననో నా ప్రతికార్యమునకును అడ్డువాట్లు వేయుటకును, నే నౌననిన దాని కెల్ల కాదనుటకును మాత్రమే తగుదువు. నీతో సంభాషించుటకన్న హైన్యత మరిలేదు. నిన్ను ప్రధానమంత్రిగా నుంచుకొనుటకన్న మరియు బుద్ధిమాంద్యత మరిలేదు.

ఒకప్పు డీ రాజ్యమునే యేలియు తరుమగొట్టబడి పోయినవానిని పోషించి మరలదెచ్చికొనుట, గౌరవింపదల గోరికొనుటయు గాదే! ఇంత తెలియకనా, తెలిసినవారు, శత్రు ఋణ శేషములు మిగుల నీయరా దని యనుచున్నారు. ఇపుడు సీతం గొని మైరావణుడు రానై యున్నా డనియు, అనంతరము సీత నెట నుంచుట కర్తవ్య మనియు ప్రస్తావన వశమున నే బలుక, నందుకు దగు నాలోచన నొసంగక, పూర్వపు డొంకలనెల్ల నిపుడు గదల్చి బూనుచున్నావు. ఇదియెంతయు నప్రస్తుతప్రశంస కాదా!"

అని రావణుండు పలుకుచుండగనే ప్రతీహారిచే ద్వార సూచితమై, మైరావణుం డరుదెంచుచున్నా డని వినినంతన, తన యాసనమునుండి చివాలున లేచి మైరావణు నెదుర్కొని స్వాగత మొసంగ రావణుడు వెడలిపోయెను.

"అన్నా! యెంత తొందరపాటు! రావణునకు దోడు మైరావణు డొకడు దలపడినాడు. ఇక నెంతెంత దొసగులు పొసంగునో గద. లంక కెట్టి పాటు వాటిల్లనై యున్నదో కద! ప్రధాన మంత్రిని గదా యని సార్వభౌము మతి నతిక్రమింపక, యాతని యభిమత మీడేర్పనెంచి యిక జానకిం దొరకొను హీని బ్రయత్నమునకు సాయపడితినా, లంకకును, యాతుధాన వర్గమునకును మాత్రమేగాక, సమస్తలోకములకుం గూడ నహితమొనర్చినవాడ నగుదును. ఇక లోకహితైక కార్యాచరణమ్మునకుం గడంగితినా, స్వామిద్రోహ మొనర్చినవాడ నగుదును. స్వామిద్రోహముకన్న నీచకార్య మింకొకటి యుండ దనియు, తత్సంబంధమున పొసగు దోషములెల్ల తత్ప్రభునకే జెందు నని చదువ నేర్చినవా రాడుకొనుచుందురు.

ఇం దెటు బోదు మన్నను చిక్కులే దటస్థించుట దోచెడిని.” యనుచు తన మానసమున సిద్ధాంతమును బూర్వపక్షమును జేసికొనుచు నిదమిద్ధమ్మని నేర్పరించుకొనజాలక, డోలాందోళిత మానసుండయి పాప మా మాల్యవంతుడు మఱిబోయిన వానివలె యా యాస్థానముననే బచారు (పరిచారము) చేయుచుండెను.

* * * * * * * * *

“పండా— కాయా?”

“కార్యసానుకూలతకు బోయినవాని నెరింగియు నిట్టి ప్రశ్నసేయ దగదు.”

“సంశయాన్విత మానసున కిట్టి ప్రశ్న తగదు. ‘ఇట్టి ప్రశ్న తగును’ యనుట అసమంజసము— కాగాక— ఏమి జరిగినది?”

“మరి జరుగుటకే మున్నది? నీ కోరిన సీతను, తన్నినే శన సహితముగ నొక కొండగప్పి, దోడ్కొని వచ్చితిని. ఊరి బయటనుంచి వచ్చితిని. ఒక్కసారి మన మిరువురము మాత్రమే పోయి చూచెదము రమ్ము.”

“ఏమీ! ఇంకను సంశయమా! లేక రహస్యమా! ఈ కార్యమున మంగళహారతి నొందిన సారణ విద్యుజ్జిహ్వులకూడ దోడ్కొని పోదము గాక! నాతో పాటు ఆనందించవలసిన వారు వారునుగూడ గనుక, వారునునాతో, నుండవలసినవారే.”

“సరే— వారికి గబు రంపుము.”

“ద్వారికా, సారణ విద్యుజ్జిహ్వుల దోడ్కొని త్వరితముగ కోటవాకిటికి రమ్ము” అని యనుచు మార్గసూచియై

మైరావణుఁడు ముందు నడువ రావణుం డాతని వెంబడి జక్కి యూరి బయలునకు పోయెను.

"మిత్త్రమా — చూచితివా — అదియె సీతను గప్పి గొని వచ్చిన కొండ — ఇక నా కొండ నెత్తితేని నీవు సీతను జూడఁగలవు."

"ఎంత శీఘ్రపడితివి! హితమును గోరువాఁడే స్నేహితుఁ డనుమాట నీ యందు సార్థక మయ్యె. ఇంతకును సత్కృతు లూరకయ వచ్చునని కావుగదా. * * *

* * * అరుగో, సారణ విద్యుజ్జిహ్వులు వచ్చినారు — చూచితిరా సారణ విద్యుజ్జిహ్వులారా, మైరావణు పరహితరత! మీ యిరువురను మోసగించి, నన్నలయించి, నా చేతల నెల్ల స్వయంకృతాపరాధములుగా మార్చివేసి, మన కందరకును, మంగళహారతి నిచ్చి మనల నంపివేసిన జానకి కుసుమగోపులగాత్రి యిపు డీ కొండ క్రింద నున్నది. ఆమెను జూచుటకే మిమ్మిపు డిటకు రా బంచితి."

"చిత్తము. ప్రభుశేఖరా, ఇంతకన్నను మరి సుదినము లేదు." అని విద్యుజ్జిహ్వుఁడు పలికెను.

"మిత్త్రమా, యిక నాలస్య మేల! జానకీ రూపము గాంచుటకు మానసము మిగుల వేగిరించు చున్నది—"

"సీతొందర ఊరి ముందరకి వచ్చి యురుకులెత్తు నట్టు లున్నది, ఇదిగో జానకీరూప ప్రదర్శనార్థ మీ నాటక రంగస్థలమున నవనిక వంటి యీ కొండను దీసివేయు చున్నాను."

* * * *

"అన్నా! ఏమిది—

"ఏమీ, సీత!—మమ్మందర మోసము జేయనెంచితివా! ఇదివరకు పరులచేతను ఇపుడు నీ చేతను బ్రతారింపబడవలసి యున్నది గాబోలు!"

"అటుగా దలుగాదు — ప్రభుశేఖరా, అటుగాదు. ఇక మనము లోకానకే జులకన యయితిమి. సీతారూపముగ నున్న స్వజనమును జూచియే, సీతయనుకొని భ్రమపడి మోస పోతిమిగదా యనియే యీతండును నిన్న మోసపుచ్చి చూడ నెంచియుండ నోపు. కాదంటిమేని యీ గారడీ యేల? ఇంత టెంపరి మోస మేల? ఇంత మందమేల మేల? ఇట్టి పెట్టివంచన నొట్టు తనవంటి మిత్రునకు తగని పని ? ఇంతకున్న యింకే తెలియక జేసెనా యీ పని ?"

"ఏమో-మనలో మనమే యింత తత్తరపాటు నొందుచున్నామే గాని, ఏమియు పలుకక మనవలెనే దిక్కులు జూచుచు, నిట్టూర్పు విడుచు గోళ్లు చిక్కకొనుచు, కాలిబొటనవ్రేల నేల రాయుచు నిలచియున్న తమ మిత్రుడేమి నుడువునో, వినరాదా!"

" మరి మిత్రుడును లేడు- నుడువుట యంతకన్నను లేదు. ఇంతస్వల్పకార్యమునకు మిత్రమూ, యింత శ్రమయేల?",

"సారణా, మన ప్రభువు పలుకరించినను, బెల్లముకొట్టిన రాతి రీతి సీతడు మారుపలుక డేమి ?"

"విద్యుజ్జిహ్వా, మరి పలుకుటకును, మారుపలుకుటకును యేమున్నది—మన ప్రభునకు శృంగభంగము, ఆశాభంగము ప్రయత్న భంగమును సేయ దలంచుకొనెను. అట్లనే యొనర్చెను. ఇక మరి యేమున్నది."

"మే మందరమును యింత కలవిల పడుచుండగా నాలుకయైనను మెదల్పదాయె సీతడు!— ఏమో, యీతని సంకల్ప మదియేమో!"

"తన సంకల్ప మది యెట్టిదయిన నేమి? తనకు దోడుగా పంపితి మంటివే; ఆ కుంభకర్ణ యువరా జెక్కడ?"

"ఏమో ఏరా వెక్కడున్న నేమి? ఎవరి నంపిన వారే మోసగింపబడుటో, మోసగించుటో తటస్థించుచునే యున్నది— నేడు యిది యేటి పని— నేన స్వయముగ, ససహాయముగ, పోయి కార్యము సానుకూల పరచుకొనుటో, కాని నా దాసులు పోయి, యుఘుపుల దొలగుటో, జరిగితీరవలెను. ఏది యెట్లు కానున్నను సీతను దోచుకొని వచ్చితి నని గారడీవానివలె యీ నాటిపుల్ల కొండను వెలికి దోసి యందేమియు గానక, మన వలె నీతండును విస్మితుండై నిలచి యుండుట నెంతమాత్రమును సమన్వయింప జాలకున్నాను. ఇందు తానే మోస పడెనో, మనల మోసగింప బన్నగించెనో, తెలియకున్నది. ఇంతకును తా నేమియు పలుక డాయె—" అని రావణుడనెను.

"మిత్రమా, యిందేమో ద్రోహము జరిగినది. నన్ను బ్రతారింప దగినవా డెవడో యింత లోవచ్చియుండును— కాదంటిమేని, యింత యాగడమా! ఇంత మోసమా! ఎంత గుండె నిబ్బరము! ఎంత దురంతము!"

"చెలికాడా! నీ మాట లేమియు సుబోధకములు కాకున్నవి. జరిగిన దేమో మాకు తెలియకున్నది. సీతను జూపెద నని, కొండయెత్తి మ్రానువలెనే నీవును నిర్విణ్ణుడవై, వెలవెల పోవుచున్నావు, జరిగినది యైనను చెప్పవైతివి!"

"మరి చెప్పుట కేమియు లేదు. నన్ను మోసముచేసిన వానిని సాధించుటయే పని! అబ్బా! ఎంత సాహసము! ఎంత దుండగము!"

"నిరర్థకముతో మీ యాశ్చర్యార్థకములతో కాలము పుచ్చుచుంటిరే గాని నసాఫల్యంబుగ జరిగినది ప్రభు సముఖంబున నివేదింపక, మమ్ము వేదురుసేయ నేల?"

"ఛీ! తులువా, నీవు ప్రభు వైనంతమాత్రమున నాకును ప్రభువు కాజాలవు. నివేదించుట నీపని- నావలన నిరర్థకమైన దానిని నీవు సార్థకపరుపవలెనే గాని మరి యొండుచే కాజాలదు. ప్రశ్నార్థక మయియున్న దానిని నీవు బోధించుకొనజాలక ఆశ్చర్యార్థకమని నీవు పొరపడుచున్నావు. ఇంతకును నీవు నామిత్రునకు మంత్రివే గాని, నాకు మంత్రివి కావే! మరియు మిత్రుండవును కావు. నన్ను మందలించుటకు బదులుగ, నీ నాలుకకు బుద్ధిచెప్ప బ్రయత్నించుట యసమంజసము."

"మిత్రమా, యీ సారణునితో నీకు బనియేమి? హితము నాకుసేయ నెంచితివే గాని వానికి గాదు. కాని సీతను జూపెద నని కొండ నెంతో శ్రమపడి మెత్తి తెచ్చియు నయ్యది పైకిమెత్తి అందు సీత లేకుండుట జూచి, నీవును మావలెనే ఆశ్చర్యము నొందుట గాంచి, తానును విస్మయమున నేమేమో పలుకుచున్న మాటల నీ వింతదూర మాలోచించుట అనవసరము"

"నేనును, జరిగిన విఘాతములం గూర్చియే విస్మయమున నేమిబలుకుదు మన్నను నోరు రాక కారణ మరయ నాలోచించుచుండ, తానేమో కామిడిగాడ ననుకొని, వాఙ్నిపుణత

కనకొని, తా ననుకొనుచున్న తన వాక్చాతురికి వెరిగ్రిక్కు-
గున్నాడు. నే నలతి ననుకొనుచున్నాడే గాని, తనయట్టి వార
లు వేనవేలు నాకడ నూడిగము సేయుచున్నా రని యెఱుం
గడు."

వీరి సంభాషణ విని విని విద్యుజ్జిహ్వుంసను "వీరు పనము వదలి లోట్టలలో బడినారు. మరియు స్నేహభావమున నడుపబడవలసిన కార్యము వాగ్వాదనముతో నారంభింప బడినది. ఇది శుభసూచకమగునో కాదో" యని తన మానసమున వితర్కించుకొనుచుండెను.

"మిత్రమా, ఈ సంభాషణ మింతతో చాలించి, యేమి జరిగినదో తెలిసికొన నా మనసు తత్తరించుచున్నది—"

"సీతయు శాంతయు గూడి మందగమనమున, నింటికి మరలుచున్న సమయమున వారిని గాంచి వారిని సమీపింప బోయియు, వారిని సమీపించిన కొలదిని, అత్యధికమగా వేడిమిచే బాధితుండ నయి, యా యుష్ణతకు గారణ మరయ నెంచి, సీతా శాంతల వేరుపరుప దలంచి, యెంతో ప్రయత్నించియు విఫల మనోరథుండనై, తుదకు వా రిరువురినిం గూడ నరికట్ట దలంచి, ఈ కొండను దెచ్చి దీనిని గుల్లచేసి, దీనిచే వా రిరువురను గప్పి, తన్నివేశన సహితముగ గొని తెచ్చి, నీకడ నిల్పితిని. ఈ కొండ నెత్తినంతనే సీతాశాంతల జాడు ననియు, శాంత నావలకంపివేసి సీతను మనకడ నుండ నియమింప వచ్చుననియు దలంచితినే గాని, ఈ మధ్యకాలమునకే యెవరో లేచుపలిగా డింత లోనచ్చు నని తలంప నైతిని, ఈ దురాపద్వని బరిత్రాణింప దలపెట్టి యింత యాగడ మొనర్చిన అ

"ఏమీ, మైరావణుం డేగియు, నింత యైనదా?" అని మాల్యవంతు డెకసక్కెము చేసెను.

"మైరావణుండైన నేమి? వాని ప్రపితామహుండైన నేమి? ఇం దొకరి నన బ్రయోజనములేదు. విధాత జందె ములు ద్రుంచిన నన్నియు జక్కబడును." అని రావణుడు పలికెను.

"పాప మా తాత యేమి యొనర్చెను? మైరావణుండే పొరబడి సీత యున్న దనుకొని ఆ గుల్లకొండను గప్పి, నీకడ కరుదెంచి కార్య మొనర్చితి నని స సంభ్రమమున ఖరాలయమున నుండ, నా సీత సుగుణోపేతయు, సుశ్లోకయు, సురూపయు నని వినిన నే నా కన్నె మిన్నం గనులార గన నెంచి, పోయి, ఆకొండ నెత్తి చూతును-భరింపరాని జ్వాలాసన్నిభమైన వేడిమి-నిలువలేక పోతిని. జానకి లేదు గాని—మంట లే సంప్రాప్తమాయె గదా యని, చప్పున ఆ కొండ నటనే పడి మరల ఖరాలయమునకే మరల, నీ వట లేకుంట చూచి యే నట విశ్రమించి నిను సందర్శింప నిపుడరుదెంచితి" నని కుంభకర్ణుడు నుడివెను.

"అన్నన్నా! కుంభకర్ణా! ఎంత పొరపా టొనరించితివి? నీ శరీర స్థౌల్యములో, నీ యంగ ద్రాఘిష్టతలో, నీ యంగ దార్ఢ్యతలో, సహస్రాంశము మేధస్సు, బుద్ధికుశలత, లోకజ్ఞానము, పరేంగిత జ్ఞానము, నుండినచో, నీకన్న జయప్రద మగు జీవనము గల వ్యక్తి యింకొకటి సృష్టిలో నుండజాలదు. ఇంతకును విన్నన బ్రయోజన మేమున్నది? ప్రకృతి బద్ధము [illegible]న నీ యంగ దార్ఢ్యతయు, త దనుగుణమగు బుద్ధిమాంద్య

మును సహజము లయియుండ నిన్నేమన నేమిపని? కాని నా కార్యమంతయు నీవలననే భగ్నమయినది. సీతాలగ్నమానసుండగు రావణుండను విషాదాయుతుండయ్యానే యని విచారించుచున్నానే గాని, నా ప్రయత్నము నీవలన వ్యర్థమైనదే యని యెంతగా విచారింపలేను.”

“మైరావణా! నీ మాటలు నా కర్థము కాలేదు. నన్ను నిర్బంధించినావు. నాకు బుద్ధిమాంద్య మన్నావు. ఏమేమో చెప్పి చెప్పి ప్రకృతి బద్ధమన్నావు-నీకార్య మంతయు నావలన భగ్నమయిన దన్నావు- ఇందేదియు నాకు సుబోధకము కాలేదు.”

“ఇందర్థము కాకుండుట కేమియు లేదు. నే నిప్పుడు మాగధిలో మాటలాడ లేదు. సౌరాష్ట్రములో సంభాషించ లేదు. పైశాచిలో ప్రశంసించలేదు. సంస్కృత భాషలో కూడ మాటాడ లేదు. కేవలము మన మాతృ భాషలోనే మాట్లాడినాను. కుంభకర్ణా! సీతాకాంతలువనప్రాంతమున దిరుగుచుండగా చూచి, సీతను మాత్రము దే నేగియు, వారిని సమీపించిన కాలందిని, అపరిమితమా యుష్ణతచే నొండేమియు దోపక, ఒక కొండను దొలిచి, వారిపై గప్పి, మరి కదలనీయకుండ జేసి, నీయన్నయగా రావణు కడ కరుదెంచి, అప్పటికి నే జరిపినది దెలుప, నది విని, నేను మరలి వచ్చులోపలనే, నీవును అటు బోయి, ఆ కొండక్రింద నేమికలదో యని, అది యెత్తి చూచితివి-అందుండి జ్వాలాసన్నిభమైన వేడిమి బయల్వెడలిన తోడనే, నీవు కొండ నెత్తగనే, ఆ సందునుండి యెవ రెవరు తప్పించుకొని పోయిరో నీ కక్కర లేకనే, ఆ కొండ నిప్పటికి యు

"ఊహించ గలవేమో యని యడిగితిని." అని మాల్యవంతు డనుచు, "ఇపుడు జనకు డొనర్చుచున్న యాగము జూడ వీరందరును బోయి యుందురు" అని తా నూహించిన స్థితిని వెల్లడి చేసెను.

"యాగము జూడబోయిన నేమి, యజ్ఞము సేయబోయిన నేమి ? మన కేమి కావలెను ? నాకు జానకి దొరకు విధ మెయ్యది ?" అని రావణుడు తన యాందోళనము వెలిగ్రక్కెను.

"లంకేశ్వరా! నీకు కావలసినది సీత; మాకు కావలసినది సీతను దోడ్కొని రాగల నిరపాయమా నుపాయము. నీవు తత్తరించిన మాత్రాన నేమియు లాభము లేదు." అని మాల్యవంతు డనెను.

"ఆ నంతయు నిజమేగాని, తుద కెవరికి కావలసినది యూ లేదు." అని విద్యుజ్జిహ్వుడు సారణుతో నెకసక్కెముచేసెను.

"రావణా, నీ విపుడు తత్తరమున నేమి యొనర్చినను కార్యము సులభసాధ్యము కాజాలదు. నీ పన్నాగము వారికి కొంచెము అనుభవ మగుట సంపూర్ణముగ వెల్లడి మయ్యెను. కావున వా రిపుడు సర్వవిధముల దీవ్రమైన జాగ్రత్తతో నుందురు. కావున వా రిపుడు యాగము జూడబోయి యట నేమి సేయుచున్నారో పరోక్షమునను, అవసర మైనచో ప్రత్యక్షముగను బోయి చూడవలసి యున్నది."

"పోయి—?"

"చూడవలసి యున్నది."

"ఏమి చూడవలెను?"

"అక్కడి వారివారి స్థితిగతులు"

"చూచి—?"

"తదనుగుణముగ మనము ముందంజవేయ వలెను."

"కనుక నీవు నేమి చేయవలెను?"

"మనలో కొందర మిపు డటకు బోయి పరోక్షమున నుండి వారి ప్రతి కార్యమును వీక్షించుచు, మనము చేయ దగిన కార్యముల నెప్పటి కప్పుడే నిర్ణయించుకొనవలెను."

"అందు కెవ రెవ రవసరము?"

"కథానాయకుండ వగు నిను గూర్చి చెప్ప నక్కరయే లేదు గదా! నీ యనుచరులు నిన్ననుసరించ వలసిన వారే కద! ఇక దూరమున నుండదగినవార మే గద నేనును, పాతాళ లంకేశ్వరుండును— ఇం దిక రా రానివా రెవరు?"

"ఒక్క ననే యుండి నాటకము జూడదగిన వారలే గద మీ రందరును. ఇక మేమా—ఊఁ—"

"లంకేశ్వరా! ఇందు సంశయింప బనిలేదు. నీవు స్మరించిన మాత్రాన నీ యెదుట ప్రత్యక్షము కావలసిన వారము నేనును, నీ మిత్రుడగు మైరావణుండును. గావున నిక నీకు సహాయ సంపద కేమియు లోపము లేదు—"

"కావున ముందుగ మమ్మేమి సేయుమందువు?"

రావణుని యీ ప్రశ్నకు ప్రత్యుత్తర మొసంగబడక మున్నె నలువురు యనుచరులతో భయ భాషణములతో వచ్చి నారు: "అన్నా, 'అంతఃపురమున నేదో కలవరము కలిగి యున్న' దనియు, 'తా మొక్కసారి యక్కడకు దయచేయ వలయు' ననియు మండోదరి దేవిగారి మాటలుగా త్రిజట

నీవును సీతవేషమున నను నృత్యము నొనర్ప రమ్మనెదవు గాబోలు!"

"ఏమో, ఏ సమయమున కేమి పన్నగించ వలయునో, తత్తదనుకూలముగా కార్యమొనర్ప నగును. అందుల కవుడు గినిసినను, విసిగినను, మరి లాభము లేకుండుట యటుండ, మనకు ప్రమాదకరముగ గూడ బరిణమించును. అది యెల్ల నిపుడే యాలోచించి కార్యమునకుం గడంగ నగును. ఇంతకును కార్యసానుకూల్య నిమిత్తము, నిమిత్త మాత్రముగ మన యాచరణలయందు శ్రమత్తులమయి యందుమేని, యిక ముందేమియు దోసగులు పొసగ నేరవు. ఎట్టి పట్టుల నైనను, మున్ముందుగ దీక్షముగ నాలోచించి యాలోచించి, మరియు ప్రారంభింప నగు. తదనంతరము, తదనంతరమునం గల భిన్నావస్థలు భిన్న భిన్న కారణములచేత, మనకు కష్టతరముగ నున్నను సహనముతో కార్యదీక్షను నడిపించ వలసినదే గాని కార్య మధ్యమున విఘ్నములకు జంకి ప్రయత్నములు వీడరాదు."

"ఇక నీ యుపన్యాస మింతతో చాలునులే, ఇక నీ కార్యము నీవు నడిపించుట చూడవలసి యున్నది— కాని మ్మిక లెమ్ము." అనుచు రావణుడు స్వగృహోన్ముఖుం డయ్యెను. కడమ వా రందరును వాని వెంట నంటి యేమేమో ప్రసంగించుకొనుచు పోయిరి.





# పరిణయ విభ్రమములు

## ఇరువదియవ ప్రకరణము

## మాయలు

I

"కుశధ్వజా, రఘువంశజు లగు రామలక్ష్మణులును, పవిత్రుండౌ విశ్వామిత్రుండును, మద్విరచిత యాగము వీక్షింప నేతెంచి, నా మఖము ధన్యత నొందజేసిరి. నీ విపుడు వారి కడకు శతానందు నంపి మద్గృహ పావనార్థ మిటకు వారు దయచేయ బ్రార్థించి, వారిని దోడ్కొని రాజేయుము. అదియె మొదనుగ సీతయు వారిని జూడగలదు. సీతతోపాటు ఊర్మిళ, మాండవి శ్రుతకీర్తియుం గూడ రామలక్ష్మణుల జూడ నిరవగును" అని జనకుడు తన తమ్ముడగు కుశధ్వజుతో పలికెను.

కుశధ్వజుండును వల్లె యని యన్నకడ శెలవు గైకొని పోయెను.

II

"శ్రీరామచంద్రా, ఎంత పొరపాటొనరించితివి! ప్రతిదినమును నన్నుగూడ రమ్మని దోడ్కొని పోవుచుంటివే! అట్టి నీ వీ వేళ నన్నేల బిలువవైతివి?"

"మునీంద్రప్రియా, మిమ్మే కాదు తమ్ముని నైనను బిలువ లేదు. పింగళసి మాత్రము గొంచపోతిని. అంత చింతాకర

హా దురంతము సంఘటిలు నని నైన నెఱుఁగక పోతిని.”

“నావద్ద వేద పఠన మొనర్చు చుండిన పింగళుఁడు నీ వెంట నెటుల వచ్చెను?”

“అదియే కద మోసము?— బాణ తూణీరములతో, తనతో, నాటకు పిలచిన మాయపింగళుని, మన పింగళుఁగానే భావించి వానివెంట నంటి పోయితిని, కొంతదూరము పోయిన పిదప, తనకు చినతనమునాటి యాట యాదికి రా, తాను దొంగ ననియు, తనను పట్టుకొన నను గోరి చెట్లమాటున కరిగెను. వానిని కనుగొన నేనును బహుపరిశ్రమ జేసితినే గాని వా డెందును గానరాకపోవుటకు దోడు, దవ్వుల నుండి ‘శ్రీరామచంద్రా, చచ్చితి—చచ్చితి— ఈ న్నీ వెర్రియేనుగ తనకరమున బట్టి లాగుకొని వచ్చినది— దిక్కులేని వాడను-రక్షింపుము, రక్షింపుము- దిక్కులేని యంధయగు తల్లి, దక్షత లేని ముసలి తండ్రియు సుమా- అక్కడ నున్నవారికిని, నీ వెంట నంటియున్న నాకును, నీవ సమస్తము నని యనుకొని వచ్చితిని—రక్షింపుము,రక్షింపుము—’ యను నార్తనాదము పింగళు కంఠస్వనమున వినరా, విషాదమున వేదురునై, మె త్తి వానికి ధైర్యము చెప్పి, అభయ మిచ్చి, యా యార్త నాదము వినవచ్చిన తెన్నుకు వడివడి బరుగిడితిని. ఎంత దూర మేగినను, పింగళు డెందును గానరాడు. వెర్రియేనుగును గాన రాలేదు. కాని దూరమున నొక స్త్రీ స్వజనపరివృతయై నను గూర్చి స్మరింపుచుండ, యెవరది యని చూడ జానకీ స్ఫురణ వహించిన యా రామను సీతగా నెఱింగి సమీపింప బోవుచుండ, తత్సభీబృందమున నొక్కతె—తన వయస్యుం డగు పింగళుఁడు

వాఁ్రియేనుగచే పట్టువడ, తద్రక్షార్థ మేగిన రాముడా మద
కరి త్రిముచే నీల్గె—నని వాక్రువ్వ, నది యెంత వేగము సిద్ధ
మనుపబడెనోగాని—యొక పెద్దచితిలో బడి— శ్రీరామా, నీ
కొరకుగా ధరించిన యీ యువతాకారము, నీతో చెలిమి సేయ
నవకాశము లేమి, నింతటితో పరిసమాప్తి నొందించు చున్నాను
అనుచు భస్మ మగుట చూచి, విస్మితుండనయి, తత్సంరక్ష
ణార్థ మేగియు, చివరకు బ్రయోజనము లేమియు, తత్సభీబ్రం
చము వాపోవుటయు జూచి, నా మనసు నిలుపజాలక, రామా
మృతస్వాంతమైన యా రామ, రామనామము స్మరింపుచు, దివి
కేగ గన్నులార గాంచి మరి బ్రదుక నిష్టములేక, తత్సమీప
స్థలి నున్న యొక బండరాతిపై నెక్కి, తచ్ఛైల శిఖరమునుండి
నేలగూలినయైన నుసురుల దోలంగ నెంచి "నిరుపరాధియగు నొక
రాజకన్య- అందునను రామామృతస్వాంతయగు యన్నుమిన్న-
యొక్క మృతికి గారణంబగు దశరథరాముడు నేటి సూర్యుని
తో నిదె యస్తమించు చున్నాడు" అని బిగ్గరగ నొక యర
పరచి, తచ్ఛైల శిఖరము జేరుచుండ, సుమంగళీ తల్లజయగు
యొక మంగళాంగన యొక్కతె మరి యెందుండి వచ్చెనో
గాని, వలనుగ నా పాదములపై బడి, మరి ముందునకు గదల
నీయక— "ఓ రామభద్రా, సీత యగ్నిం బడి దగ్ధమాయె
నని, విభ్రమము నొంది, బేల వయి, ప్రాణముల వీడ నున్నా
వా? ఎంత మాయా మోహితుడవు? ఇదియంతయు మాయా
పుత్రా పలలాశనుల చర్య లంతియు కాని, సత్యములు కావు.
ఏదీ—యొక్క సారి వెనుదిరిగి చూడుము. ఏదీ నీ సీతా చితి!
ఇదియంతయు వట్టి భ్రమ! దుర్భ్రమ!" యని నాదు మొరక

దెలువ, "నీ వెవ్వతె" వని నే నడిగితిని. తానును, తా నహాల్య వనియును, తాను శిలారూపము (Stonification) నొందుటకు గారణంబును, తచ్ఛిలారూప విముక్తికి గతంబును నాకు విశదీకరించి, నే నా తావున బోవుట తన శాపవిమోచనార్థమే యనియు నేమేమో స్తుతిపాఠము లొనర్చి, తుదకు జక్కయూతుధాన జనము లొనర్పజాలని విభ్రమాకరములగు మోసములు సృష్టిలో నుండజాల వనియు, నిజమునా దోపజేయు విపరీత సంఘటనల నేర్పరింతు రనియు, నింకముందు గూడ జాగ్రత్తమెయి వర్తింప మే లనియు, నుడివి, నాకు సకల శుభంబు లొనగూరు గాత మని పెక్కు మంగళ వచనంబులు వలికి, మొ్రక్కి, తన తావునన దా నిలువ, మతి చెడి మిము సమీపింప నీ పింగళుండును తామును యిటనే యుంటు గాంచి నాలో నేనే సిగ్గిలితి."

"అన్నా, యెంత మనోవైకల్యతకు గారణము సంఘటిలినది! ఎట్టిడి కైనను కర్మసూత్ర మనుల్లంఘనీయముకదా!" అని విశ్వామిత్రు డనెను.

"శ్రీరామా! నీ మిత్రుడను, పింగళుడను, నే నిట నుండ, యింకొకడు తాను పింగళుడ నని నిను సమీపించి యింత లొనర్పగల సాహసు డెవ్వడై యుండ నోపు!" నని పింగళుడు అధిక్షేపించెను.

"ఆ పింగళుడు నీ బావమరది." అని లక్ష్మణుడు హాస్యము చేసెను.

వీ రిటుల సంభాషణ మొనర్చు చుండగనే శతానందుడు శ్రీరాము సమీపించి, విశ్వామిత్రునకు నమస్కరించి,

"ఆర్యులారా, శ్రీ జనకచక్రవర్తి పనుపరి నా శతానందుండను; నేటి యుదయముతోఁ బరిసమాప్తి నొందిన శ్రీ జనకచక్రవర్తి నిర్వర్తిత యాగమునకు తా మందరును కటాక్షించి, వీక్షించి న తమ తమ సద్భావంబుల బహూకరించి; శ్రీరామలక్ష్మణ దర్శన లాభమునకు వారిని ఆశీర్వదించి, విశ్వామిత్ర యాగ మునమునకు, వారికి నమస్కార సహస్రంబు లాచరించితి మనియు, మా చక్రవర్తి తన గృహంబు పావనం బొనర్ప మిమ్ము సాదరఁ దోడ్కొని రమ్మని నను నంపె." నని వాక్రుచ్చె.

అంత విశ్వామిత్రుండును, "జనకుని సందేశంబు సంభావ్యంబె యగు గాని, నేటికి మరి రా జాల మనియు రేపటి యుదయము జాముప్రొద్దునకు మించకుండ వచ్చి, సందర్శింతు మనియు నుడువుము." అని చెప్పి యప్పటి కాతని నంపివేసెను.

III

"మానికులావతంసమా, మీ యాశీః పరంపరానుగతంబున నా జన్మ పావనతం జెందినది! పవిత్రత మీ రాజపుత్ర సహితంబుగ మీర లిటకు విచ్చేయుటం జేసి మద్గృహంబు పావనంబైనది. ఇవె మత్కృతకృత్యతం దెల్పు విశ్వసనీయంబగు నమస్కార శతంబులు." అనుచు జనక చక్రవర్తి విశ్వామిత్రునకు నమస్కారము లాచరింప, శ్రీ రామ లక్ష్మణులును, "రాజబిడౌజా, మే మన్నదమ్ముల మాచరించు నమస్కారముల గైకొనుఁడు." అనుచు నా జనకునకు నమస్కరించి, యాశీర్వచనముల నొంది, నిలచియుండ, కుశధ్వజుండును, శతానందుండును, సమీపించి వేర్వేరు ఆసనము లలంకరింప, రామలక్ష్మణులు తొలుత శతానందునకును, పిదప కుశధ్వజునకును

సమస్కారము లాచరించి, తత్త దుచితాసనము లలంకరించి కొంతతడవు రాజ్యాంగ విషయముల ముచ్చటించి, దేశకాల పాత్రల గూర్చియు, నిమి వంశముల గూర్చియు, కొంతకొంత ప్రశంసించిన పిదప విశ్వామిత్రుని యాగ కారణముం గూర్చి ప్రస్తావన వశమున లంకేశ్వరుడు తనకు జానకినిచ్చి వివాహ మొనర్ప గోరుచు వ్రాసి పంపిన కమ్మం గూర్చి జనకుం డేమేమో పలుకుచు, మ్రుక్కడి రక్కసుల చేష్టల నెగ్గించుచుండ, విశ్వామిత్రుడు, "జనకా, నీ యనుంగు గూతు నాశించిన లంకేశ్వరుండును, త దనుచరులును, మిక్కిలి మాయావులు సుమా; నా కొనర్పు దుండగము లీడుతీయనిది—నీ వెరుంగనిది, కాకపోయినను మరల మరల జ్ఞాపకము సేయుచున్నాను. మారువేషముల నెన్నెన్ని పను లైనను చేయగలరు." అని యనెను.

"ఎన్ని చేసినను, పరమ పవిత్రులగు తాము పను గరుణించియుండ మా కేమి కొదువ ?" అని జనకుడనెను.

"తాము మమ్ము గరుణించియుండ—యనియనుచున్నావే గాని అది భ్రమ. ఒకవేళ నా రావణాదులే విశ్వామిత్ర రామ లక్ష్మణ రూపముల నిను సందర్శింప వచ్చి, యేమేని యుపద్రవము లాచరింప బోయినచో, నిక నేమిసేయగలవు ? నీవైన నేమి ? నేనైన నేమి ? మన మేమిచేయగలము ?"

"ఇపుడు తాము విచ్చేసి తమ సందర్శన మొసంగిరి గదా: ఇక మరల తాము దర్శన మొసంగు సమయ మిపుడే తమవలన నెరింగి, అట్టి యా తరుణమునకు పూర్వము వచ్చు వారిని మాయ విశ్వామిత్రాదులుగ నెరింగి వారిటకురా ద్రా

నైన నొసంగనీయను—” అని జనకుడు విశ్వామిత్రునకు బ్రత్యుత్తర మొసంగి, “ఇందు కేమందువోయి కుశధ్వజా !” అని తన తమ్ముని బ్రశ్నించి, “ఏ రానతిచ్చిన విషయ మెల్ల సవిస్తరముగ వింటివిగదా, శతానందా ! నీ యభిప్రాయ మే మి ?” అని యాతని సంప్రశ్నించెను.

శతానందుడు తన కేమి చెప్పుటకును పాలువోక, దిక్కులు చూచుచు మిన్నకుండెను.

కుశధ్వజుండును ఆ విశ్వామిత్రుని మోము బరికించి యున్నకుండెను.

ఈ రామలక్ష్మణులు చిన్నగవున నూరక యుండ, విశ్వామిత్రుడు మాత్రము, “శతానందా ! నీవు జనకు వంశమునకు బురోహితుడవు. నే నన్నో, లోకంపు బురోహితుండను. కావున నిదే చెప్పెదను వినుము. దస్యులు, యాతుధానులు, లోనుగాగల పుణ్యజనుల లిప్పట్టున, జానకీ లగ్న మానసుండగు లంకేశ్వరు పంపున సెన్నెని మాయలు, దుండగములు నొనర్ప నేర్పరులు. మేము వెడలిన వెనుక, ఆామే రామ లక్ష్మణుల మనియు, విశ్వామిత్రుండ ననియు, పింగళుండ ననియు బేరుపేరున వేశ్వేరు రూపధారులయి మిము సందర్శించి యెంతెంత యాగడముల నైన బన్నగించగలరు. కుశధ్వజుండును రాజ్యాంగ తంత్ర నిపుణుండు. ఆతనికి దెలియని తంత్రములుండవు. అలనాడు లంకేశ్వరుండంపిన జాబునకు బ్రత్యుత్తరం బొసంగ నాజాబు నాతనికి వంప, నీ కుశధ్వజుండును లిఖిత పూర్వకమైన బ్రత్యుత్తర మా లంకేశ్వరున కంపక, నోటిమాటలుగా నర్థముకాని పలుకులు పలికి యా సారణు నంపివేయ

లేదా! అట్టి పన్నాగము నెరింగినవాడే కద యీ కుశధ్వజుం
డును. కావున నందరును అప్రమత్తులరై యుండుట మం
చిది. ఇక మేము మా మా విడుదుల కేగుదుము. ఇక శ్రీ
రామ లక్ష్మణులు సీతను జూడవలసి యున్నది. మరి యాగ ప
రమార్థ మిదియే గదా! ఆ యాగ సమయమున నంతయు
నాందోళనమే యగుట నప్పటున నొండొరు నవలోకింపనైన
నవకాశము కలుగలేదు. కావున నిపు డామెను సందర్శించి వె
డలుదుము." అని విశ్వామిత్రుడు సూచించెను.

తక్షణము కుశధ్వజుండును రాణివాసముకడ కేగి క్షణ
కాలమున మరలివచ్చి, "నేటి సాయంకాలమున జరుగబోవు
యజ్ఞ ఫల సిద్ధ్యుత్సవముకొరకు పేరటాండ్రు సాహాయ్య మొ
నర్చుటకిపుడు శీత తైలాయు తాభ్యంగన స్నానము సేయు
చున్నందున సీత యిపుడిటకు రా సనువుపడదు. కావున నిపు
డుగాక నేటి సాయంకాలమునకు [illegible] తా మెప్పుడైనను
దర్శన మొసంగ బ్రార్థించుచున్నాను." అని కుశధ్వజుం డనెను.

"ఏమి కుశధ్వజా, నేరము నెరపుటకే నీ పన్నాగపు సా
మర్థ్యము బోలిన సమయస్ఫూర్తి కాదుగదా!" యని వి
శ్వామిత్రుడు కుశధ్వజు నుటంకించెను.

"అటుగా దటుగాదు?—మీ మెప్పుకొరకే యియ్యెడకు రా
వించితిమో ఆ కార్యమునకే, మేమే యవాంతరము గలిగింప
గోను సంతటి వెంగలులమా? అట్టిచ్ఛయంటికిని కానోపను."
అని కుశధ్వజుండు పలికెను.

"మునికులావతంసమా, ఇంతకును నేటి సాయంకాల
ము జరుగబోవు యుత్సవము జూడ దాముసు, యీ పుణ్య

పురుషులును గూడ విచ్చేయ సవినయమ్ముగ బ్రార్థించు చున్నాను. దశకంఠు కంట బడకుండ జానకిం గాపాడుట కె న్నని యుపాయాంతరముల దలంచిన మే మిపు డెన్నని శ్రీ రాము నపాంగ వీక్షణ మొక్క క్షణమేని మా జానకిపై బ డుగాక యని పెన్వేతల గుందుచున్నాము. కావున నీ రాజ పుత్రిల దోడ్కొని తా మీ సాయంకాలము దయచేయ ప్రార్థించుచున్నాను." అని కుశధ్వజుం డనెను.

అంతట నీ రామ లక్ష్మణులును, ఈ విశ్వామిత్రుండును జనకునికడ ననుజ్ఞాతులయి, తమ విడిదియింటికి పోవుచుం డ కుశధ్వజ శతానందులు వారిని కొంతదూరము సాగనంపి మరలివచ్చి తమ నగరు సొచ్చిరి. నేటి సాయంకాలము వారి సర్పగల కార్యమునకు దగు సన్నాహములు సేయుచుండిరి.

ఇక్ష్వాకు కుమారుండగు 'నిమి' గొప్ప చక్రవర్తియే గాక యుద్ధ నిపుణుండును, జయశాలియుం గూడ నయి యుండెను. ఈతని యన్న కుక్షి. ఈతని తమ్ముడు దండు డు. తన తండ్రి రాజ్యమగు ఉత్తరదేశమును కుక్షి పరి పాలించుచుండ, దండుడు వింధ్యపర్వతములకు దక్షిణదిశనున్న దేశాల జయించి, స్వాధీనపరచుకుని పరిపాలించుచుండెను. నిమి యు సింధునదీ పశ్చిమ ప్రాంతమును గెల్చి, తన రాజ్యము న చ్చటగూడ స్థాపించి, "బాబిలన్" అను పట్టణము గట్టించి, అచ్చటి వివిధ భాషల సంభాషించు వంశమ్ముల నన్నింటినిం గూడ సంకరపరచి, తుద కొక గొప్ప క్రతువు నెరవ నుద్యుక్తు డై, దేవునిం, గురునిం గూడ, నవమానపరచుటం జేసి, త త్కాల గురుండగు వశిష్ఠుచే శపితుండయి మరణంబు నొందె,

త దనంతర మాతని పుత్రుండు త త్కాలగురువగు వశిష్ఠునకు వశంవదుం డయి, సవిధేయుం డయి మెలంగుచుండెను. నీ వం శము మరల సుప్రసిద్ధతవహించి, మరల చిగురింపజేసికొనదలం చినచో, పశ్చిమదేశాలకుపోయి, యచ్చట వణిక్శాస్త్రము వె దజల్లుమని, యాతని నా వశిష్ఠు శాసించి నిరోధించెను. త దా జ్ఞానువర్తి యయి, యీతండును వణిక్శాస్త్ర మాయా దేశాల బోధించుచు, త చ్ఛాస్త్రమున కా దేశాన జనక సమానుండౌ ట త ద్దేశవాసు లాతని 'జనకు' డని బిలువ నలవాటుపడిరి. అతని పుత్రులును, త త్సంతానమునుగూడ జనకు లనియే వా డుకపడియుండ 'జనక' నామము పౌరుష నామమయ్యెను. తరు వాతి రాజు లెల్లరుం గూడ వణిక్శాస్త్రమునకు జనకులయి, ఆ కాలమునాటి వణిక్కుల యభినందనమునకు బాత్రు లయియుం డిరి. ఈ జనకులు (జనకు వంశమున జన్మించిన అందరు రాజు లును) తాము జయించిన దేశాలనెల్ల వాణిజ్యము ప్రవర్ధిల్ల జేయుచుండిరి. ఇంతియకాక, ఈ జనకువంశస్థులు పశ్చిమ దిశ నున్న 'బాబిలోనియా' దేశము మొదలు, పారసీక వియు త్త్రాగ్రిగుకము (Perssian Gulf), మృత సముద్రము (Dead Sea) మధ్య ధరా సముద్రము (Mediterranean Sea), ఈ జిప్టు (Egypt) ప్రాంతముల వాణిజ్యము వృద్ధిచేసి, హిందూ దేశమునుండి ఆఫ్రికాదేశమునకు సముద్రపు టోడల మార్గ ము నేర్పరచి, వణిక్ హస్తముల నిడి, వణిక్కులనే ఆ యోడ మార్గముల భద్రముచేసికొను మని వారికి బోధించి, వాణిజ్య ముతో పాటు వివిధ దేశాల పర్యటనంబునం జేసి, నాగరికతం గూడ బ్రవర్ధిల్ల జేసిరి.

అసీరియా దేశస్థులు (యూఫ్రిటీస్ టైగ్రిస్ నదుల నడిమి ప్రదేశవాసులు) 'ఫోనీషియనుల' (Phœnicians) ను 'అఖారు' (Akharru) అని పిలుచుచుండిరి. 'అఖారు' శబ్దమునకు పెక్కండ్రు విమర్శకులు (Critics) వివిధభంగుల నర్థము చెప్పుచుండిరి. కాని 'అఖారు' శబ్దము సంస్కృతోద్భవమైన 'క్షార' శబ్దమే యయి యుండనోపు నని దోచెడిని. సంస్కృతమున § 'క్షార' శబ్దమునకు గ్లాసు (Glass) అని యర్థము. కావున నీ 'ఫోనీషియనులు' క్షారమునె (Glass) అసీరియనులకు సప్లయి చేయుచు వారికి సహాయమొనర్చుచుండిరి కావున అసీరియనులు (Assyrians) -అసురులు (రాక్షసులు) వారి మాతృభాషయగు సంస్కృతమున, 'క్షార' మను పేర వాడబడుచుండిన శబ్దమునే యుచ్చరించుచుండిరి. ఈ ఫోనీషియనులే 'వైశ్యులు' అయి యుండిరి. అనగా నీ ఫోనీషియనులే ఇండియన్ వైశ్యులయి యుండిరి. ఆంగ్ల సాంప్రదాయానుసారముగ 'బైబిలు' గ్రంథము నవలోకించినను, హిందూ పురాణము

§ సంస్కృతమున 'క్షార' శబ్దమునకు 'ఉప్పు' అని కూడ అర్థముకలదు. ఫోనీషియనులు 'ఉప్పు' వర్తకము జరుపుచుండినటుల ప్రమాణములు లేవు. దక్షిణ హిందూదేశ మప్పటికి ఆర్యులచే జయించబడమిచే (రాము డప్పటికి లంకను రావణ వధ మొనర్పకుండుటచేత నున్నూ) సింధు దేశమున సముద్రపు ఉప్పు (Sea Salt) దొరకకుండుటచేత నున్నూ, లవణము (Rock Salt—సైంధవ లవణము) మాత్రమే ఉత్పత్తి యగుచుండుటచేత నున్నూ, ఫోనీషియనులు 'క్షార' మను వ్యాపారము చేయుచుండెడివారనినచో, ఉప్పు కాదనియును, గ్లాసు (అద్దము-కాచము) అనియు నర్థము చెప్పవలసియున్నది. మరియు నీ ఫోనీషియనులే గ్లాసును తొలుత దేశదేశాల పరివర్తన మొనరించునటుల దెలియుచున్నది.

ల్పవలోకించినను యిదే సత్యమని తేలుచున్నది.

బైబిలులో చెప్పబడినశబ్దము "నిమ్ రాడ్" (నిమ్ రాట్; నిమి రాజు-) 'నిమి'యై యున్నది. నిమియొక్క తండ్రి ఇక్ష్వాకుండు ను, ఈతని యన్నయగు కుక్షియుగదా. అక్లాట (ఇక్ష్వాకు— కుక్షి) యను నీ రెండు శబ్దములయొక్క పొరబడిన కలయిక శబ్దమగు 'కుకుక్షి' శబ్దముగా బైబిలులో వాడబడి యుండును. అట్లు కాదందురేని 'కుకుక్షి' శబ్దమునకు వ్యుత్పత్తి లేనే లేదే! కావున నీ ఫొనీషియనులను వర్తకులుగామార్చి వారికి పెక్కు సముద్రమార్గములు నేర్పరించి, వారి యధికారములలో వానిని నుంచి, ఆర్యరాజులకు ఈజిప్టుదేశము ముఖ్యదేశముగా జేసికొన జేసి, 'నైగారూ'యను నాతనిప్రాశస్త్యమున టైర్, సిడాన్, కార్పసిడా, సైసస్, కార్తజీనా, (Tyre, Sidon, Carpasida, Cnysus, Carthagena), మొదలగు వివిధ నామముల నిప్పుడు ప్రవర్ధిల్లి యుండిన పెక్కు ముఖ్యపట్నముల నిర్మింపజేసిన వారి జనకులే. కావున ప్రపంచమునకంతకును నాగరికతకును, శాస్త్ర జ్ఞానమునకును సకలసంపదలకును తొలుదొల్త నిలయమనియిప్ప టి (Critics) విమర్శకులువాకొనుచున్న "ఈజిప్టు" దేశము మన "జనకుల" చేతనే తొలుత పవిత్రతనొంది విమర్శకుల యభినందనములకు పాత్రమైనదని తెలిసికొన దగి యున్నది.

## IV

"నీ కంత యభిలాషయే కలిగియున్నప్పుడు నేటిరాత్రి యొకనాటకము ప్రదర్శించు నానందము పొందుదుము గాక!" అని శాంత యాలోచన చెప్పెను.

"ఏమి నాటకము ప్రదర్శించు మని నీ యభిప్రాయ ము?" అని సీత ప్రశ్నించెను.

"మరేమి నాటకము! నీ నాటకమే: 'జానకీ పరిణయ నాటకము'—" అని శాంత సలహా నిచ్చెను.

"నేను జానకీ పాత్రమే గైకొందును".

"ఔ నౌను—నాకును దెలుసును. జానకివౌ నీ వుండ వేరుగ నింకొకరుక జానకీ పాత్రము గైకొను నంతటి యావ శ్యకత యేమి? కాని శ్రీరాము పాత్ర మెవరు గైకొందురు?" అని శాంత ప్రశ్నించెను.

"శ్రీరాము పాత్ర గైకొన నింకొకరుం డుండనేల? శ్రీ రాముఁనే మన నాటక ప్రదర్శనము జూడ నాహ్వానించితి మేని, ఆతఁడే రాముఁడై నిలువగలడు." అని సర్వమంగళ సూచించెను.

"శ్రీరాముని దర్శన మభిలషింతునే గాని, శ్రీరాముఁడే శ్రీరాముఁడై నిలువ, జానకినౌ నేనే ప్రదర్శించవలసిన భాగము, సిగ్గుచే జయప్రదముగ జరుపజాల నను సంశయము కలుగు చున్నది. కావున శ్రీరాముని మాత్ర మాహ్వానింపవలదు."

"ఇది యెంతమాత్రమును సమంజసమౌ నాలోచనము కాదు. శ్రీరాముని జూడవలె నను నుత్సాహము నీ కెటుల నుండునో, నిను జూచు గోర్కెయు శ్రీరామున కంతమాత్ర మైన నుండకపోవని తలంతును".

"శాంతా, నీ వన్నియు పొందని కతల నల్లెదవే గాని, యేదియు నిదమిత్థ మ్మని యేర్పరుపవు."

"అంత సులువుగా తేలదగిన యంత సులభములౌ స్వ ల్ప విషయములు కావు. జానకీ రాముల యన్యోన్యావలోక

వమే మన నాటక ప్రదర్శన పరమార్థమైనచో, నా కార్యము
ససాకల్యముగ నెరవు తెన్ను జూడ వలసినదేగాని యింకొకటి
కాదు. ఇది సామాన్య కార్యము కాదు."

"గొడ్డలి సీటిలో నాను నను నూహావంటి దీర్ఘసూత్రు
ని పలుకులు వీడి ప్రస్తుత కార్యాచరణమునకు దగు నాలోచన
సత్వరముగ నాన తిమ్ము. నేటి సాయంకాలము మన మొనర్ప
వలసిన, యజ్ఞఫల సిద్ధ్యుత్సవమునకు పేరటాండ్ర నాహ్వానించు
కార్యమున కాలస్య మగుచున్నది."

"మరి యాలోచన కేమున్నది. సీత సీతయే: నేను
మాత్రము రాముడ నగుదును; తులసి తులసియే; సర్వమంగళ
సర్వమంగళ—ఇంకను తక్కింగల వారు వారే—ఇట్లే జరుగ
వలెను".

"అట్లయినచో మరి మాకు శాంత యేది?"

"ఇక నీ యిష్టముగాని, శాంతయున్న రాము డుండడు.
రాము డుండిన శాంత యుండదు— ఇందెవరో యొక్కరే
యుండగలరు. ఇంతకును శాంత యొక ముఖ్య పాత్రము కాదే!"

"శాంతయే లేకుండిన నిక నాటక మేమిటికి? శాంతతో
నే పనియంత యున్నది. ఇప్పటి కయినది యంతయు శాంతతో
నే జరిగినది. శాంతయే లేకుండినచో, మన మొన్నటి కొండచే
మనము గప్పబడిన యాపద గడతేరునా? ఇక ముందైనను
శాంత యెంతకథ నడుపవలసియున్నదో! కావున నిప్పటికి మనకు
దుర్లభులా శ్రీరామచంద్రుని పాత్రము కైకొను వారు లేకున్న
మానెగాని, శాంతలేని నాటక ప్రదర్శన మంత రసవంతము
కాజాలదు."

"శ్రీరాముఁ డుండనిదే, సీత యేమి ప్రదర్శించగలదు?"

"శ్రీరాము సమక్షమున సీత మాత్ర మేమాత్రము మాట్లాడగలదు? శ్రీరామ దర్శన కుతూహలత సీతకు కలదే గాని, సీత యేమి మాటలాడగలదు!" అని సీత స్థిరపరచెను.

"సరియే— మనము మన పాత్రలనే గైకొని నాటక ప్రదర్శన మాచరింప సంసిద్ధులమే కదా." అనుచు శాంత సిద్ధాంతపరచెను.

"అట్లొనర్చుటే యుక్తియుక్తముగ నున్నది." అని సీత యొడంబడెను.

"సరియే కాని— మన మిపుడు పేరటాండ్రఁ బిలువఁ బోవలసియున్నది." అని తులసి యనెను.

ఇట్లు సంభాషించుకొనుచు సీతాశాంతలును తులసీ సర్వమంగళలును పౌరస్త్రీ జనము నాహ్వానించుకొరకేగిరి.

V

"ద్వారపాలకా, శ్రీరామలక్ష్మణ సమేతుఁడై విశ్వామిత్రుఁడు వచ్చియున్నాఁడని, చక్రవర్తి కడ నివేదింపుము"

"చిత్తము—" అనుచు ద్వారపాలకుఁడు జనక చక్రవర్తి కడ కరుదెంచెను.

* * * * * *

"మునీంద్రమా, వీరును సూర్యవంశపు రాజులే గద్? వీరికి జనకనామ మెట్లువచ్చినది?"

"ఈ సూర్యవంశమునకును మీ సూర్యవంశమునకును కూటస్థుఁ డొక్కఁడే యిక్ష్వాకు సంతతివారలే వీరందఱును

మీా కుల గురుండగు వశిష్ఠు పెట్టిన భిక్షచే, ఇక్ష్వాకు పుత్రుండగు * 'నిమి' పుత్రుడు యీా పశ్చిమదేశ వాసులకును, ద్వీపాంతర వాసులకును వణిక్శాస్త్రము బోధించుచు, తచ్ఛాస్త్రమునకు జనకు లౌట, 'జనక' నామ మన్వర్థమయి తద్వంశస్థులందరును జనకులైరి. అట్టి జనకులలో నీ జనకచక్రవర్తి యొకరుండు." అని విశ్వామిత్రుడు నుడివెను.

ఇంతలో, ద్వారికుండును, శతానందుండును, కుశధ్వజుండును, వడి వడి నరుదెంచి, విశ్వామిత్ర శ్రీరామ లక్ష్మణాదులగాంచి, శతానందు డేమియో పలుకబోవ, కుశధ్వజుండును ముందునకు వచ్చి, విశ్వామిత్రునితో, "మునీంద్రమా, ఇది యు యదను కాదు. క్షమించ గోరుచున్నాను. ఇంతకు పూర్వమొకింత వెనుక, తాము దయచేసి యుండినచో, నంతయు చక్కగ జరిగియుండును. సీతాశాంతాదు లిపు డిపుడే పేడ టాండ్రి బిలువ బోయిరి." అని యనెను.

"ఏమి కుశధ్వజా, నీ మాటలు నాకర్థము కాలేదు. సీతా శాంతలతో మా కేమి పని ?"

"ఏ మట్లంటిరి ?"

"మరియేమి? సీతా శాంతలతో మా కేమి పని ?"

"మరెందులకై మీా రాక!"

"ఏమేమీా? ఎందులకా మా రాక? మా రాక యెందులకని ప్రశ్నించు నంతటి మూర్ఖత యలవడినదా? నీవును శతానందుండును స్వయముగ వచ్చి జనకు నానగా, మము నాహ్వానించుట యింతలోనే మరచితివా?" అని విశ్వామిత్రుడు తీక్ష్ణ

* (బైబిలు పరికారము 'నిమ్‌రాడ్' అనగా 'నిమ్‌రాట్'=నిమిరాజు)

దృశ్యల జూచుచుండెను.

కుశధ్వజ శతానందులు యేమియుం దోపకనో యన మిన్నకుండిరి.

"ఏమి కుశధ్వజా, మాటాడవేమి? ఏడీ జనకుడు——?"

కుశధ్వజాదులు మాఱు మాటాడ లేదు.

"దౌవారికా, శ్రీరామ లక్ష్మణ సమేతుడౌ విశ్వామిత్రుడు వచ్చియున్నాడని మరియొక సారి యాతనికి నివేదింపుము——పొమ్ము——"

దౌవారికుండును నేలచూపుగాని కుశధ్వజు దెస జూచుచుండెను. శతానందుడు విస్మితు డయ్యెను.

కన్నుల నిప్పులు గురియ, కంపిత దేహుడై, అరుణ ముఖుడై, విశ్వామిత్రుడు, "ఏమి కుశధ్వజా, నీ చర్యలు వింతలు-నీ పలుకులు అనుమానాస్పదములు——నీ చూపులు క్రూరములు——నీవు సగౌరవమ్ముగ నాతిథ్యమిచ్చి మాతో సంభాషించుటకు మాఱు మము జూచిన యంతన నిది యదనుగా దనియు, మేము సీతాశాంతల కొఱకే యిటకు వచ్చితిమని యనుచు, తద్దోషమాపాదించుచు, సీతాశాంత లింట లేరని చెప్పి, మరి పలుకక బెల్లము కొట్టిన రాతిరీతి నీళ్లు నములుచున్నావే? ఇది నీ మోటు తనమా? స్వతంత్రమా? ఒరుల నవమాన మొనర్చు నీ స్వభావమా? ఈ మౌనముద్రకు గారణ మేమి? ఏబు శతానందా, వీరికి నీవు బురోహితుండవేమో! ఈ వంశమునకు బురోహితుండ వయ్యును, వీరి హితమును గోరువానివలె గానరాకున్నావు. నీవును బలుక కున్నావే! మీామీా చర్యలు, మీామీా ప్రవర్తనములు, విరోధాభాసాలంకార యు

త్రములై యున్నవి. ఏమేని విశేషములు పరివర్తింప బడినవా ? చెప్పరేమి? అస్మదాగ్రహానల జ్వాలల కింధనములు కా గోరు చున్నారా?—కాని మ్రొక్క జూచెద గాక, మీ మీ నైజ మనవులు!" అని గద్దించెను.

"ఏమో గాని, ఇపు డంతయు మాయగ దోచు చున్నది. విశ్వామిత్ర రామలక్ష్మణ పింగళు లింతకు కొంచెము పూర్వమే వచ్చి దర్శన మిచ్చి, సంభాషించి సీతను జూడ నభిలషించి, నను వ్వడమి సాయంతనము మరల వత్తుమని చెప్పి తమ విడిది కేగియుంటిరి. ఇపుడు మరల తాము విచ్చేసిరి. మా సంభాషణా వశమున, తామందులకు రాలేనట్టును తమ కా విషయమే తెలియనట్లును సూచించు చున్నారు గాన ఇప్పటి తమ దర్శన మనుమానమునకు గారణ మగుచున్న దిదే మని సంశయించు చున్నామో సంయమీంద్రా!"

"ఏమేమీ, ఇపుడు మా రాకయే మీకనుమానాస్పదముగా నున్నదా?" యని విశ్వామిత్రు డొకింత విసుగు గనపరచి, యొకయింత స్మృతి నభినయించి, తన దూరదృష్టి, దూరశ్రవణాది యలభ్యశక్తుల నుపయోగించి, పరిశీలించి, "శతానందా, మీరెంత మోసము నొందిరి! ఇంతపాటి స్థితికే మోసగిలితిరే, ఇకముందు మీరు భరించగలరా యను చింత నను బాధించుచున్నది. అన్నా! ఎంత ప్రమాదావస్థ దటస్థమయినది! ఇక మీ మానసము లనుమాన పూరితములే గద—బద్ధమును నబద్ధమునుండి మరి వేరుపరుప జాలరు. ఇక మరి మీరు ముందంజవేయ జాలరు. ప్రతిపదమును మీ కిక బంధక మేయగును. ఆలోచించిన కొలదిని నా కేమి దోచుచున్నదో వింటివా శత

ధ్వజా, తుదకు జానకిని రాము రూపధారియగు రావణుని కిచ్చి చే సేతగా వివాహ మొనర్చుటో, కాని నా డాతడే సీతను మోసగించి యెత్తుకొని పోవుటో దటస్థించెడి, నని దోచు చున్నది.” అని విశ్వామిత్రు డనెను.

“యువరాజా, వింటివిగదా, ఇందేది మోసము?” అని శతానందు డడిగెను.

“ఏమేమీ—నే నింతదూరము చెప్పినను తుదకు నా పలుకులే అనృతములుగను, మాయావుల పలుకులును, చేష్టలును, మీకు సత్యములుగను, సత్కార్యములుగను దోచుచున్నవిగా: తత్ఫలము నందెదరుగాక!” యను నాగ్రహ సూచకములౌ పలుకులు వలికి, విశ్వామిత్రుడు కుపితుడై స్వదేశాభిముఖుండయి, “శ్రీరామా, మన కిక నిట తావులేదు వీరు రావణరాము మాయలలో జిక్కిరి. ఇక వీరికి, గతియు నావయు లేదు. మన మిక నిట నిలరాదు. మన వచ్చినపని యాగము వీక్షించుటయ గదా! ఆ పని నిర్విఘ్నముగ జరిగినదిగదా! ఇక జానకీ పరిణయ విషయమా—ఆ పరిణయము వారొనర్చుకొనగలరు—రాము రూపధారియగు రావణుడే వచ్చి పెండిలి యాడగలడు. ఇక మనకా యుత్తరకాండతో నిపుడు పనిలేదు. ముం దెట్లు కానున్నన ట్లగును.” అని యనుచు పోబోవుచుండ, విశ్వామిత్రు నాపి కుశధ్వజుండును, “సంయమీంద్రమా, మీరు నుడివిన దంతయు సమంజసమగుగా గాక, గాని ఆ విశ్వామిత్రు రూపమునకును తమ యాకారమునకును లేశమపి భేదము లేదు. రామలక్ష్మణులమాట మరి చెప్పనక్కరయే లేదు. ఇక నీ పింగళుడో: అభేదవృత్తియే— కంఠ స్వనములు మాటల దలపెట్టి

వక్కారయే లేదు. ఇట్టి పట్టుల నేయదగిన కార్యము పాలుపో కున్నది." అని విశ్వామిత్రునితో నని, శతానందుని చెవిలో నేమో చెప్పి, యాతని నంపివేసి, "మునీంద్రమా, మనము జనకుని గూడ నొకసారి చూడబోవుటయే యుచిత మని దలంతు" నని విశ్వామిత్రి రామలక్ష్మణులం దోడ్కొని, జనకు నగరునకుం దోడ్కొని పోవ, జనకుండును, "మునీంద్రమా, ఇవె మత్కృత నమస్కారంబులు గైకొనుడు, శ్రీరామచంద్ర లక్ష్మణులారా, అనేక వేదోక్తాశీఃపరంపరలు; ఈ యాసనము లలంకరింపుడు. మునీంద్రమా, మాయావుల చేష్టలం దగులు వడి, నా మానసము డోలాందోళిత మయి యున్నది. నిజ రాము నేర్పరింప దెన్ను దోపకున్నది. జానకీ పరిణయము జరుపు మార్గము దెలియకున్నది. దమయంతీస్వయంవర సమయమున ఇంద్రాదుల నలురూపములచే భ్రమజెందు సమయమున దమయంతి సరస్వతీదేవిం బ్రార్థించి, నిజ నలు రూపము నెరింగిన కథ నెంతకాలమున కైనంగాని మరువజాలను: అట్లు గాక, మాయ రాముని నుండి నిజ రాముని వేరుపరుప గల అపాయము లేని యుపాయము జూప వేడుచున్నాను." అని వేడుకోలుగా పలికెను.

"ఇంత స్వల్పకార్యమునకే యింత యాలోచన సేయుట గోట జిమ్ముదాని గొడ్డంట గొట్టంగవలసి వచ్చుటయగా నూహింతును. మీ యింటి ముంగిట నెంతకాలమునకో వెనుక నుండియు బడియుండిన శివుని విల్లు నెత్తగలిగినవాడు తొలుత శివుండును—ఇపుడు శ్రీరాముండును మాత్రమే— కావున జానకీపరిణయమ్ము కొరకు తత్స్వయంవరమే చాటించి, యు

విలు నెక్కు వెట్టిన వానినే మా జానకి వరింపగల దను వార్త దేశదేశాల నెరపినచో, రాజు లందరును రాగలరు: వచ్చిన వారిలో శ్రీరాము రూపము దాల్పగల సామర్థ్య ముండిన వా రుండగల రే గాని, తద్భుజబలమును, తద్వీర్యమును జూప జాలినవారికి న భూతో న భవిష్యతి—కావున శివునివిల్లు విరచుట (వంచుట, యెక్కిడుట, విలుత్రాటిని వింటి చివరలకు దగిలించుట) యను 'శోధన' ('పరీక్ష'-'ప్రమాణము'-'మచ్చు') వలన నిజరాము నెరుంగ గలుగుదుము. ఇంతకన్న మిన్నయా మార్గము సున్న. అపు డా విలు నెక్కు వెట్టగలవా డగు రామునే మా జానకి వరింపగలదు. ఇదియే నిర్గమింప దగిన మార్గము."

"మునికులసత్తమా, మీ మాటలు మంత్రంబులు: మీ నుడులు వేదములు: మీయానతి నతిక్రమింపదగదు. కాని యింతవింత జరుగు నని నే ననుకొనలేదు. ఇదివరకు వచ్చినవారు రాము కారని తమ పలుకులవలన దేలినది. వారు మము జూడ వచ్చినపుడు, 'రాక్షసులు రామలక్ష్మణ విశ్వామిత్రి పింగళి రూపధారులై మిము జూడవచ్చెదరు సుమా; అట్టి వారిని జూచి, మమ్ముగా నెంచి, మోసము జెందెదరు సుడీ! భద్రము, భద్ర' మని చెప్పి చెప్పి మరీ వెడలిరి. అన్నటులే యిపు డిటకు మీరుచు దయచేసిరి. సీతను జూడ నెంచి, యామెను మదాస్థానమునకు దెప్పింపు డని కోరిరే గాని, అప్పటికి వీలు కాము నటుల జరుగ ననువుపడలేదు. తుదకు మీరా వారా నిజ రామాదు లను సంశయము గూడ గలిగించిరి. ఈ పింగళుని రూపము గూడ వారితోపాటు జూచితిని."

"అఁ—ఏమేమీ! నారూపము ధరించిన మూర్ఖుడెవడు?

అట్టివాడు నా తలిదండ్రులకు బరిచర్య సేయునా? ఈ రామ లక్ష్మణులతో పాటు నావలె పాట్లు పడునా ? పండిన చోట బం డకయు, నుండినచోట నుండకయు, నా వలె దిర్గునా? ఎవ డయ్యా, వాడు? ఇక నాకు రావలసిన భత్యములు రానే లే కొని మరి నాకు దక్కనీయడు గాబోలు అన్న! ఎంత మో సమాయె!!" అని పింగళుడు విచారించెను.

"నీ విచారమున కేమిగాని, యిపుడు జరిగిన 'తప్పాల తమాషా' నీకు సుబోధకము కాలేదు- పోనీలే- ముందు జరి జూచుకొనవచ్చును; కాని, జనకా, యిపుడు మనము చేయ వలసిన దేమియు లేదు. ఇప్పటికి మేము మా విడిది కేగుదు ము." అని విశ్వామిత్రుడు నుడువ, జనకాదులు విశ్వామిత్ర రామలక్ష్మణాదుల వీడ్కొలిపి మరలివచ్చిరి.

## VI

వైవస్వత మన్వంతర పంచమ త్రేతాయుగ చతుర్థ భా గమున 30,000 వ సంవత్సర మగు సౌమ్య సం॥ మాఘ బ॥ ౧౪ (చతుర్దశి) దివసమున జనక నిర్వర్తిత యజ్ఞమున కాహ్వానింపబడిన రాజు లెల్లరును యిపుడు మిథిలా నగరము నకు వచ్చియుండుటం జేసి, త ద్రాజలోకమెల్ల వెఱుంగునటుల జనకునాన జాంఘికు డొకడు యిట్టుల సాటించెను.

గీ॥ వినుఁడు, జనులార, ఘనులార, ♦ వీరులార,
సమయ మిదె వచ్చె మీ బల ♦ శౌర్యములకు
మేము వినలేదు; కనలేదు; ♦ మే మెఱుంగ;
మునిన లాభంబులేమ న ♦ త్యము వినుండు.

సీ॥ ఇక్ష్వాకు కులమున ♦ నృపమండనుం డగు
"నిమి" చక్రవర్తి నా ♦ నెగడు నొకఁడు
అతని సంతతివార ♦ లనఘులు "జనకులు"
వారిలో నొక్కఁడు ♦ పావనుండు
జనకుఁ డన్ భూపుండు ♦ తన కుమార్తెకు స్వయం
వరమును జాట నన్ ♦ బంచె నిపుడు;
శూరులారా, రణ ♦ ధీరులారా, మహా
వీరులారా, రండు ♦ పెండ్లియాడ

గీ॥ దక్షుల రాజుల కిదె సమ ♦ యంబు వచ్చె;
పందె మున్నది; చివికిన ♦ పాత విల్లు
విఱిచినం జాలు; మా సీత ♦ పెండ్లియాడఁ
దరుణ మియ్యది గోల్పోవఁ ♦ దగదు మీకు.

కంద॥ అల త్రిపురాసురు ♦ లలఘు బలాఢ్యుల్
చెలఁగి జగంబులఁ ♦ జేడ్పడఁ జేయన్
అలిగి మహోగ్రుం ♦ డా శంభుం డీ
విలు చేకొని వారల ♦ పెంపణఁచెన్.

చం॥ త్రినయనుఁ డా సురారుల వ ♦
ధించిన పిమ్మటఁ గార్ముకంబు నా
జనకుని తావునన్ విడిచె; ♦
జానకి యాడుకొనం దలంచి యా
ధనువును చేతఁబూని పలు ♦
తావులఁ ద్రిప్పెడి దక్కతంబునన్
వినుఁడు, బలాఢ్యులీ చిఱుత ♦
విల్ దునుమాడిన వాఁడె భర్తయౌ.

'జానకీ-తడవగుచున్నది—రమ్ము' అని బిలువ మెరుక సానిని సవిరాపించుచున్న నామె యొకసారి వెనుదిరిగి చూచియు నా మెరుకను సమీపించెను. అటుల సమీపించి నిలచిన తోడనే ఆ యెరుకసానియు నిటుల సోదె చెప్ప నారంభించెను.

ద్విపద॥ భవుప్రాణేశ బద్మసం • భవు రాణిఁ దలఁచి,
పువుబోణి భక్తితో • మ్రొక్కు లర్పించి,
సఖి నీదు హస్తంబుఁ • జక్కఁగాఁ జూచి,
అఖిల కాంక్షలు దీఱ • నాశీర్వదించి,
నీకు సోదెలఁ జెప్పి • నీరేజనేత్రి,
కోకలం గైకొందుఁ • గోకారివదన,
చీర లీయవె నాకు • సింగార మొప్పఁ
గోరిక లీడేరు • గోరిన యంత;
బొట్టెఁ జేడ్వకయుండ • బొట్టె డన్నంబు
పెట్టి బట్టల చాలఁ • గట్టగా నీవె.
నలువ వ్రాతయుఁ దప్పు • నా సోదె దప్పు,
దలివేణి వాణికి • నాత్మీయురాల
దుర్గకు సతతంబు • దోసిలిం గూర్తు,
భర్గుని కరుణచే • వరములం గొంటి;
మాళవ నేపాళ • మళయాళ గౌళ
చోళ కర్ణాటాది • శుద్ధాంత కాంత
లేఁ జెప్పు సోదెకు • నెవ్వేళ మెచ్చి
పూజింతురే నన్నుఁ • బూబోణి వింటె,
పడతి నామందుల • భక్షించె నేని

బాల! శకుంతలని ♦ పగిది నే కెత్తె
మునులు రాజులు నిన్ను ♦ బోధింప నున్నారు.
వనజేక్షణా, నీకు ♦ భయము లే దింక
నామాట లాలింపు ♦ నారి చిన్నారి
నీ మోముఁ బై కెత్తు ♦ నీలాబ్దవేణి
వనిత, దుష్టుల కంటఁ ♦ బడకుండ నెపుడు
మునులు రాజులు నిన్నుఁ ♦ బోధించుచున్నారు;
కంటికి ఱెప్పవై ♦ కాంత యొక్కరిత
అంటి నిన్ వెన్నాడు ♦ నామె నీ సఖియు;
వైరు లెందఱో నిన్ను ♦ వాంఛించి యకట
మారువేసము లూని ♦ మలయుచున్నారు
ఎవ రెన్ని చేసిన ♦ నే కీడు లేదు
ఉవిద మేలౌ నీకు ♦ నోర్మితో నున్న;
భవ చాపమును వంచు ♦ వాఁడె నీ మగఁడు
పువుబోణి నీ యిష్ట ♦ పురుషుఁడే వంచు;
పాకారి పూజిత ♦ వాణి శర్వాణి
నీ కోర్కె లీడేర్ప ♦ నే సన్నుతింతు.

"ఎరుకసానీ, నీ వింత సేపును కష్టపడి నా భూత భవిష్యద్వర్తమానముల దెలిపితివి. గాన, నీకు దగిన పారితోషిక మీయ జాలకపోయినను, యిప్పటికి నే నొసంగ గలిగిన యుపాయన మిదియె" యని, దాసి కొని వచ్చు చున్న కదళీ ఫలములలో గొన్ని తీసి యా యెరుక సాని కిచ్చి యామె నంపి వేసి పటువేగమున మరల తన స్వజన బృందమును జేరెను.

"సఖీ, తులసీ, ఎంత సేపు మము నిలువ బెట్టితివి? నీ

చేయి జూపించుకొని వచ్చితివా?" అని సీత యనెను.
"ఆఁ—నా చేయి చూపించిన తోడనే, నేనే నీ వని యనుకొని, నీ చరిత్రి యంతయు నేకరువు పెట్టినది."
"నీ వెవరో తెలిసికొన జాలక, నినుజూచి, ననుగూర్చి చెప్పిన యెరుక యెంతవరకు సత్యమగును?" అని సీతయనెను.
"పోనీలే; ఏమియు వ్యతిరేకముగ జరుగునని యన లేదులే!" అని తులసి యనెను.
"అదిమాత్రిము సత్య మెట్లగును?" అని జానకి పలుకుచు, పేరటాండ్రి నాహ్వానించు కార్యము పూర్తియగుట స్వజన బృందముతో స్వగృహోన్ముఖ యయ్యెను.
"సత్యము కాకేమి? జానకి వ్యక్తిని పొరబడినదే కాని, జానకి యెడ సన్వర్థమగు విషయము లెట్లసంభవము లగును?"
"అట్లయిన నేమి చెప్పినది?"
"నీవు కోరిన వరుడే శివుని ధనస్సు నెక్కువెట్టి యు[?] సీత [illegible] పరిచిన నెరపి నిను పెండ్లాడ గల డని దెలిపెను" అని తులసి పలికెను.

## VIII

"ఏమోయి, యిప్పటికి కథ యెంత వరకు నడచినది?"
"నడచుట కేమున్నది? మన మందరమును కలిసియే వెళ్లియుంటిమి కదా, జనకునింటికి! అప్పుడు వారికిని మనకును సంఘటిలిన సమావేశకారణమున వారి మనస్సుల సంశయ మంకురించి, రామలక్ష్మణ విశ్వామిత్రాదులను నిజజనులుగా నమ్మక, అనుమానించి, కొంతసేపు చర్చ జరిగినదట. అప్పుడే సీతపేరటాండ్రి బిలువ నేగుచున్నదని దెలిసికొని, [illegible]

స్పర్శనా సుఖమైన లభించుగాక యని యెంచి, మెరుకసాని వేషమున నేగితిని.”

“అన్నా తొందర పడితివే! అట్టి ప్రయత్నమున తత్పూర్వ ప్రయత్న మేమియు నీవుచేసి యుండలేదు గావున, నీవు విఫల మనోరథుండవయి యుందువు.” అని తన యనుమానము మాల్యవంతుడు వెలువరచెను.

“ఎప్పుడును నీ మాటలు చల్ల చుక్కలును, సున్నపు పిడతలును అయియే యుండును. నా మనోభీష్టము నెరవేరు నుపాయమును, తత్క్రియాసిద్ధి ప్రదాయకమగు నూహలును, నీకు జనింపవు. నా యెడ మైత్రి నెరపుచు శతృత్వంబు సాధింపుచున్న జ్ఞాతివి; వైరివి; కోసి పారవేయగ రాని రణమవు; కుమతివి; అరివి; నీవ్రో బ్రసంగించుటే అశుభ సూచకము; ప్రమాదకరము.” అని రావణుండనెను.

“కరాగ్రి, అటుగాదు; నా మాటల జక్కగ బోధించు కొన జాలక పోతివి. నీ శ్రేయోభిలాషిని నేను. అది యెరుగ కున్నావు. యెరుక సాని వేషమున బోయి జానకి కరస్పర్శన సుఖమ్ము నెన బొంద నూహించు చున్నానని యైన మున్ముందుగ దెలియ జేయక పోతివే! అది జయప్రదముగ, నిరవనాక ముగ, నిబ్బరముగ నెరవు మార్గము జెప్పి యుందునే యని యంటి: నంతె గాని మరి యొకటి కాదు. అట్టి కార్యమునకు, తత్పూర్వ ప్రయత్న మేమాత్రమును జరుప కుండ గడంగుట, నేమేసి పొరబడి యుందువేమో యని శంకించుచున్నాను”.

“ఏ పొరపాటును జరుగలేదు; నీవు శంకించు చుండుట నీకు పరిపాటే. మరి నీ కుశ్శంకలకు తావులేదు. ఆమె కరస్ప

ర్శనము జేసి తదానందము నొంది, మరీ మరలి వచ్చితిని. ఇంకేమి సాడ్డులు పెట్ట గలవు ? మరేమి వంకలు దీయగలవు?"

"నే నట్టి వంకలు పెట్టుటకును సిద్ధముగా నుండ లేదు. కాని నీవెవరి హస్తమును స్పృశించి, సీతయని భ్రమ పడితివో యని నేను సంశయించు చున్నాను."

"నీ కట్టి సంశయమును అక్కఱలేదు. ఆ పని పూర్తి యై పోయినది. ఆ పై పని యేమి చేయవలెనో యాలోచింపుము." అని రావణుం డనెను.

"ఆ పని పూర్తి యైనదని నీ వనుచున్నావే గాని అది యెంత వరకు పొరపాటు కాకుండ జరిగినదో తెలిసికొన వలసి యున్నది."

"ఏ పొరపాటును లేదు——"

"పోనీ కాని——జానకి యేదో ప్రతిన నూనినదని యొక వదంతియు, తత్సంబంధ మగు నొక చాటింపును, జరిగె నని యు వింటిని. నీ కేమేని దెలిసినదా ?"

"ఆఁ——ఈ మాటల సందడిని చెప్ప మరచితిని. జనకునింటి ముంగలి యజ్ఞ వాటిక సమీపమున పడి యుండిన యొక చిప్పకు విల్లు నెవ డెక్కు వెట్టిన వానినే తన జానకి వరించు నని, జనకుడు చాటబంచెను."

"అన్నా! చిక్కు దెచ్చి పెట్టి నాడే జనకుడు!"

"ఏమీ, ఇదియును చిక్కే యగునా? ఆ చెదపట్టి యుండిన చిప్పకు విల్లు విరచుటయు నొక చిక్కగునా?"

"అది చిప్పకు విల్లను కొంటివా? ఆ వి ల్లెవరిది యనుకుంటివి? ఆ వింటి మహిమయు నీ వెఱుగకయు గదా యిట్లు

కొనుచున్నావు!”

“ఆ వింటికి మహిమ మొకటియా ?”

“ఆ మహా మహిమము నీ వెఱిఁగి యుండుటకు వీలు లేదు. నీవు మొన్న మొన్నటి పసికూనవు. ఈశ్వరుఁడు త్రిపురాసుర సంహార మొనర్చిన కాలము నాటికి నీవు జన్మింపనే లేదు. అట్టి పట్టున నీ వా కార్ముకపు మహిమ మెఱుంగుట యెట్లు సంభవ మగును? ఇంతకును నీవా వింటి నెక్కిడు ప్రయత్నమైన సలుపకుమా! జానకి నీకు లభించు మాట యటుండ నలుగురు రాజులలో నగుబాటును పరాభవమును సంభవింప గలవుసుమా. అట్టి నగుబాటు నీకే కాక మాకును జెందగలదు. దూర మాలోచింప వలసి యున్నది.”

“నీ నోట నెప్పుడును అశుభంకరమగు పలుకులే వెలువడుచుండును!” అని విసుగును సూచించుచు “నీవు మిత్రత్వమున నెంతటి శత్రుత్వమును సాధించు చున్నావు!” అనుచు రాజసుతుఁడు కోపము చేసి నిట్టూర్పుతో “ఇంతకును నను గాఁ బోయినగదా!” యని యనెను.

సూర్యప్రకాశుఁడును మరి కొంత సేపటి వరకును మాఱు పలుకక యూరకుండి తుదకు, “బాలకా, యికపై నేమిచేయఁ దలంచినావో, నీవే నుడువ వలెను.” అని యనెను.

“ఇక మరి యనుట కేమున్నది? ఈ సౌమ్య సంవత్సర మాఘ బహుళ అమావాస్య నాఁడే గద శివుని విలునోంచుట! నాఁడే గద జానకీ స్వయంవరమును? ఆ నాటికి మనము మన మంత్రి పక్షముతో వేరు వేరు వేషములతో స్వయంవరమునకుఁ బోయి ఆ శివుని ధనస్సును జూచి, ఆ విలు నెక్కు వచ్చి,

యెక్కు వెట్టి జానకిచే పూలహారము నంది మన నగరమునకు మరలి వచ్చి, మన మందిరమున, కళ్యాణ మంటపమున, జానకిని బరిణయ మాడవలె—నంతియ—ఇందుకు దగిన సన్నాహ మొనరించు ప్రియత్న మొనర్పుము." అని సోత్సాహమున బలుకుచు లంకేశ్వరుండతి రయమున నిజసదనమున కేగెను.

"అయ్యో, మూర్ఖ బాలకా! కార్తవీర్యార్జునునితో జేయి గలిపి తుదకోడి యాతని హజారంబున నూడిగంబు సేయుచు, నాతనిచే బంధీకృతుండవై, యాతనియుచ్ఛిష్ట కుండంబున నిడిన యింత యోగిరంబు గుడుచుచు, కడు నిడుమల గుడుచుచునుండ, కడకు పులస్త్య మహామునిచే తదుపద్రవము నుండి విముక్తి బొందియు, నీ పొరపాటును, నీ బాహుశక్తి పరిణతియు నెరుంగ లేక పోతివి!

"సముద్ర తీరంబున తర్పణం బొనర్చు కొనుచున్న వాలిని బ్రతికారింప బోయి, యాతనిచే సప్త సముద్రము ల ముంచబడి, హత గాత్రుండవై దిక్కులు సూచు చుండు నినుగాంచి, పాప మా వాలి నిను గరుణించి, విడచుట యు నింత వేగముగ మరచిపోయి, నీ బాహు బలమును విపరీతముగ బరిగణించు చున్నావేమి యందును?

"పాతాళంబునైన నీపరాక్రమంబున గెలువగల వనుచురభి మానంబున బలిభువనంబుసొచ్చి యచ్చట నీవుపర్యటనం బొనర్చుచుండ నచ్చటిబాలురు నినుగాంచి దశశిరమ్ముల కీటకమ్మని వారిచేతుల నిను గ్రహించి ఒక బాలుని చేయినుండి వేరొక బాలుని చేతికి నిన్నందిచ్చుచుండ నీవు వారిచేతు గరువ —యేమిది! దుష్టకీటక!' మని వారు నిన్నావలకు విసరివేయు

నెన్నియో యోజనముల దూరమునబడిపోయి తుద కట నుండి నీ పుష్పకం బెక్కి యెట్టెటులనో నీ ప్రాణంబులు దక్కించు కొని స్వస్థానంబు జేరుకొంట మరచిపోయి యిపుడు శివుని విలు నెక్కువెట్టుట దల పెట్టు చున్నావో!

"దిగ్విజయ యాత్ర సలుప నేతెంచి,యయోధ్య నప్పటి కుండిన నరణ్యుండను రాజుతో నీవుయుద్ధముసలిపి తుద కాతనిచే నోడి పోయి త్రాహి త్రాహి యనియాతనియాడిగంబున నుండి యుండి యాకటకి మండుచుండిన కడపున కాతడిడిన యింతయో గిరము భుజించుచు, కాలముగడపుచు, కడ కాతనిశరణమునొంది, యాతనిచే నీవు బంధవిముక్తుండవై, నీకు ప్రాణదాతయౌ నా యరణ్యుని గొలుచుచు కొంత కాల మాతని కడ నుందునని యాతనినమ్మించి స్వామిద్రోహ మొనర్చి, పాప మాతడు మై మరచినిద్రించుచుండ, కటా, యాతనిచంద్రహాసంబున, నాతని కుత్తుక నరికి, నీ తావును జేరు కుంటివి! అదియును మరచి యిపుడు నీ బలిమిని యెరుంగక ముక్కంటి వింటి నెక్కువెట్ట దలపకు చున్నావా? ఎంత జేలవు! తన బలము, నెదిరి బలమును సంపూర్ణముగ బరిగణింప శక్తి లేక మితి మీరిన పనికి దలపడి నవాడు తుద కెట్టి యిక్కట్టులనైన నొందవలసి రాక తప్పదు!

"తన ప్రయత్నమున నున్న లోపము లిట్టులుండ,నిక నే కన్యంగూర్చి యిన్ని ప్రయత్నములొనర్చు చున్నాడో, యిన్ని వంతల గుందుచున్నాడో, యింత మంది సహాయ మభిలషించుచున్నాడో, యిన్ని మాయ వేషముల వేయుచున్నాడో, యింత యనాలోచితముగా శివుని విలు నెక్కు వెట్ట దలంచు చున్నాడో, అట్టియాకన్యకంగూర్చి యాలోచింతమన్న నామె

పూత చరిత్ర; అనుకూల; విమలాంగి; కులజ; కుశల; సుశీల సంపన్న యీ జానకి. ఇక నామె పూర్వచరిత్రము దలంతుమన్న నీ మూర్ఖునకు జ్ఞప్తిలేదు కాని, తనకు మారక కారియే-వేదవరుండను బ్రహ్మఋషి అలనాడు విష్ణు నారాధింప, 'వేదవతి' యను పేర తన కుదయించిన కన్య దిన దిన ప్రవర్ధమానయై మూడు లోకంబుల మోహింప జేయునంతసర్వాంగ సుందరియై యుండ, నామెకు వివాహ మొనర్ప వేదవరుండు బ్రయత్నములు సలుపుచుండ వేదవతియు, సామాన్య మానవు వరింప ననియు, పరమ పురుషుగోరు చున్నాననియు, తండ్రికి బ్రత్యుత్తరం బొసంగి, అమ్మహా పురుషుని గూర్చి తపం బొనర్తు నని హిమవన్నగ పరిస రారణ్య ప్రాంతమున గంగా తీరంబునకు బోయి తదేక ధ్యానమున కాలము పుచ్చుచున్న కాలమున తన దిగ్విజయ యాత్రలలో నొక నా డీ మూర్ఖుడా వేదవతిం జూచి, మోహితుడై తన పుష్పకమున తనతో రమ్మని, యామె కరంబు నొడిసి పట్ట, నామెయు తనచేయి పట్టిన వానిచే నపవిత్రురాల నైతి ననియు, నకృతంబున తన తపో భంగంబు కలిగె ననియు, నెంతేని విచారించి, యగ్ని బడి దగ్ధయయ్యె. త దనంతరం బా యాత్మయే యెన్నియో మార్పుల నొంది, తుద కిపు డీ జానకి యయ్యె నని యెరుక గలవా రెందరో వాకొనుచున్నారు. పరమ పవిత్ర చరిత్రయా నీ జానకిం గూర్చిన యీతని బలితంపు బ్రయత్నములే యీతని యంత్యకాలము వేవేగముగ సమీపింప జేయు నని పొడకట్టుచున్నది. అలనాడట్లు హస్తంగత యయ్యు, నలభ్యయైన యా వేదవతియే యీ జానకి యని గ్రహించలేక.

కింత లొనర్చు చున్నాడు. పోనీ యని జానకీ పూర్వచరిత్ర ము వేదవతిగా నెరుంగు మనియు, నిక నీ ప్రియత్మావళి విర మింపు మనియు, చెవి నిల్లు గట్టికొని చెప్పినకొలందియు పాప మూ జానికి యెడయు, మంత్రి కార్యము సాంగముగ నొనర్చు నా మొషయు, మితి లేని యీర్ష్య పొడమి, తన బాహు బలంబును, తన మాయలును నుపయోగించి, తన కా ర్యము నిర్విఘ్నముగ జరుపుకొన నెంచుచున్న నీ వెంగలి డిపు డా భగ్న విలు వంచుట నొక తృటిపాటి కార్యముగా దలంచు చున్నాడు.

“విష్ణువర్ధన పురం బేలు విష్ణువర్ధనుండను రాజు, శ్యామ లాంగి యను దన కూతు నిమిత్తమున పర్వతుండును, గార్గ్యుం డును నను నిరువురు ఋషిపుంగవులచే శపితుండౌ సందర్భ మున పరమపురుషుడే కరుణించి, యా ఋషులచే నీ విష్ణువర్ధ నుం డొందిన శాప శిక్ష తానే పొంది, మాయా మానుషత్వ ము వహించి, యిపు డీ జగన్నాటకమున దా నొక ముఖ్య పాత్రియై ప్రదర్శించుచున్న మహావీరుం డగు నీ శ్రీరాము చ రిత మెరుంగక, శ్రీరాము వీర్య మెరుంగక, శ్రీరాముని సా మాన్య మానవుగా నెంచి, నాతని కార్యముల కవాంతరములు కలిగించుచున్న మూర్ఖు డీ దశకంధరుడు. ఏ సమయమున తన దశకంఠ విలుంఠన మొనర్పబడునో యను ననుమానము నను ననయము వేధించుచున్నది. ఏ యనుమాన మున్నను, లేకున్న ను, అసంగతముగా నాకు సంఘటిలిన యీ దిక్కుమాలిన మంత్రిపదవి బాధించుచున్నది. అందునను ప్రధాన మంత్రినట! శివ ధనుర్భంజన మొనర్ప తా నేగునట! తత్సన్నాహము లేనట

నొనర్పవలెనట ! నా మానసమున కిష్టము లేకున్నను యీ దుస్సాధ్య కార్యమున కేనట—జతన మొనర్పవలె నట— అన్నా—పెద్దమైన నేమి—చిన్నమైన నేమి? సేవకా వృత్తియే గద! అందునను నీచసేవకా సమితి యూ నీ ఋ మంత్రి వర్గ మధ్యమున నిర్గమింపవలసి వచ్చినందుల కెంతేని నా మనం బెరిసెడిని.

“ఏది యెట్లున్నను ‘శివుడు తాండవమూడ, నాతని నను సరించియున్న పిశాచీ భూత భేతాళములుంగూడ నాడవా?’ యనున ట్లీశ డెట్లాడిన న ట్లాడవలసిన వారిలో నేనుం గూడ నొకరుండ నౌట నను దుర్యోగంబునం బడితిని గదా?

“ఇపుడట మిథిలను జనకుడు నెరపనున్న “వీర్యశుల్క” యగు శివుని విలు నొంచుటయు, తదనంతరము స్వయంవరము ను గూర్చిన ప్రయత్నములే మేమి జరుగుచున్నవో దెలిసికొని రా నా యనుచరుని (స్త్రీ) వేషమున నంపి దెలిసికొన జూచెద గాక !

“అన్నా! నామానస మెంత స్వామి కార్యాచరణ లగ్న మై యున్నది! రావణుడు తన ప్రయత్నముల నపజయము నొందు నను శంక మాటిమాటికిని, ప్రతి పదమందును, నూహించగలిగిన వాడ నయ్యును, బాంధవ్య బంధనమున నేను, అయ్యో, క్రూర దనిమైన నేమి, యాతని కపయశస్సు కలుగ కుండుకొరకు మరల మరల తన క్రియా సిద్ధ్యర్థము నే నుపూను కొనవలసి వచ్చుచున్నదే!” అని మాల్యవంతు డనుకొనుచు స్వ కార్యావలంబను డయ్యెను.



210



# పరిణయ విభ్రమములు

## ఇరువదియొకటవ ప్రకరణము

## సింహావలోకనము

### I

"ఓ నేను" 'జానకీ పరిణయ నాటకమే" ప్రదర్శింపవలె నని తొలుత దలంచితిమి. కాని అందుకు తగినంత వ్యవధి చాలదు. ఇంతకును జరుగనున్న జానకీ పరిణయముం గూర్చి యిప్పుడు నాటకమేల ? ఏ కాలమందైనను, ఏ దేశమందైనను, జరిగిన సంగతులే నాటకములుగా లోకమున బ్రదర్శింపుచుందురు." అని తులసి యనెను.

"ఔ-లే—కనుక యిపు డేమి ప్రదర్శింప వలయునని నీ యూహ—" అని శాంత బ్రశ్నించెను.

"సులభముగ కొలదిలోనే పూర్తియగునట్టి 'జానకి మెరుక' అను నాటకమును ప్రదర్శింతుము గాక."

"అట్లయిన నెరుకసాని యెవరు కావలెను?"

"నేనే యెరుకసాని" నని తులసి యనెను.

"అట్లయిన నీ వెవరి యెరుక చెప్పెదవు?" అని సీత యడిగెను.

"నాకు కానవచ్చినవారి యెరుక, నాకు దోచిన రీతిని చెప్పెదను."

"కా నిమ్మది యేదో చూచెదను గాక!" అని సీతా శాంత లనిరి.

జనకుని రాణివాసమున జరుగుచున్న యీ నాటకము జూడ పెక్కండ్రు స్త్రీలు వచ్చి కూరుచుండి చూచుచుండిరి.

నాటక రంగస్థలమున నిలచియున్న పాత్రధారులౌ వా రలలో నొక మానిని చేయి పట్టుకొని యెరుకసానిపాత్ర ధరిం చి నిలచియున్న తులసి యిట్లు చెప్ప దొడంగెను.

ద్విపద॥ "హైమతి గొల్చి ♦ ధ్యానించి మ్రొక్కి,
ఈమె హస్తముఁ జూచి ♦ యెరుక జెప్పెదను;
దశరథుఁడు గన్న ♦ తరలాక్షి యీమె,
విశదంబుగా మీకు ♦ విన్నవించితిని;
ఈమె పెంపుడు బిడ్డ ♦ రోమ పాదునకు,
ప్రేమించె నా ఋష్య ♦ శృంగ మానీండ్రు;
పతి యేడ కేగిన ♦ వర్షంబు గురియు,
నతఁడు మన్ననఁ గొన్న ♦ యతుల తపస్వి.
* * * * * *

అని మరియు మరియు నేమేమో చెప్పబోవుచుండ సీత చిరునవ్వు నవ్వి, 'ఓ యెరుకసానీ, ఏమి నీకు బుద్ధిమాంద్యమా? నీ వెవ్వరి చేయిపట్టి, చూచి, యెవ్వరి చరిత్ర చెప్పుచున్నావు? నీవు చిసఇట్టిది సర్వమంగళ హస్తము—నీవు చెప్పినది శాంతా చరిత్రముచూ— యెరుక నే నెన్నడెరుంగను." అని యనెను.

"జా నాను నీ వెరుంగవేమో కాని, నేటి యెరుకసాని తులసినా నాచేయి చూచి, జానకీచరిత్ర చెప్పుట యెంత సంగ తమో, అంత సంగతమే యిదియును—ఇట్టి వే లోక

ములో సోదెలును ఎరుకలును!" అని తులసి యనెను.

"యెరుకసానీ, ఏదీ నాచేయి చూచి చెప్పుము." అని శాంత తనచేయి చాచి, యెరుకెత కందిచ్చు చుండ, సీతయు విసుగున—"చాలు—చాలు—నిక చాలు—ఇక నీ సరిపడని సోదెలును సొదలును—" ననుచుండ, జనకుని పంపున శీలవతి త్వరగమనమైవచ్చి "మంగళాస్నానసమయమైనది; వేవేగముగ స్నాతవు కమ్మని శతానందులవారు కోరుచున్నా రని నీ జనకుని తెలుపైనది." అని చెప్పెను. అంతట వీ రందరును ప్రదర్శన ము చాలించి వెడలిరి. ప్రదర్శనా దిద్రుక్షులును తమ తమ నెలవుల కేగిరి.

## II

"త్రిజటా, యేమిజరిగినది? ఎందుల కా కలవరము?"

"నాన్నా! ఇంద్రజిత్తునకును, మహోదరునకును జరిగిన జగడము మాటయేనా?"

"ఔ నౌను—వారి వివా దాంశ మేమి?

"తాను జ్ఞాతి ననియును, జ్ఞాతి సంబంధమును, జ్ఞాతి హక్కును విడజేసికొనుటకు పెదనాన్నగారు భాండారమునుండి కొంత ద్రవ్యమును, కొన్ని అమూల్య రత్నములును అతని కొసంగెద నని వాగ్దాన మొనర్చి రనియు, నా వాగ్దాన మామూలుగ నెరింగిన సాక్షు లున్నా రనియును, తన బలము నెరుంగక, నిపుడు తన తలకు దగని ప్రయత్నముల సార్వభౌ ముడు దగులొ్కని యుంట యాతని యవసానకాలము సమీ పింపజేయు నసియు, నిన్ని కారణములచేత తనకు రాదగిన

తనకు రావలసిన, తనకు వాగ్దాన మొనర్చబడిన, మూల్య మిప్పు
డే యిచ్చివేయవలసిన దనియు, సార్వభౌముడు మరలి వచ్చు
నందాక గడువు నొసంగ ననియు పెద్ద తగవు పెంచెను."

"ఇంత స్వల్పకార్యమున కంత తగ వేల?"

"ఇది స్వల్పకార్యమా? సార్వభౌము డేదో కార్యాంత
రమున కేగియుంట మరలి వచ్చునంతదాక గడువు నొసంగ
నను మహోదరుని వాదనయే యింత రట్టునకును మూల
కారణ మయ్యెను."

"ఏమీ! ఆ మాత్రము గడువు నొసంగ ననుట కాత
డేమేని కారణము చెప్పెనా?" అని విభీషణుడు ప్రశ్నించెను.

"కారణ మనుచున్నా రేమిటి? సార్వభౌములగు పెద్ద
నాన్నగారు జానకీ వాంఛను నెరవుచున్న తన ప్రయత్నముల
లో నాయనకు ప్రాణాపాయము సంభవించు ననియు, ప్రస్తుత
ము కార్యాంతరమున నేగిన సార్వభౌముడు మరి మరలి రా
జాల డనియు, నా కారణమున తనకు వాగ్దానము చేయబడిన
మొత్తము తక్షణమే యిచ్చివేయ వలయు ననియు, నిందప్రత్తు
ను నిర్బంధముసేయ తన తండ్రి యాయుర్దాయమును గూర్చిన
అప్రస్తుత ప్రశంసకు యువరాజు గినిసి కోపోద్దీపితుండై మ
హోదరుని పైబడి, యాతనికి పెద్దగాయము గూడ కలుగ
జేసెను." అని త్రిజట పలికెను.

"ఈ మహోదరుడు తొలినుండియు నిట్టి యప్రస్తుత
ప్రశంసలనే చేయుచున్నాడు. కొన్ని విషయములు సత్యములే
యైనను, బాహాటముగా ననువరాదు. మా యన్నగారి
ప్రస్తుత ప్రయత్నములు శోచనీయములే యౌగాక! మహో

దరు దూహించిన దంతయు సకారణమే యగు గాక, గాని యింద్రజిత్తుతో నిపు డీ కయ్యము మాత్రము సవ్యము కాదు. కాని, త్రిజటా, రానురాను లోక కంటకత్వము వృద్ధియగుట తనయితరశక్తుల యౌత్సుక్యము అంతగా పరిగణనకు రాకున్నది.

"ఇపు డా మిథిలానగరమున జరుపబడుచున్న—శివుని విలు నొంచుట—యను "వీర్యశుల్క" యుత్సవమునకు దానును పోబోవు చున్నందున తత్ప్రయత్నముల సేయవలె నని మాల్యవంతుడు నాకు కబురంపెను. నా కొసంగబడిన యీ నగరాధికారి పదవిని వ్రాతపని మెండు. ఎంత చేసినను తరుగని పని. ఎంత వ్రాసినను పెరుగుచుండునే గాని తరుగ దాయెను." అని విభీషణు డనుచుండగ నొకండు వచ్చి "సార్వభౌముని ప్రయాణము నిమిత్త మన్నియు నాయత్తమైనవా?" యని మాల్యవంతుడు కనుగొని రమ్మని నన్నంపె నని పలుక, "త్రిజటా, నే పోయి వచ్చెద" నని విభీషణుడు తన కూతుంతో పలికి, ఆ నూతనాగతునితో పాటు దానును వెడలిపోయెను.

III

"అన్నా అనుకున్నంత పనియు నైనది! మిథిలానగరమున జరుగుచున్న ప్రయత్నముల జూచి రమ్మని నే నంపిన నా యనుచరు డటకు పోయి శివుని విలు నొంచుట, జానకీ స్వయంవరము, లోనుగా గల ప్రయత్నములం గూర్చిన పనులను తా స్త్రీ రూపధారియై కనిపెట్టి వచ్చి, అచట జరుగుచున్న "జానకీ యెరుక" అను నాటక ప్రదర్శనము గూడ నచటి ప్రేక్షకులలో నొకతెయై చూచివచ్చి, తాగన్నదియు విన్నదియుం గూడ నిపు డిపుడే చెప్పి పోయెను. అయ్యో! రావణా,

జానకీ కరస్పర్శనా సుఖమైన పొందెదగాక యను నూహతో నొకరి చేయిపట్టుకుని పొరబడి జానకీ కరస్పర్శన సుఖము నొందితి నని యూహించి ఆనందించితివి గదా! ఇంత పొరపాటును జరిగియుండు నని నే నూహించినది సత్యమే యైనది. పొరపాటు పడలే దంటివి! నాతో నెంతో వాదించి చర్చించితివి! అయ్యో! ఎంతతొందరపా టొనరించితివి! ఇంకను మున్ముం దేమి కా నయియున్నదో గద!" అని మాల్యవంతు డనుకొనుచు మిథిలానగరో న్ముఖుడై "సార్వభౌముండును, త న్మంత్రివర్గము తదనుచర సహితముగ 'వీర్యశుల్క' ప్రాంతమున కేగిరి. కావున నేనును వైళమ పోవలయు." నను కొనుచు మాల్యవంతుడు తన విమానమున నేగెను.





# పరిణయ విభ్రమములు

## ఇరువదిరెండవ ప్రకరణము

# శివధనుర్భంజనము

(ఒక కోటి యిరువది యైదు లక్షల యిరువది వేల సంవత్సరములకు వెనుకటి సౌమ్య సం॥ మాఘ బ॥ 30)

చీమ దూరుట కెడము లేదు. ఇసుక జల్లిన నిసుక నేల రాలదు. అబ్బా! ఏమి జన సంకులము! ఎక్కడ చూచినను రాజులే! ఎందు బోదు మన్నను తద్రాజలోక పరిజనములే! వాహనములు, పుష్పకములు, హయములు, గజములు, ఉష్ట్రములు, క్రిక్కిరిసి యున్నవి! ఇక దిదృక్షుల మాట చెప్ప నక్కరయే లేదు. విశ్వామిత్రు డొనర్చిన యాగమున కాహ్వానింప బడిన వారందరును ఆహ్వానింప బడుట మిథిలా నగరము పునర్నిర్మాణమైన ద్విగుణీకృతాలంకార యుక్త మా మిథిలానగరమా యను నట్లుండెను. సకల దేశాల రాజులును, అన్ని దిక్కులనుండియు వ్యవసా భేదము లెంచకుండ విచ్చేసి యుండిరి.

"మునీంద్రమా! ఇందరు రాజులు వచ్చియున్నారేల?"

"రామచంద్రా, చెప్పియుంటిని కానా జనకు నింటి

మూగిటనున్న శివధనస్సు నెక్కువెట్టి తమతమ బాహుబలంబు లజూవికొన నేతెంచిన రాజలోక మిది."

"ఏమి, ఆ వి ల్లెక్కిడుట అంత కష్టసాధ్యమా?"

"నీకుదక్క తదితర లోకమున కది కష్ట సాధ్యమే కాదు; దుస్సాధ్యము కూడను."

"ఆ వింటి చరిత్రి మొకింత దెలుప వేడుచున్నాను."

"నేను వేరుగ దెలుపనేల? అల్లదె శతానందు డేమో పలుకుచున్నాడు. అది వింటిమేని మన కంతయు సువ్యక్తము కా గలదు."

శతానందు డ్లెత్తి యిట్లు పలుకుచుండెను.

"ఇపు డిటకు వచ్చి యున్నట్టియు, నింకను వచ్చు చున్నట్టియు రాజ లోకమునకు సుస్వాగత మొసంగుచున్న మా మిథిలా పతిభునగు జనకు పలుకులుగా నిదె విన్నవించు చున్నాను.

"త్రిపురాసుర వధానంతరము దక్షుడు యజ్ఞ మొన ర్చు కాలమున, కోరినను శివునకు హవిర్భాగము లొసంగమి నా శివునకు గినుక వొడిమి, యీ ధనస్సు నెక్కువెట్టి అప్పటి కటనున్న రాజలోక కంఠముల దునుమాడ బోవ, దేవతలు ను, ఋషులును, రాజులును శివుని బతిమాలి ప్రార్థింప నాత్రం డును గరుణించి, వారిని వధింపక, దేవతలకు తన కానుక మొసంగ వారును, జనకు కులమునకు గూర్తు స్థుడౌ నిమి చక్రిష ర్తికి ఆరవ తరమువా డౌ దేవరాయున కిల్లడగా నొసంగ, నా తండును తన యింటి మంగలిభాగమున నర్చాని నుంచెంచెను. అనంతర మెన్నోయేను లీ నాటికి గడచినవి; ఎన్నో తరములు

నడచినవి. తుదకీ నాడీ యజ్ఞవాటమున మీరలిపుడు చూచుచున్న యీ వింటిని మా చక్రవర్తి గూతురా జానకి తన బాల్యక్రీడావిలాసమున నాడాడ ద్రిప్పుచుండును. ఇపు డీ విలు వంచుట యీ రాజమండలికి వీర్యశుల్కముగా నేర్పరచబడి యున్నది. ఏ రాజ చూడామణి యీ విల్లు నెక్కువెట్టి నారిని సారించునో యా ప్రభుశేఖరునే మా జానకి వరించునని యిదె ముమ్మాటును గలయ బలుకుచున్నాను."

అని శతానందుడు బిగ్గరగ ముమ్మారరచి, 'సభామైనమః' యని యొక నమస్కార మాచరించి తన యాసనమున గూరుచుండెను.

యజ్ఞవాటమున మంగళ తూర్య నాదములు ఘోరు కొనుచుండెను. 'వీర్యశుల్కము' బరీక్షింప వచ్చిన రాజు లొక వంకను, ఋషు లొక చక్కని, స్త్రీ జన మొక దెసను, నిలచి యుండ, జనక చక్రవర్తియు త దనుజుం డగు కుశధ్వజుండును, ముందుకు వచ్చియుండ, వారి పిఱుంద జానకి, యూర్మిళ, మాండవ్య, శ్రుతకీర్తి, శాంత, తులసి మొదలగు వా రందఱును, 'వీర్య శుల్కము' దెస జూచుచుండిరి.

"ఈ 'పరిశోధన'కు నిలచునంతటి బాహుబలాఢ్యు డేడీ?"

"ఈ 'పరీక్ష' లో నాగువా డుండునా?"

"బాహుబలము పరీక్షింప నిది యొక 'ప్రమాణ'మా?"

"ఒకరి భుజపరాక్రమము మెఱుగుట కీ విలు నెక్కువెట్టుట యొక 'మచ్చు'గా నూహించుట పాడియగునా ?"

"వచ్చిన వారిలో పసికూనలు గూడ నున్నారే! వీరును 'వీర్యశుల్కము' బరీక్షింప వచ్చినవారేనా?"

అని పలు తెరంగుల దివ్యర్షులు పలుక జొచ్చిరి.

మైరావణాది బాహు విక్రమ బలాఢ్యులును, సిద్ధులును, సాధ్యులును, గంధర్వులును, గరుడులును, ఉరగులును, ఉశీనర దేశాధిపతి యగు వృషదర్భుడును, సౌవీర దేశాధిపతి యగు సువీరుడును, కేకేయ దేశాధిపతి యగు కేకయుండును, మద్రదేశాధీశుం డగు మద్రుడును, అంబష్ఠ దేశ నిర్మాత యగు సువ్రతుండును, బలిచక్రవర్తి పుత్రులగు అంగుడు, వంగుడు, కళింగుడు, పుండ్రుడు, సుహ్ముడు, మొదలుగా గల అసంఖ్యాకులగు రాజులును వచ్చి, ఒక్కొక్కరుగను విలు నెత్త బ్రయత్నించుటయు, విఫలులగుటయు దివ్యర్షులు చూచుచు, పరాభవ సూచకముగా చప్పటులు జరచుచుండిరి. ముందుగా కొందరు రాజులు ప్రయత్నించియు విఫలులగుట, తక్కుం గలవారు రక్షలోకించుటం జేసి బాహుబల పరీక్షకు నిలువ దలంచి వచ్చినవారయ్యును అందు గొందరు వ్యర్థప్రయత్నమేల- శుష్కాయాసమే గాని, యని దలంచి తమ ప్రయత్నమే విరమించిరి.

ప్రయత్నించియు, విఫల మనోరథులయి మరలి వచ్చిన రాజులను, అట్టివారిని చూచి, తమ ప్రయత్నమే విరమించుకొనిన రాజులను చూచి, ఒక ఋషి తన బొట్టన వ్రేలను నేలను రాయుచుండ నాతని శిరము నలంకరించిన మగరాల బొమిడికముపై నలంకారార్థ ముంచియుంచి పుష్పదామము నూడి పడ నద్దానిపై దృష్టిని లక్షించి తదేక ధ్యానమున జూచుచుండ, నాతని ప్రక్కనున్న యొక ఋషి

"ఇంకా కనిపెదవే యక
లంకాపతి తప్పిదంబు; లక్షింపు మికే

వంకకు వచ్చుచు నున్నది
శంకరు విలు విఱువ నీ క సమయం బిదిగో!"

అని యనెను. ఆ జేజా పలుకు విని దద్దిరిలి, నా రుసి దెస సౌకర్నికంటు జూచుచు, తన్నవమానించిన వారిం జూచిన నీసడించు చుఱచుఱ చూపులతో, చివాలున లేచి, యా వింటి దెసం దిలకించి, ముందుకు వచ్చి, జనకుని వెనుకనున్న జానకిం గాంచి, తన మోమున నానంద చిహ్నములు పొడసూప పగర్వంబున శేషించిన రాజలోకము నవలోకించి తల పంకించి, తన యావచ్ఛక్తి న్వినియోగించి, యెంతేని ప్రయత్నంచియు నా విలు నొక్క యంగుళమైనను పై కెత్త లేకపోవుట యటుండ, యే మాత్రమును కదలుపజాలక పోయెను. చూచుచుండు ప్రజలందరును పరాభవ శూచకముగా చప్పట్లు గొట్టుచుండిరి. తన ప్రయత్నమున దాను విఫల మనోరథుం డగుట తన మనోవ్యథకు కారణ మగుటయు, తన అపజయము గాంచి, తన్నవమానించుటకో యన దిదృక్షుల చప్పట్ల వలన ద్విగుణీకృత పరాభవమున దందహ్యమానసుం డగుట నుండి యాతని మోముదెస జూడ నేర తరమగును! విఫల ప్రయత్న యగు రాజమండలమును జేరి యీ యేడిక ముందు ప్రయత్నము సలుపు వారి దెస జూచుచుండెను.

"రాజచంద్రా, ఇప్పటి వరకును ప్రయత్నించిన నా పెలో నొకరుండును జయము నందలేదు. ఈ విలు వంచనేని, నారి మోపెట్టనేని, బాణంబు దొడుగనేని, నారి గూర్చనేని, బరువు నాచుట కెత్తి కదలుపనేనియుం జాలరు. ఇంకను నీవు నుపేక్ష చేయరాదు. లే- లెమ్ము—ఆ విలు నెక్కుపెట్టి, తాకిటిని

సంధించి, యిట వేచియున్న సకల రాజన్యుల ధన్యవాదముల నందుము. జనకుని ప్రేమకు పాత్రుడవు కమ్ము. చూచితివా ఎందరు రాజులు విగత వీర్యులై నిలచిరో? నీ విక మరి యుపేక్ష చేయరాదు."

"ఆర్యా, చిత్తము. తమ యాజ్ఞానువర్తుండ నయి, యా విలు నెంచ బ్రయత్నింతును." అని యనుచు శ్రీరాముడు విశ్వామిత్రునకు మ్రొక్కి, అట నిలచియున్న రాజమండలి కొక విధేయ పూర్వకమా నమస్కారము గావించి, యా వింటిని సమీపించి, ముమ్మారు ప్రదక్షిణంబు గావించి, యా వింటికి నమస్కారంబుచేసి, తన కుల దేవత నెద దలంచి, యా వింటిం దన యొంటిచేత నెత్తి, రెండవచేత నా వింటి నను ము బిగించి వంచబోయి యా కర్ణాంతము వంచి తెగదీయ కొండల యుల జడిం బోలె, పిడుగుల చప్పుడునో నా, ఫెళ్లున నా విల్లు విరిగి రెండు ఖండము లయ్యెను. తత్క్షణమే జయ జయ ధ్వానములతో, చూడవచ్చిన రాజులలో పెక్కండ్రు చప్పటలు జరచుచు నా బాలరాముని, దీవించువారును, యాశీర్వదించు వారును, ధన్య వాదము లొసంగువారును నై యుండ: కొందరు మాత్రి మసంతుష్టి, అసూయ, అనురాగ రాహిత్యత, అసహనత తమతమ హృదయంబులం దొలకాడ ముఖ మండలంబుల వెలిగ్రక్కుచుండెను. జనక విశ్వామిత్రు ద్దు ఆ బాలు సమీపించి, యాతని నాలింగనంబు గావించి, శిరంబు మూర్కొనుచుండ, తులసీ శాంతాములు పిలుండ నడచుచుండ, తన కర పద్మంబుల నిడికొనియున్న పూలదండ నా జానకి హంసగమనంబున గొనివచ్చి, దనకను కొనల నును

సిగ్గు దోలకాడ ముఖమండలంబున నామోద జ్యోత్స్న ప్రి కాశించుచుండ, ముందుకు వచ్చి, శ్రీరాము కంఠసీమ నా పుష్ప దామం బలంకరించి, తన శిరమ్మున నున్న వివిధాలంకార మధ్య స్థితామూల్య మణు లా పరమపురుషు పాద రాజీవమ్ములకు నీరాజన మ్మిడ, నమస్కరించి, పదంపడి జనక కుశధ్వజాదులకును, విశ్వామిత్రి శతానందాదులకును, పిదప నమ్మహా సభకును గృతాంజలియై ప్రిణుతింజేసి, నిలచియుండ న నేక వేదోక్తాశీః పరంపరల నడుమ, ననేక మంగళ వాద్యమ్ముల ధ్వానమ్ములు భోరు కొలుపుచుండ, త న్మధ్యంబున నోటువడిన రాకొమరులలో గొంద రేమో గుసగుస లారంభించి, పెక్కండ్రి తావు వీడి చనుచుండ, తక్కంగలవారిక ముందేమి సేయ నగు నని గాబో లాలోచించుచు స్వదేశోన్ముఖులై మరలువారు మరలుచుండిరి.

"మునీంద్రమా, శివుని విలు నొంచుట యను నీ వీర్య శుల్కమున జయమంది, యిందరు రాజులలో ప్రిఖ్యాతి నందిన యీ రాజ కిశోర సింహమునకే జానకి నిచ్చి వివాహము సేయు కార్యమునకు ముహూర్తమునిర్ణయించి, దశరథునకు కబురంపి, త ద్బంధు మిత్రాదులతో పురోహిత, హితామాత్యాది బృందముతో నరుదేర నాహ్వానించెద; నిందులకు తమ సమ్మతి వేడుచున్నాను." అని జనక చక్రవర్తి యనెను. "అట్లనే చేయవచ్చు" నని విశ్వామితుృడు పలికి యా నాటికి యెవరి విడుదలకు వారు మరలిరి.

సౌమ్య సం॥ ఫాల్గున శు 3 (తదియ) నాడు దశరథు నాహ్వానింప దూతల నయోధ్యకు బంప వారును షష్ఠి

నాటికి జేరుకుని వివాహ మహోత్స వాహ్వాన పత్రిక దశరథున కందజేయు నాతండును కడు సంతసంబున, చతురంగ బల సమేతుండయి, సుమంత్రాది మంత్రి వర్గముతో, వశిష్ఠాది పురోహిత బృందముతో, సప్తమి నాటి సాయంకాలము బయలువెడలి యయోధ్య వీడి, ద్వాదశీ దివసమున సుతయమునకు మిథిలానగరము జేరుకొని, జనకునిచే సుస్వాగతము నొంది, సపర్యలును వడసి, వశిష్ఠ మహర్షి రామునకు సీత నిచ్చి వివాహము సేయు ముహూర్తముననే లక్ష్మణునకు జనకు నౌరస పుత్రిక యగు నూర్మిళను, భరత శత్రుఘ్నులకు కుశధ్వజుని కూతులౌ మాండవ్య శ్రుతకీర్తుల నిచ్చి వివాహము సేయు నట్లాలోచన చెప్ప నా జనక కుశధ్వజులును వల్లెయని మనఃపూర్వకముగ నంగీకరించి, అందుకు దగిన ప్రయత్నముల నియోగించి, త్రయోదశీ మఘా నక్షత్రమున దశరథుడు నాందీ శ్రాద్ధాదుల నాచరించి, చతుర్దశీ దివసమున * గోదావ్రత మాచరింప జేసి, ఉత్తర ఫల్గుణీ నక్షత్ర యుత పౌర్ణమీ దివసమున వివాహమునకు నన్నియు సిద్ధపరుప బడినవి.

II

"ఔ నౌను జరిగిన దంతయును దెలిసికొంటిని. ఇట్లగునని నే ననుకొనుటే గాక, తత్సూచకముగ నీ కిదివరకే సూచించియే యుంటిని. ఇంతకును కర్మము ననుసరించియే బుద్ధియు పని చేయు చుండును. * * * "

* గోదావ్రతము; గోదానం- 'గావః'=రోమములు 'దాన'=ఖండనము. బాహుపాదమూల రోమములు ఖండింపబడు కర్మము. ఇదియే వివాహమునకు ముందు ఆచరింపబడు సమావర్తన కర్మము అనబడును.

"ఈ ముసలియమ్మ పలుకులు మాని, యిక ముందు చేయదగిన పని, మనకు జయప్రదముగా నుండు నట్టిదియు, నే నొందిన పరాభవమునకు ప్రతీకారముగా నుండ దగినట్టిదియు, జానకి నాకు లభించునట్టిదియు, నగు నాలోచనము నిమ్ము"

"నా మాటలు ముసలివాని అనుభవపు మాట లగునే కాని, నీకు క్షేమకరము కాకుండుట కాడిన మాటలుకావు. ఇక మనము విషయ చర్చ మాని, 'యేమి కానున్న నయ్యెడి యగు గాక' యని యెంచి, నీ మనో భీష్టము నెరవేరు మార్గముగా గన్పట్టు కార్య మొనర్ప వలెను.

"పరశురాముడు శివభక్తుడు. కావున శివునివిలు నొంచు వాడు, విరచువాడు, పరశురాముని కపరాధ మొనర్చిన వాడగును. కావున హిమవన్నగమున దప మాచరించు చుండిన పరశురామున కీ వార్త నెరింగించిన నాత డూరకుండ డీ రాము నిర్జించు బాహుబల సమన్వితుండే గాక, వైష్ణవ ధనుర్ధరుం డౌట నాతం డజేయుండు. కావున నాతని కీ వార్త దెలియ సంపెద. * * *"

"ఇందువలన నేమి లాభము?" అని రావణుడు విసుగును సూచించెను.

"నేను చెప్పవలసిన దంతయు చెప్ప నిమ్ము. ఇప్పు డీ సందర్భమున నేదో శుభముహూర్తమున జానకికి వివాహమ్ము కాకమానదు. కదా—"

"ఇక నాపయిని నీ సామర్థ్య మేమి చూపగలవు?"

"అన్నా! కానయియున్న కార్యమున కవాంతరములు గల్పింపుమందువా? ఆ పయి కార్య మాలోచింపవలసినదే గాని,

అప్పుడది యాప నీతరమును గాదు, నీ తాతతరమును గాదు."

"నీ వేమి చెప్పినను సరే—అది సర్వథా నాకు జానకి లభింపజేయు నట్టిదై యుండవలెను."

"అదియే గద నా ప్రియత్నము.

"శ్రీరాముని వివాహానంతరము, మిగులవయోవృద్ధుఁయిన దశరథుడు రాజ్యభారము శ్రీరామునకప్పగించక తప్పదు. ఆ సమయమున పట్టాభిషేకోత్సవమున కవాంతరములు పెక్కులు గల్పించుట కేన్నో మార్గము లున్నవి.

"శ్రీరాముని సవతితల్లియా కైకకు "మందర"యను నరణపు దాసియూలమున నెన్నని చిక్కులుగల్పించి యాతనికి పట్టాభిషేకము కానీయకుండ జేసి, కైకకు జ్యేష్ఠపుత్రుండగు భరతునికే పట్టముగట్ట నేర్పరించి, శ్రీరాము నడవికేగ జేయుపట్ల, పట్టించితిమేని, జానకి యొంటరి యగును. ఎట్లయినను జానకి నొంటరి జేసితిమేని, జానకి మనకు లభించక తప్పదు. కావున దీని కింత వగవంబనిలేదు. నీవుమాత్రి మేమురుపాటున నుండరాదు. విద్యుజ్జిహ్వాదుల సహాయమున నే నిపుడా వివాహపు తెన్నునకేగి, యాపాత్రితపు వింతల గమనించుచుందును. నీకుం గలుగందిన యంతన రమ్ము." అని మాల్యవంతు డనెను.

"అన్నియు బాగున్నవే గాని, నేనును నీతోడన నుందును. నిను నే నేమరను." అని రావణుం డనెను.

"సరియే-రమ్ము." అని మాల్యవంతు డనెను.

వీరిరువురును మితపరి వారముతో జనకు నింట జనకు కళ్యాణ సమయమునకు పోవుచుండ మాల్యవంతునితో రావణుండును, "మాల్యవంతా, శివునివిలు నెత్తబోవుసమయాన నా

ఊర్మిళ, మాండవ్య, శ్రుతకీర్తి యను వారలకుం గూడ శ్రీ రాము ననుజు లగు లక్ష్మణ, భరత, శత్రుఘ్నులకుం గూడ వివాహ మొనర్ప బడెను. అపుడు వశిష్ఠ విశ్వామిత్రాది మహర్షులు యిట్లాశీర్వదించిరి.

స్వస్త్యస్తా శీతి సహస్రాణాం-ద్విజ గురు దైవతానాం-పురుహూత హుతవహ దండధర నిశాచర పాశపాణి సమీరణ వైశ్రవణ శశిశేఖరాణాం-ఆయుష్మతః కమలాసనస్య సకలదురిత నివారణ పారాయణస్య శ్రీ లక్ష్మీనారాయణస్య। ఆద్యంతరహితస్య; గౌరీ మనో వల్లభస్య; సర్వ శుభఫలప్రదాయకస్య; పుష్పసాయకస్య; సత్యసంధస్య హరిశ్చంద్రస్య; తేజస్వీన స్సవితుర్న యనానందకరస్య శ్రీరామచంద్రస్య; ప్రజ్ఞా గురో స్సురగురో ర్మృకండుముని నయన పుండరీక మార్తాండస్య మార్కండేయస్య; తపో నిష్ఠస్య వశిష్ఠస్య; దుర్వార వీర్యస్య కృతవీర్యస్య కులధుర్యస్య; కార్తవీర్యస్య; అంభోనిధి కుంభినీ విజృంభణ స్తంభనస్య కుంభ సంభవస్య; అపార పారస్య పారావారస్య; శ్రీశైల సువేల సురనివాస కైలాసాదీనాం శైలానా; మమంద మకరంద బిందు సందోహ నిష్యంద సుందర తుందార హరిచందనాదీనాం; చింతామణి దినమణి కౌస్తుభాదీనాం మణీనాం; రమణీత మణికర్ణ రమణీసుమణి భూషణానాం గీర్వాణ తరుణీనాం; కామధేను ప్రభృతీనాం ధేనూనాం; యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమా ధ్యష్టాంగయోగ నిష్ఠా గరిష్ఠానాం వసిష్ఠ వాలఖిల్య వాల్మీక్యాగస్త్యాత్రేయాంబరీష కశ్యప కణ్వ కాత్యాయన కౌండిన్య కౌశిక కరుష్ప పరాశర

శ్రీవత్స శల్య శాండిల్య జమదగ్ని పుండరీక భారద్వాజ విశ్వామిత్ర గౌతమ సనకసనందన సనత్కుమార నారదాది ముఖ్య మునీనాం; రవి శశి కుజ బుధ గురు శుక్ర శని రాహు ముఖ్య నవగ్రహాణాం; అశ్విన్యాది నక్షత్రాణాం; ఋగ్యజుస్సామాథర్వణ కావ్య నాటకాలంకార వ్యాకరణ తర్క వేదాంతాది శాస్త్రాణాం; అంగ వంగ కళింగ కాశ్మీర కాంభోజ కేరళ కేకయ కోసల కుంతల కురంగ కురవక సౌవీర సౌరాష్ట్ర మత్స్య మరువ మాలవ నేపాల మగధ ఘూర్జర బర్బర పార్శ్వక కర్ణాట నిషధ చోళ పాంచాల సాళ్వ పుళింద సింధు పాండ్య ద్రవిడ యవన శూరసేన బాహ్లిక కొంకణాది షట్పంచాశద్దేశానాం; అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ అవంతికా పురీ ద్వారావత్యాది పుణ్య నగరీణాం ; నందినీ మందాకినీ నళినీ తామ్రపర్ణీ భీమరథీ గంగా యమునా వేత్రవతీ వేగవతీ పంపానదీ కృష్ణవేణీ మహేంద్రతనయా గోదావరీ నర్మదాది మహా నదీనాం; అగణ్యా ప్రాగణ్య శరణ్యా వరేణ్యా నామరణ్యానాం; అరుంధతీ లోపాముద్రాహల్యానసూయా దమయంతీ భగవతీ ప్రభృతీనాం సతీనాం; ఆశా భాజాం పుణ్యభాజాం గజానాం ద్విజానాం; బ్రహ్మణశ్చతుర్ముఖానాం; పరమేశ్వరస్య పంచముఖానాం; కుమారస్వామిన షణ్ముఖానాం; సప్తకుల పర్వతానాం; సప్త ద్వీపానాం; అష్టవసూనాం; అష్ట దిగ్గజానామష్టైశ్వర్యానాం; నవగ్రహాణాం; దశావస్థానాం; మేకాదశ రుద్రాణాం; ద్వాదశాదిత్యానాం; త్రయోదశవిశ్వేషాం; చతు

ముక్తాఫలమ్ములు భక్త లోకముల బ్రోచును, మా చదువరుల కాశీర్వాదము లొసంగు గాక! వివాహ కార్యము నిర్విఘ్నముగ జరిగిన పిదప ఫాల్గుణ బహుళ పంచమినాటి రాత్రి విడిది గృహ ప్రవేశము జయప్రదముగ జరుపబడినది.

ఫాల్గుణ బహుళ అష్టమినాడు దశరథుడు తన పుత్రులతోడను, జనకుడు తన పుత్రికల తోడను గూరుచుండి విశ్వామిత్రుని చర్యలం గూర్చియు, దశ్యుల మాయలను గూర్చియు, బ్రశంసించుచుండ వారి యెదుటకు విశ్వామిత్రు డరుదెంచి, "రాజశేఖరులారా, నేటిదినము నా కన్నులకు పండుగ. జనకా నీ కోర్కె నెరవేరినది. దశరథా, నీవు నీ కొమరుల నాపాలో నం నెంతేని సంశయించితివే గాని, యిపుడు నీకు నీ కుమారు లిరువురను మరల నప్పగించుటే గాక నల్వురు కోడండ్రం గూడ నప్పగించితిని. ఇక నా యొనర్చు పని మరి లేదు. ఇక నేను నా యావాసమున కేగెద" నన అచ్చట నుండిన వా రందరును విశ్వామిత్రునకు బ్రణమిల్లి యాతని బహూకరించి, యాతని వీడ్కొలుప నాతండును సంతుష్టాంతరంగుండయి తన యాశ్రమము జేరుకొనియెను.

ఫాల్గున బహుళ నవమీ దినమున జనకుడు తన కూతుల నత్తవారి యింటికి నంపుటకు కన్యాధనముల, సారెల, నరణముల, కానుకల నీయ వారును దశమీ ప్రవేశపు గడియలలో బయనము సాగించిరి.

## పరశురాము గరవ భంగము

వివాహానంతరము, చతురంగ బలములతో ప్రయాణము సేయుచున్న మిథిలానగరము నా దోపజేయ పెండ్లి వా

రెండవను మరలి యయోధ్య కేగుచుండ, మార్గ మధ్యమున పరశురాము డడ్డగించి, "ఎవడురా, రాచబిడ్డ డట, ఇరువది యొక్కమారులు నిర్మూలింప బడిన రాజ వంశములలో నొకరుం డయి మిగిలిన వా డెవడురా నా శివుని ధనస్సును విరచె నట! అంత సాహస కార్య మొనర్ప గలిగిన రాచబిడ్డ డెవడు రా ?" యని పెనుబొబ్బ లిడుచు మార్గ నిరోధము గావింప "నా రాచపుత్రుడ నేనే" యని యనుచు శ్రీరాముడు తన యరదంబు డిగ్గి పరశురాము నెదుట నిలువ నాతండును క్రోధోద్రేకంబున "*చిరకాలమునుండి యొకమూలపడియుండిన యావిలు నెక్కువెట్టితినని గర్వింపకుము. ఇదె నా వైష్ణవ ధనువు నెక్కిడు" మని తనధనువు నా శ్రీరామునికిందీయ, పంచభౌతిక శక్తుల నుండియు వేరుపరచదగిన విద్యుచ్ఛక్తి సంపూరితమైన మెరుపు దీపము, భూనమ్మేళనమైన తోడనె శక్తి విహీనమై తానారిపోవు విధాన, పాపరిశాతమును తన ధనువు శ్రీరామున కందిచ్చిన తోడనే, విగత కీర్తిమంతుడై నిలచి, శ్రీరాముని స్తుతించి, ఫాల్గుణ బహుళ దశమీ దినమున పరశురాముడు మహేంద్రగిరి కేగి తపంబు సేసికొనుచు చిరకాలము జీవించెను.

సాధారణ సం॥ చైత్ర శుద్ధ విదియ నాటికి కొడుకుల తోడను కోడండ్ర తోడను దశరథు డయోధ్యంజేరుకొని సుఖంబుండె. శ్రీరాముని బాలకాండ మెల్ల నిట్లు గతించె.

---

* "శివుని చివుకు విల్లు శిక్షింబె యలనాడు
విరచినాడ ననుచు విర్రవీగ వలదు
నేడు నాదు వశమైన యీ చాపము
మెక్కువెట్టి తివియు మంతెచాలు."

## ముగింపు

"ఇక నేమూరా! పరశురాము డోడిపోయినంత మాత్రమున నీ కింత చింతయేల? వారి యెన్నటికిని జానకి లభించదను సంశయము వలదు. వారి కార్యక్రమముచొప్పున నన్నియు ముగించబడినవి గదా! ఇక మిగిలినది కేవలము బాల్యక్రీడలవంటి కాండమేగాని, బాహుబలమును బుద్ధిబలమును సంపూర్ణముగా నుపయోగించబడలేదు. వివాహ మయినంత నేమూరా? ఇల్లలికినం బండువ యయ్యెనే; ఇంతటి నుండి నీ విక వేయి కండ్లతో పని సేయవలెను. ఎట్టి యిక్కట్లు వచ్చినను సహనముతో నోర్చుకొని, నెంత దూరమైనను ఓపికతో నడచిన నింకెన్నని చిత్రవిచిత్రంబుల పచరించి మనము మన ప్రయత్నముల జయమొంద గలము. ఆందోళన దక్కి కొంచె మోపిక నీయుము. స్వల్పకాలముననే నన్నియు జూచెదుగాక!" అని మాల్యవంతుడు రావణుని సమాధాన పరచి అప్పటికి వెడలి పోయెను.



---



కలంతాజా:— తరువాతి కథ "వనవాస విభ్రమములు" అను గ్రంథమున జూడ నగును.

209

# "వేగుంజుక్క గ్రంథమాల"

పూడిపెద్దివారి వీధి, (బరంపురం, గంజాంజిల్లా.)

(Established on the 12th December 1911 in honour of the Delhi Coronation Durbar).

## This Cancels All Previous Rules.

1. వత్సరమునకు నాలుగు గ్రంథములు ప్రచురింపబడును.

2. ప్రతిగ్రంథమును ప్రచురము కాగానే శాశ్వత చందాదారుల పద్ధతిని చందాదారులకు వీ. పీ. గా పంపబడును.

3. నాలుగు గ్రంథములును పోస్టేజీలు కాక వత్సరమునకు నాల్గు రూపాయలకు మించదు. 4. ప్రవేశ రుసుము నాలుగు అణాలు మాత్రమే.

ఈ ప్రవేశ రుసుము రు 0-4-0 ముందుగా చెల్లింపవలయును; లేదా వారికి పంపబడు గ్రంథముతో వీ. పీ. మూలముగా రాబట్టుకొనబడును. ఈ గ్రంథానంతరము ప్రకటింపబడు ప్రతిగ్రంథమును క్యాలికో బైండుతో వెలువడు నని యెల్లరు ముఖ్యముగ నెఱుంగవలసిన యంశము. నూతనముగ జేరు చందాదారు లిదివరకు ప్రచురిత గ్రంథములు కొన వలెనను నియమములేదు. కోరిన యెడల చందాదారుల కిచ్చు వెలలకే నొసంగబడును.

## గ్రంథ రచనా నియమములు

1. Characterisation 2. Development of Character. 3. New ideas. 4. Historical Beauties. 5. Descriptions of Nature.

# వేగుఁజుక్క గ్రంథమాలలో

## లభించు గ్రంథములు

☞ మా చందాదారులకు క్రింది గ్రంథములలో నొకటికంటె హెచ్చుగ గోరిన 2 అణాలు విలువలో తగ్గించి, పోస్టేజి మేమే భరించి పంపుదుము. అన్నియుగోరిన రు 3-10-0. పోస్టేజిలు ప్రత్యేకము.

### నాటకత్రయము

| | |
|---|---|
| 1. విజయవిజయము | 0 10 0 |
| 2. విచిత్రవీరబొబ్బిలి లేక పద్మనాయక విక్రమము | 0 12 0 |
| 3. ప్రతిజ్ఞా చాణక్యము | 0 12 0 |

### నవలలు

| | |
|---|---|
| 1. రసపుత్ర జీవనసంధ్య | 0 14 0 |
| 2. వైకుంఠమఠము | 0 8 0 |

### పద్యకావ్యములు

| | |
|---|---|
| 1. శ్రీ తులసీరామాయణము (బాలకాండము) చందాదారులకు రూ 1-0-0 ఇతరులకు | 1 8 0 |
| 2. అభినవభర్తృహరి | 0 10 0 |

భర్తృహరినిబోలిన సుభాషిత గ్రంథము

వేగుఁజుక్క గ్రంథమాల,
పూడిపెద్దివారి వీథి,
బరంపురం, [గంజాం].

భా॥ నృసింహశర్మ,
కార్యదర్శి.

211

ఇరువది యొకటవ మరీచి ! రాఁబోవు నవల !

# నిరూపకుఁడు (The Detective)

## అను అపరాధ పరిశోధక నవల

అత్యద్భుతము ! అపూర్వము !!

పాశ్చాత్య దేశ నిరూపకులలో నిరుపమాన శేముషీ ధురీణుండని ప్రఖ్యాతి కెక్కిన షెర్లాకు హోమ్సు (Sherlock Holmes) గారి గర్భ నిర్భేదకర పర్యటనములు, నతని పరిశోధకవిధానము మన యాంధ్రలోక మిదివఱ కెఱుంగ దనియే మా నమ్మకము. అతులిత బుద్ధిమంతులగు శాస్త్ర జ్ఞానముగల దొంగల నెదుర్కొనునపుడు, అత డొనర్చిన యద్భుత కార్యములు, చదువఁగుతూహలమును, ఆలోచింప కొలఁది స్తంభీభూతత్వమును, గలుగఁజేయు ననుటకు సందియములేదు. ఇదివఱ కాంధ్రదేశమున వెలువడిన నిరూపక గ్రంథములు, పఠించిన, నిరూపకుని ప్రక్రియ లించుమించు నొక రీతిగనే యున్నవి. అటు గాక యిందు, నూతనఫక్కిని, అపూర్వాదర్శములతో, సామాన్య సాంసారిక దిన కృత్యముల యందుగల రహస్యముల, నెవ రెఱుంగనివి, భేదించి, వెల్లడించు, ఈతని చర్య లత్యాశ్చర్య జనకములు, భయానకములు, మనోల్లాస హేతువులు. మఱి చెప్పనేమి! నిరూపక నవలల ప్రియ నూహించు, చదువరులు, "షెర్లాకు హోమ్సు" ని, చదువవలెను. ఇట్టి యీ యుత్కృష్ట నవలా శిరోమణి, దరిదాపు 200 పుటలలో, నిండు కాలికో బైండుతో, ఒక రూపాయికి మాత్రమే మా చందాదారులకు రానున్నది. ఇది ఇతరులకు రూ 1—8—0 పోస్టేజి ప్రత్యేకము.

వేగుఁజుక్క గ్రంథమాల,
పూడిపెద్ది వారివీధి,
బరంపురము, (గంజాంజిల్లా.)

భా॥ నృసింహశర్మ,
కార్యదర్శి.

213

# Vegu-Jukka Book Depot

**BERHAMPUR.**

## *Reduced Prices!*

| | |
|---|---|
| 2. వాఁడేవీఁడు | 0 12 0 |
| 4. సుహృల్లత | 0 12 0 |
| 7. సగుణ (మొదటిభాగము) | 1 0 0 |
| 8. ,, (రెండవభాగము) | 0 8 0 |
| 9. ,, (మూడవభాగము) | 0 8 0 |
| 11. వేంకటరావు | 0 12 0 |
| 12. నేనే (వాఁడేవీఁడునకు 2వభా) | 0 12 0 |
| ♦13 కోటీశుతనయ (నిరూపకనవల) | 0 12 0 |
| 14. కాలూరాయి(నేనే, వాఁడేవీఁడునకు 3వ భా॥ | 1 0 0 |
| 15. ప్రతిజ్ఞాచాణక్యము | 0 12 0 |
| 16. పద్మమాలి | 0 12 0 |
| 17. నానా ఫడ్నవీస్ | 0 12 0 |
| 18 వసంతసేన, వాల్మీకి, అమృతవల్లి, కాళిదాసీయము, తాబేదార్ల కష్టములు, | 0—8—0. |

♦ 1922 సం॥మున బహుమాన పరీక్షా పఠనీయ గ్రంథముగా నేర్పడి పరీక్ష నొనర్చి, నూటపదార్లు, అర్ధ నూటపదార్లు, పావు నూటపదార్లు బహుమానము లొసంగిన గ్రంథమిది.

VEGU-JUKKA BOOK DEPOT, } **D. V. Krishna Rao,**
*Berhampore*, 1st July 1925. } *Publisher.*



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA121B186 |
| పుస్తకం పేరు | పరిణయ విభ్రమములు |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 241 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 16B, 17B, 44B, 48B |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | munisha |
| పేజీలు విడదీసినది | MUNISHA |
| స్కాన్ | Mounika |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |

BLANKS=80B,144B,152B,192B,198B